# మణి మంజరి

వాఙ్మయ - యోగ - పరిశోధన పత్రిక

శ్రీ ప్రభాకర వర్ధంతి సంచిక

సంపుటి : 3. సంచిక 2 ఆగస్టు 1983



గ్రంథ సంపాదకులు

డా॥ వేటూరి ఆనందమూర్తి







వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు

'శ్రీనివాస్' 6/2 ఆర్. టి. (న్యూ)

విజయనగర్ కాలనీ, హైదరాబాదు-500 457

ఆంధ్రప్రదేశ్

వాఙ్మయ - యోగ - పరిశోధన షాణ్మాసిక
మణిమంజరి
శ్రీ ప్రభాకర వర్ధంతి సంచిక
ఆగస్టు-1989

వార్షిక చందా : ఇరవై అయిదు రూపాయలు
విడిప్రతి : పదిహేను రూపాయలు
వెనుకటి సంచిక : పదిహేను రూపాయలు

ప్రకాశకులు :
వేటూరి ఆనందమూర్తి
వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్టు
హైదరాబాదు-500 457.

ముద్రణ :
దక్షిణ భారత ప్రెస్
ఖైరతాబాద్, హైదరాబాదు-500 004.

# సంపాదకీయం

మా యీ 'మణిమంజరి'ని ఆరంభించి ఈ యేడుతో మూడేండ్లు నిండుతున్నవి. నేటికి ఆరు సంచికలు వెలువడినవి. 'మంచిపని చేస్తున్నా'రని మణిమంజరి నందుకొని చదివి ఆనందించిన పెద్దలంటున్నారు. మధ్యలో ఆపకుండా పట్టున పత్రికను నడుపుకొస్తున్నందుకు సహృదయులు అభినందిస్తున్నారు. ప్రభుత్వ పౌర గ్రంథాలయ శాఖ సంచాలకులు కూడా మాయీ కృషిని మన్నించి రాష్ట్రంలోని కేంద్ర, నగర, శాఖా గ్రంథాలయాలు కొనుగోలు చేయవలసినదిగా ఉత్తరువు లిచ్చినారు.

మా విజ్ఞప్తులతోపాటు పత్రికలను మేమూ పదుగురకూ పంపుతునేవున్నాము. కాని మా కోర్కెను మన్నించి కొన్నవారు కొంటున్నారు. లేనివారు లేదు. ఇప్పటికీ, అచ్చువేయడం ఒక యెత్తుగాను, అమ్ముకోవడం ఒక యెత్తుగాను వున్నది. చెల్లు పడవలసిన బిల్లు బకాయీ లెన్నో వున్నవి మేము మాత్రమే కాదు గ్రంథ ప్రచురణ కర్తలందరూ ఎదుర్కొంటున్న పరిస్థితులే ఇవి.

ప్రజలు మంచి పుస్తకాలను చదువుకోవాలన్నా, రచయితలకు ప్రచురణ కర్తలకు తగినంత ప్రోత్సాహం లభించాలన్నా ఈ పరిస్థితులిలా కొనసాగరాదు. మంచి పుస్తకాలను ఎన్నికచేసి ప్రభుత్వ యంత్రాంగమే గ్రంథాలయాల నిమిత్తం తగినన్ని ప్రతులను కొనుగోలుచేసి వినియోగ దారులకందుబాటులోనికి తెచ్చే విధానాన్ని ఆలోచించవలసి వున్నది. ఈ విషయంలో ప్రస్తుత పరిస్థితులు మన రాష్ట్రంలోకన్నా పొరుగు రాష్ట్రాలలోనే కాస్త మెరుగుగా కనిపిస్తున్నవి. పరిశీలించి మేలైన వాటిని మనమూ అనుసరించటం తగును.

మణిమంజరిని ఆరేసి మాసాల కొకసారి వెలువడే పత్రికగా కాకుండా మూడు మాసాలకో నాలుగు మాసాలకో ఒకటి చొప్పున వరుస సంఖ్యలో వెలువడే సంపుటాలుగా వెలువరిస్తే బాగుండునని కొందరు మిత్రులు సూచిస్తున్నారు.

మాకున్న వనరులను, పరిమితులను దృష్టిలో పెట్టుకొని ఉచితము చేయగలమని మనవి చేస్తున్నాము.

— సంపాదకులు

# స్వవిషయము

"రవికి దీపమున నర్చ లిచ్చు పగిదివోలె"

(నన్నిచోడుని కుమారసంభవము 1-49)

ఇంతకుముందు శ్రీ ప్రభాకర పరిశోధక మండలి (హైదరాబాదు) వారు ప్రచురిస్తుండిన ఈ షాణ్మాసిక 'మణిమంజరి' వాఙ్మయ–యోగ-పరిశోధన పత్రికగా రూపుదిద్దుకొన్నది. అదే ఇప్పుడు వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియిల్ ట్రస్టు పక్షాన వెలువడుతున్నది. గురుదేవులు స్వర్గీయ శ్రీ ప్రభాకరశాస్త్రిగారి దివ్యస్మృతి కంకితమైన యీ 'మణిమంజరి' శ్రీవారి జయంతి–వర్ధంతి సందర్భాలను పురస్కరించుకొని ఏడాదికి రెండు సార్లు యథాపూర్వం ఫిబ్రవరిలోను-ఆగస్టులోను వెలువడుతున్నది. గురుదేవుల 31వ వర్ధంతిని పురస్కరించుకొని 'ప్రభాకర వర్ధంతి సంచిక' ప్రస్తుతం మీ ముందున్నది.

విడిపత్రిక-వెనుకటి సంచిక-వెల (స్వదేశంలో) రూ. 15/- (పోస్టేజి ఉచితం.

రిజిస్ట్రేషను ఖర్చులు అదనము)

సంవత్సరచందా.. రూ. 25/-( , )

సంత్సరచందా (విదేశాలకు) 8 డాలర్లు ( , )

వలసినవారు ముందుగానే సొమ్మును మనియార్డరు ద్వారాగాని, డిమాండ్ డ్రాఫ్టు ద్వారాగాని క్రింది విలాసమునకు పంపి చందాదారులు కావచ్చును. "మణిమంజరి - హైదరాబాదు" పేరున చెక్కులు పంపగోరే వారు బ్యాంకుచార్జీల నిమిత్తం అదనంగా రూ. 3/-పంపవలెను.

'మణిమంజరి' క్రొత్త శీర్షికలను సంతరించుకొంటున్నది. గురుదేవుల మౌలిక రచనలెన్నో పరంపరగ వెలువడుతున్నవి.

సంపాదకులు

మణిమంజరి

6/2RT (NEW) విజయనగర్ కాలనీ,

హైదరాబాదు–500457. ఆంధ్రప్రదేశ్.

# MESSAGE

## My Salutation

How low are our ethical standards to-day! During the past three or four decades we as a nation became utterly mean, crassly sychophantic, unashamedly lying, awfully selfish, terribly greedy and we stop at nothing to woo and win that nasty bitch-wordly success. It çan be said that since independence we have progressed not from darkness to light but in the reverse direction. In the present encircling darkness the late Sri Veturi Prabhakara Sastri shines with greater brightness. Indeed true to his name he is a source of effulgence to those who are not still dead to all the higher values of life.

A linguist and a researcher, a poet and scholar, a literary critic and social historian--Sri Prabhakara Sastri was a multisplendoured man. But what attracted me most to him was his moral fervour, his zeal to consume himself in the service of others. His love of his follow-men knew no bounds and he died, even as he lived trying to wipe the tears from the eyes of the sick, the suffering and the sorrowing. Whenever I was privileged to spend some time with him I felt uplifted, ennobled.

The main function of the Prabhakara Sastri Memorial Trust should, I think, be to revive in how-so-ever small a measure the moral fervour of that great humanist

Though a confirmed atheist, I salute his memory as a source of all that is true, noble and beautiful in man and man's life

August, 15, 1983. V. R. NARLA



కళాప్రపూర్ణ
**డాక్టర్ దాశరథి, డి. లిట్.**

హైదరాబాదు
5-9-83

# ప్రభాకర దర్శనం

"గాంధీ మహాత్ముణ్ణి నేను చూశాను" అని గర్వంగా చెప్పుకున్నట్లే, ప్రముఖ విద్వాంసులు, పరిశోధన పరమేశ్వరులైన ప్రభాకర శాస్త్రిగారిని నేను దర్శించుకున్నాను- అని గర్వంగా చెప్పుకునే వారిలో నేనొకణ్ణి.

1949 అనుకుంటాను సంయుక్త మద్రాసు రాష్ట్రి, ఆస్థాన కవిగా శతావధాని చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారి పదవీ స్వీకార మహోత్సవం విజయవాడలో జరిగింది. అప్పటి ముఖ్యమంత్రి కీ॥ శే॥ పూసపాటి కుమార స్వామి రాజాగారు ఆ సభకు హాజరైనారు. అధ్యక్షులు డాక్టర్ కట్టమంచి రామలింగా రెడ్డిగారు. విశ్వనాధవారు యెందుకో అలిగారు ఆ రోజు. "రా! నాయనా! సత్యనారాయణా! ఇది మన గురువు గారిని గౌరవించే సభ. అభిప్రాయభేదాలు వదిలేసి అందరం ఈ పండుగ జరుపుకోవాలి. కనుక నీవు వేదిక మీదికి రావాలి" అన్నారు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు. మోరదోపు పోట్ల గిత్తవంటి కవిసమ్రాట్ విశ్వనాధ వారు మెత్తపడి పోయి వేదిక మీదికివచ్చి ప్రసంగించారు.

తెలంగాణా నుండి దేవులపల్లి రామానుజరావుగారు, కాళోజీ నారాయణ రావుగారు, వెల్దుర్తి మాణిక్య రావుగారు, బూర్గుల రామకృష్ణరావుగారు, నేను, ఇంకా కొందరం ఆ సభలకు హాజరు కాగా, నేను "పూజాపంచకము" అనే పేరుతో చెళ్ళపిళ్ళ వారిపై పద్యాలు ఆశువుగా చెప్పాను. ఎవరీ పిల్లవాడు? అని చెళ్ళపిళ్ళ వారు అడిగారు. నా గురించి. పింగళి లక్ష్మీకాంతంగారు వివరించగా ప్రభాకర శాస్త్రిగారూ విన్నారు.

ఆ సాయింత్రం ఉభయప్రాంతాల రచయితల పరిచయం మళ్ళీ జరిగింది రామానుజ రావుగారు తెలంగాణా రచయితలను, లక్ష్మీకాంతంగారు ఆంధ్ర ప్రాంత రచయితలను పరిచయం చేశారు. ప్రభాకరశాస్త్రిగారు నా తలనిమిరి "నాయనా! ఇంత చిన్నతనంలో నిజాం జైళ్ళలో నానా యాతనా పడ్డావట! కవి కార్యశీలి కావాలయ్యా! ప్రాణాలతో బయట పడ్డావు. సంతోషం" అన్నారు. "అతని పద్యధార మీరు విన లేదింకా. గంగా ప్రవాహ సదృశంగా వుంటుంది" అన్నారు విశ్వనాధవారు నా గురించి ప్రభాకర శాస్త్రిగారితో.

కరీంనగరం వెండి ఫిలిగ్రీతో చేసింది—స్క్రూ తిప్పితే విచ్చుకునేలా శతపత్రాలతో పెద్ద కమలాన్ని తెలంగాణా తరఫున శతావధాని చెళ్ళపిళ్ళ వారికి బహూకరించారు బూర్గుల వారు. వచ్చిన బహుమానాలన్నిటిలో ఇది తలమానికమని అడివి బాపిరాజుగారు ప్రశంసించారు. పూసపాటి కుమారస్వామి రాజా (ముఖ్యమంత్రి) తమిళ లిపిలో వ్రాసుకొని వచ్చి తెలుగు ప్రసంగం చదివి వినిపించారు.

అప్పుడు ప్రభాకరశాస్త్రిగారి దర్శనం అయింది. బ్రహ్మతేజస్సు ముఖంలో. ఆ మూర్తిని ఈనాటికీ మరువలేను.

వారి కుమారులు, శిష్యులు, అభిమానులు, "మణిమంజరి" షాణ్మాసిక వెలువరించడం ముదావహం.

డా॥ ఆనందమూర్తిగారు శ్రీ ప్రభాకర జయంతి సంచిక (ఫిబ్రవరి-1988) నాకు ప్రసాదించారు. ఈ కృషి అత్యంత ప్రశంసనీయమైనది.

భారతిలో నలభై యేండ్లనాడు నేను చదివిన ప్రభాకరశాస్త్రిగారి పద్యాలు-"సీతాఫలము"పై వ్రాసినవి-ఇందులో కనిపించి ఆనందపడ్డాను. ఆయన అభ్యుదయపథగామి. శిష్టవ్యావహారికంలో వ్రాసేవారు.

"సీతాఫలము చాల శీతళిస్తుంది
జలుబు చేస్తుందిరా! జ్వరము వస్తుంది"

ఎంత ఆధునికంగా వున్నాయి పద్యాలు! వారి వచనం కడు మనోహరం. సవ్యసాచి ఆయన.

ఈ సంచికలో నాడీశాస్త్రం గురించిన వ్యాసం అద్భుతంగా వుంది. తమిళంలోనే ఈ నాడీగ్రంథాలు ఎక్కువ వున్నాయి. నా తమిళ మిత్రుడు "సోము" రాజాజీ శిష్యుడు- ఈ నాడీల వెంటపడి తిరుగుతూ వుండేవాడు. అతడు తమిళంలో మంచి రచయిత. పూర్తిపేరు మి ప. సోమ సుందరం. ప్రభాకరశాస్త్రిగారిని గురించి అడిగాడు. ఒక్కసారే దర్శనం చేసుకున్నాననీ మళ్ళీ కలుసుకోలేదనీ, వారి కుమారులకు ఈ నాడీ వ్యవహారంతో పరిచయమేమో తెలుసుకుంటా అన్నాను. అతను నాతో ఆకాశవాణి మద్రాసు కేంద్రంలో పనిచేసేవాడు. అతను, నేను ఆ తరువాత ఆకాశవాణి నుంచి బయట పడ్డాం.

ఈ షాణ్మాసికను వెలువరించడం వ్యయ ప్రయాసలతో కూడుకున్న పని, కాని పూజ్యులు ప్రభాకర శాస్త్రి గారి అశేష ప్రతిభ, వజ్రసంకల్పం ఈ సంపాదకులను ఆవహించి, నిరాటంకంగా పత్రిక వెలువడడానికి తోడ్పడ గలదని విశ్వసిస్తున్నాను.

ఇంతసర్వాంగ సుందరమైన సంచిక వెలువరించుతూ వుండడం ఆంధ్ర వాఙ్మయానికి అమూల్యమైన సేవ.

మా ఆనందమూర్తినీ అన్యమిత్రులనూ హార్దికంగా అభినందిస్తున్నాను. ఆర్థికంగా అభినందించే శక్తిలేని వాణ్ణి! మన్నించండి. భద్రమస్తు!

— దాశరథి



# విషయసూచిక


| | | |
|---|---|---|
| 1. సాహిత్యక జిజ్ఞాస-వేటూరి వారి యోగ జీవిత పరిణామము | 1 | ముదివేడు ప్రభాకరరావు |
| 2. ప్రజ్ఞా ప్రభాకరము | 11 | కొత్త రామకోటయ్య |
| 3 ఆశీర్వచన నవరత్నములు | 16 | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| 4. బాలకుల పలుకులు | 19 | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| 5. ముద్దుల బిడ్డడు | 20 | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| 6. కృతార్థుడు; బుద్ధదేవుడు | 21 | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| 7. సమీక్ష | 23 | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| 8. సప్తపదులు | 35 | బులుసు వెంకట రమణయ్య |
| 9. తిరుప్పావై-సప్తపదులు: పీఠిక | 43 | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| 10. తిరుప్పావై-సప్తపదులు | 45 | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| 11. లవంగి | 53 | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| 12. తంజావూరి రాజుల విగ్రహములు | 55 | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| 13 నాకు తోచిన మాట | 57 | వేటూరి ఆంజనేయులు |
| 14. లేఖ (చల్లా వారికి) | 64 | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| 15. యోగవిషయము (ఉపన్యాసము) | 65 | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| 16. Childhood Adventures-Custard Apple | 69 | Veturi Prabhakara Sastri |
| 17. నాచన సోమనాథుని ఉత్తర హరి వంశము-సవ్యాఖ్యానము | 75 | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| 18. చాటుపద్య-మణిమంజరి (సంకలనము) | 86 | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| 19. కృష్ణలీల | 87 | వేటూరి సుందరశాస్త్రి |
| 20. తర్కానందస్వామి (కథానిక) | 89 | గౌతముడు |
| 21. New yoga | 95 | |
| 22. గురుదేవుల డైరీనుండి ఒకపుట | 103 | |

23 గాంధిరామాయణం 104

24. నా ఎరుకలో 106

25. ఉదారుడు, ఉత్తమ పురుషుడు
స్వర్గీయ విస్సా అప్పారావు పంతులుగారు 111

26. Obituary note 113

27. Pragna Prabhakaram 116

28. Some ailments and
certain case sheets 120

29. Songs of Annamayya 124

30. వేటూరి ప్రభాకరశాస్త్రి మెమోరియల్ ట్రస్ట్ 125

31. వార్తలు-విశేషాలు 132

32. Our Contributors
in Manimanjari 1983 134

సంకలనం

డా॥ వేటూరి సుందరమూర్తి

శ్రద్ధాంజలి

P. Balakrishna murthy

V. Prabhakara sastri

Vissa AppaRao



# Andhra Pradesh pledges to rekindle its past glory

Andhra Pradhesh has a glorious past. The area was rich and prosperous and its People brave and courageous.

Arts and crafts flourished. During the reign of the great Satavahana, Ikshawaku, Kakatiya and Vijayanagara kings, the splendour of the Telugus spread to all corners of the country.

The new Government, under the stewardship of Sri N. T. Rama Rao, pledges to regain that prosperity and to revive the past glory.

Towards this end within a very short period of three months the new Government have taken various farreaching decisions.

Subsidy of Rs. 20/- per quintal of paddy benefitting farmers all over the State.

Construction of 2.2 lakh houses for Weaker Sections.

Supply of rice at Rs. 2/- per kilo to the poor.

Resolution passed in Assembly bestowing equal property rights on women.

Women's University at Tirupati from next academic year.

Integrated mid-day meal progromme benefitting 62-lakh School children.

Resolutions passed in Assembly abolishing Legislative Council, preventing political defections and ending pensions to former legislators.

Retirement age of Government employees lowered from 58 to 55 providing increased employment opportunities to unemployed.

Number of State-run Corporations reduced.

Office of 'Dharma Mahamatra' established to eradicate corruption in public life.

Telugu as official language upto Secretariat level.

For the prosperity of the people and allround development of the State, a 15-point programme has been formulated.

It is a blue - print for progress with special emphasis on drinking water supply, welfare of weaker sections, housing for the poor, rural electrification, land reforms and the like.

These measures are proof of the earnestness of a Government wedded to fulfill the hopes and aspirations of its people.

DIRECTOR
INFORMATION AND PUBLIC RELATIONS
ANDHRA PRADESH

# సాహిత్యక* జిజ్ఞాస – వేటూరి వారి యోగజీవిత పరిణామము

—ముదివేడు ప్రభాకరరావు

## ఉపక్రమం :

22-6-1916వ తేదీ వేటూరివారు యోగ జీవితంలో ప్రవేశించారు. తత్పూర్వంలో వారు గడిపిన సాహిత్యజీవిత మార్గానికి కొంతకాలంవరకూ ప్రతి బంధంగా నిలిచి ఎలా తొలగిపోయిందో ఈ వ్యాసంలో సాహిత్యక్షేత్రంలో ప్రసిద్ధుడైన పదకవి క్షేత్రయ్యను అనుసంధించి పరిశీలింపబడుతుంది.

జిజ్ఞాస జీవుని స్వభావం. వట్టి సాహిత్యపరిశోధ కునికి సాహితీ పరమైన జిజ్ఞాస ఉండడంలో తప్పు లేదు కాని బ్రతుకుపై నిరాశ చెంది ప్రాణపరిత్యాగం చేయాలని సంకల్పించిన వానికి జీవితాశ కల్పించి అమృతతుల్యమైన యోగాన్ని ప్రసాదించిన గురువుల దివ్యబోధానంతరంకూడా సాహితీసంబంధమైన జిజ్ఞాసలకూ-వివాదాలకూ జీవితంలో తావియ్యడం సంకాదు. కాబట్టి, వేటూరివారి గురుదేవులు యోగ జీవిత ప్రవేశానంతరం సాహితీ జిజ్ఞాస వదలి యోగ జీవిత జిజ్ఞాస నలవరచుకొమ్మని హెచ్చరించారు. ఈ హెచ్చరిక వెంటనే కార్యరూపం ధరించలేదు. ఆ 'దివ్యాజ్ఞ' కొంతకాలం విస్మృతి పథంలో పడిపోయి నిజ జీవితానుభవ పరంపరలచే క్షుబ్ధమై పైకి తేలి చేతికి అందివచ్చుటకు కొంతకాలము పట్టినది.

కాబట్టి వేటూరివారి జీవితమే యోగసాధనకు ఒక హెచ్చరిక. సర్వసామాన్య జీవికి ఏ రకమైన జిజ్ఞాస వున్నా చింతలేదు. ఒక నిర్దిష్ట ధ్యేయానికి లగించిన యోగజీవితంలో ప్రవేశించిన పిమ్మట నీ జిజ్ఞాస యోగపరంగానే వుండాలి కాని తదితర విషయ వ్యామోహవర్తితం కాకూడదు. ఇది ప్రధానంగా యోగసాధకుడు గుర్తించి అనుష్ఠింపవలసిన ప్రథమ సూత్రం.

## సాహితీజిజ్ఞాస— అదృశ్యమైన అడ్డంకులు:

క్రొత్తగా మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండా గారమున ఉద్యోగములో ప్రవేశించిన రోజుల్లో తమ సాహితీ జిజ్ఞాసకు ఏదోతెలియరాని ప్రతిబంధకములు ఎలా ఏర్పడినవో శ్రీవారే తమ స్వీయచరిత్రయైన "ప్రజ్ఞా ప్రభాకరము"లో యిలా అభివర్ణించారు.

"......నాకు వాఙ్మయ రంగమున క్రీడావినోద మనుభవింపవలెనని కొండంతకోరిక చెలరేగుచున్నను, ఆదినుండి కూడ దాని కభ్యంతరములు, ప్రతిషేధములు తరచుగా నడ్డుదగులుచు నిరుత్సాహము గొల్పుచున్న వని తెల్పుటకు. ఆ నాళ్ళలో ప్రతివాదోత్సాహము నాలో కొంత దూకులాడుచునే యుండెడిది, అయిన నేమి? స్వర్ణకారుడు సువర్ణ రజతములను గరంగించు టకై తనముందు నిప్పుల కుంపటిని నడుమ నంగార ములుచేర్చి, దానిపై కుండమూకుటిని నెలకొల్పి, కుంపటినిండ నుముక నించి యుంచుకొనును. వలసి నప్పు డంగారముల గొట్టముతో నూది యగ్ని ప్రజ్వలనము కలిగించుకొనును.. ఆ యగ్ని కుండ

* 'సాహిత్యక' మనడంలో, "యోగం" ముందు "సాహిత్యం" అల్పం కావడంవల్ల, అల్పార్థకమైన "క" ప్రత్యయం వాడబడింది-రచయిత.

మూకుటి మూఁతకు లోబడియే మండనిచ్చును గాని పైకి ఉముకలోని కెగఁబ్రాకనియ్యడు.అది నలువైపుల నుముకలోనికి వ్యాపింపజొచ్చి నప్పుడు చుట్టును నీరు వోసి చల్లార్చును. అదినుండి నాస్థితి యించుమించుగా నట్లేసాగినది. బ్రతుకు సాగించుకొనుటకు వాఙ్మయ సేవ సాధనముగా నాకేర్పడినది గాన, అందులో అరకుడుపు సాగునట్లు పనిచేయుటకే నా యంతర్యామి నన్ను మెసలనిచ్చినదిగాని యంత కెక్కువగ పని చేయుటకుగాని, యంత కెక్కువగా సాధించుటకుగాని నాకు చోటియ్యకే పోయెను."

సాహిత్యజీవితంలో ఆదినుండియే ఈ అంతర్యామి అదృశ్య హస్తంతో యోగజీవితం వైపుకు లాక్కొని వెళుతుండగా, అదృశ్యంగా వుండి అభ్యంతరాలు కల్పిస్తూ ఈసాహిత్య జిజ్ఞాసువు యొక్క మనశ్శరీరా లను బాహ్యాభ్యంతరంగా యోగానుష్ఠానానికి ఆయత్త పరచుచుండగా తానెటు పోవుచున్నాడో తెలియని పరిస్థితిలో వేటూరివారు సాహిత్యాన్నే - చిననాటినుండి తనను వెన్నంటివస్తున్న మాతృభాషా సాహిత్యాన్నే- జీవిత సర్వస్వంగా భావించడంలో తప్పులేదు. అంత ర్యామి అభీష్టం తెలియని అమాయిక జీవుడు, కేవలం తనకు సంభవించిన శారీరక వైక్లబ్యానికి పరిష్కారం తోచక ప్రాణపరిత్యాగానికి పాల్పడడంలో ఆశ్చర్యం అంతకంటేలేదు. ఇలాంటి ఒక క్లిష్టజీవిత ఘట్టంలో పరీక్షింపబడే. మహాపురుషులైన యోగులందరూ చివరికి గుర్వనుగ్రహ పాత్రులై యోగమార్గంచేత రక్షింపబడ్డారు. జీవునిలో ఆంతరంగా గురువుకోసం సాగిన అన్వేషణే బాహ్యంగా శారీరక రుగ్మతగా రూపుదాల్చి ప్రాణపరిత్యాగ సమయానికి గురువుగా సాక్షాత్కరించింది.

అలాగాక సాహితీ రంగంలోనే వారు స్థిరపడి పరిశోధనలు సాగించివుంటే ఎలా వుండేదో శ్రీవారి తమ్ములైన శ్రీ చంద్రశేఖరశాస్త్రిగారు. "నేను-మా చిన్నన్నయ్య" అనే వ్యాసంలో యిలా అన్నారు.

"ఈ యోగాభ్యాసమందు, నిరంతర చికిత్సా కలాపమందు నిమగ్నులై యుండడంచేత అంతకు పూర్వం ఆయనకున్న సాహిత్యాభినివేశం సన్నగిల్లి యోగానుభవాల ముందు సాహిత్య వ్యాసంగం 'ఉప్పన చప్పనగా' దోచింది.అట్లు కాకుండినచో సారస్వత చరిత్ర పరిశోధన రంగాలలో ఆయన కీర్తిమూర్తి ఇప్పటికంటె ఎన్నో రెట్లు ఉజ్వలంగా ప్రకాశించేది." అని 'మణిమంజరి' ప్రథమసంచిక పుట-22లో చెప్పినమాటల్లో ఎంతో సత్యముంది.

తత్త్వజిజ్ఞాసువు:

ఈ సాహిత్య సత్యాన్వేషణకంటె నిత్యసత్యాత్మ కుని అన్వేషణమే "జిజ్ఞాసు"వైన వేటూరివారిని వరించిందనడం ముమ్మాటికి సత్యం.

ఉ॥ చూచెదఁ జూచెదన్ వెలికి శూన్యమనంత మహాంతరాళమే
గోచరమౌను దానికొక గొప్పమహావరణమ్ము గ్రమ్ము లో
జూచెదఁ జూచెదన్‌బరమ సూక్ష్మముగాఁ బర మాణుబిందువే
గోచరమౌను దానికిని కొండుక యావరణమ్మె క్రమ్మెడున్.

శా॥ అజ్ఞానావరణంబు దీని నెటు పాయంద్రోయగా నేర్తునో
జిజ్ఞాసైకరసంబుగా నెవుడు నా చిత్తంబు వర్తించునో
సుజ్ఞానర్త సుఖస్వరూపుఁడగునిన్ జూడంగ నెట్లబ్బునో
ఓజ్ఞానాత్మక! ఓ సుఖాత్మక! విభూ! ఓసత్య సత్యాత్మకా!

ఈ పైపద్యాలు 'జిజ్ఞాసువు' అనే ఖండికలోనివి. 'నలుబదియేఁడ్లునిండె జననంబును దొట్టి..."అని ఈ ఖండిక ప్రారంభం కావడంచేత 1923లో ఈ పద్యాలు వ్రాసినట్లు ఊహించవచ్చు ఇలాంటి భావ పరంపర 'వదేండ్ల వయసు రాకముందే..." తమలో కలుగుతుండి నవైనాన్ని "ప్రజ్ఞా ప్రభాకరం"- బాల్య స్మృతులు- ప్రకరణంలో శ్రీవారు యిలా వివరించి వున్నారు.

**అస్తినాస్తి విచికిత్స:**

"మరణమును గూర్చి, మరణానంతర స్థితిని గూర్చి పుట్టుకను గూర్చి, పుట్టుకకు పూర్వస్థితిని గూర్చి, దేవతలను గూర్చి నిరంతర చింత నాకు రేగెను పెద్దల నడుగ జాలనైతిని. తోడి వయసు వారికి నాగోడు తెలుపుట వ్యర్థమయ్యెను. వీని యాథార్థ్యము తెలియ వలెనని రాత్రులందు భగవంతునికి మ్రొక్కి కనులు మూసికొని సమాధానమా ప్రతీక్షింప సాగితిని. కనులు మూసికొని చూడసాగగా చిమచిమ చిమ్మ చీకటి నన్ను చుట్టుముట్టి మహాసముద్రమువలె గోచరింపసాగెను. దాని మధ్యభాగమున నేనున్నట్టు తెలియును. అనంత ముగా నన్ను చుట్టుముట్టి యున్నట్టి యా యంధకా రము పొడుగుగా నున్నదా? వతురస్రముగా నున్నదా? అని కూడ జూడదొడగితిని. అది యేదో గోళాకారముగా నున్నట్టు తోచును. దానినడుమ, 'నేను ఉన్నాను ఉన్నా' నన్న ప్రజ్ఞమాత్రము మినుకుమినుకు మనుచు గజిబిజి పాటుతో దోచుచుండెను"

"జిజ్ఞాసైకరసంబుగా నపుడు నా చిత్తంబు వర్తించునో" అనడంలో సాహిత్యజిజ్ఞాస నుండి యోగ జిజ్ఞాస వైపుకు శ్రీవారి జీవితం మళ్లడం గమనించ వచ్చు. 'జిజ్ఞాసువు'లో చివరి చరణాలు యిలా వున్నాయి.

—"వలతును సత్యమున్ సుఖము వాంఛ యొనర్తును
దెల్వి గోరుదున్
గిల గిల లాడుదున్ ఫల మొకింతయు లేద
యిదేమి యీశ్వరా!"

"...అట్లు కనులు మూసికొని బైటకు జూచు చున్నట్లు చూచుటే కాని యప్పుడు నా దేహములోనికి జూచుకొనుట యన్నది నే నెఱుగను? అట్లు చూడ లేదు. బైటి యంధకార గోళమున నుండి నా ప్రశ్న లకు సమాధానములు దొరకలేదు...నే నున్నానని మినుకు మినుకు మను అణు మాత్రపు వెల్తురే యున్నది. ఇది ప్రజర్విల్లరాదా? ఈ చింత హెచ్చి నది." (ప్రజ్ఞా ప్రభాకరము-పుట-10)

**విద్యా వ్యాసంగము :**

"చెళ్ళపిళ్ల వెంకటశాస్త్రి దగ్గఱ పుస్తకము పట్టి చదివిన దానికంటె వారి ముఖతః వినోద గోష్ఠిలో విని నేర్చినది చాలా. ఆధ్యాత్మిక విషయమున బందరు వాసమునఁగాని శ్రీ శాస్త్రిగారి సన్నిధిని గాని నాకు కలిగిన యుద్బోధమేమియు లేదనియె యనవలెను. అంతేకాదు శ్రీ శాస్త్రిగారి సన్నిధిని అవధాన ధార ణలు, పద్యరచనలు, ఉపన్యాస వినోదములు, కవితా కల్పనములు, వాద ప్రతివాదములు, అహంతలు, మమతలు బలసి ఆధ్యాత్మ చింత యంతర్థాన మందిన దనవలెను." అని ప్రజ్ఞా ప్రభాకరంలో చెప్పికొన్నారు శాస్త్రిగారు.

ఈ విద్యా వినోదములకు తోడు స్వగ్రామంలో వేశ్యా వినోదములు శాస్త్రిగారికి సాహిత్య విముఖతకు దారి తీసినది. సాహిత్య వ్యాసంగపు ప్రథమ దశలో వారు కూడా కట్టుకథలు (కథానికలు) అల్లసాగిన వారే. ఉదాహరణకు కలికి-చిలుక, కరుణకము. సీత పరాభవము, పల్లెటూరి బావ, మా మేనత్త, కాకి పగ వంటి కథలు.

ఇందులో ప్రకృతము 'కరుణకము' అనే కథ నుండి క్షేత్రయ్యను గురించి వ్రాసిన కొన్ని పంక్తు లలో ఆ సుప్రసిద్ధ పదకవిని గురించి వారి అభిప్రా యాలను క్రోడీకరించి, ఆనాటి సమాజంలో క్షేత్రయ్య పదాలకుండే గానాభినయ రసికత వేశ్యలతో ఎలా ముడిపడి వుండేదో, అలాంటి ఒకటి రెండు ప్రదర్శన లకు ప్రేక్షకుడుగా పాల్గొన్న తమ కెలాంటి అను భూతులు కల్గాయో చివరికి తామటువంటి ప్రదర్శనలలో పాల్గొన కూడదని ఎలా నిర్ణయించుకొన్నారో తెలిపే వివిధ జీవిత ఘట్టాలను వరుసగా పరామర్శిద్దాము.

## క్షేత్రయ్య :

'కృష్ణా జిల్లాలో మొవ్వ అని ఒక గ్రామమున్నది. ఆంధ్ర దేశమందు మువ్వ గోపాల పదాలు వినని, విని ఆనందించని రసికులు అరుదుగా ఉంటారు ఆ పదములను రచించిన కవి ఆ వూరి వాడే నంటారు. సంగీత సాహిత్యములు ఆ వూరి నీరు తాగితే పట్టుపడునని పూర్వము పెద్దలు చెప్పుకొనేవారు. ఇప్పుడట్టి దేమీ తెలియరాదు. కృష్ణకాలువ వచ్చి ఆ భూమి మాగాణి కావడము చేత నీటి గుణము మారినదని అక్కడి వారంటారు కాబోలును! పూర్వకాల మక్కడ సంగీత విద్వాంసులనేకులు ఉండేవారట!

ఆ వూరికి చేరువనే కూచిపూడి అని ఒక గ్రామమున్నది. ఆ వూరి వారందరు భాగవతము లాడుదురు ............పయి రెండు గ్రామములు చేరువగా ఉండడము చేత ఆ వూరివారివిద్య ఈ వూరివారికి, ఈ వూరివారివిద్య ఆవూరివారికి అంటుతూ కూడా ఉండేవట! పూర్వ కాలమున, నేనిప్పుడు చెప్పబోయే కథలోనివారు హరి రామయ్యగా రొక్కరు తప్ప ఈ మధ్య కాలములో మొవ్వలో సంగీత విద్వాంసులు మరెవ్వరూ లేరు.

రామయ్యగారు 1860 ప్రాంతముల జన్మించియుందురు. ఆయన పసితనము నాటికి త్యాగరాజ కృతు లంతగా వ్యాపించలేదట! హరి రామయ్యగారు బాల్యములో బహుప్రఖ్యాతిగా వీణ వాయించే వారని, పాడేవారని, ఎరిగినవారివల్ల విన్నాను.

మైసూరు వీణ సాంబన్నగారు మొవ్వలో హరి రామయ్యగారి వీణాగానమును విని ఆనంద పరవశులై మైసూరుకు పిలుచుకొని పోయి మహారాజు దర్బారులో పాడించి గొప్ప సత్కారము చేయించిరట[1]!'

"క్షేత్రయ్య పదముల" గ్రంథ సంపాదకులు, ఆంధ్ర గాన కళాపరిషత్తు మద్రాసు కమిటీ కన్వీనరు శ్రీ విస్సా అప్పారావుగారు "విజ్ఞప్తి"లో ప్రభాకరులను గురించి యీ క్రింది విధంగా వ్రాశారు.

"ఏడెనిమిది సంవత్సరముల క్రిందట ప్రాచ్య లిఖిత పుస్తకాలయములో "క్షేత్రయ్య పదములు" అనే వ్రాతపతి కలదు. అది చాలా ముఖ్యమైనదని నా యభిప్రాయము. దానిని పరిశీలించి వెలువరించండి' అని ఈ మధ్యనే దివంగతులైన శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు నాతో చెప్పియుండిరి. వారి ఆదేశ ప్రకారము మా కమిటీవారు నేటి కీ గ్రంథమును వెలువరించగలిగిరి.'

'ఈ మధ్యన ప్రభాకరశాస్త్రిగారు చాల జబ్బుగా ఉండగా నేను వెళ్ళియుంటిని కొంతవారికి తెరిపిగా ఉన్న సమయములో ఈ క్షేత్రయ్య పదముల సంపుటమును, పీఠిక వగైరాలు, త్రివర్ణ చిత్రములు సహా వారికి చూపించే భాగ్యము గలిగినది. వారు సావకాశముగా వాటిని చదివి చూచి 'చాలా పనిచేసియున్నారే' అని అన్నారు. అంతకంటె వారియొక్క పరిశీలనా ఫలితములు పొంద వీలుకలుగలేదు. రక్తాక్షి సం॥ శ్రావణ మాసములోని 'భారతి'లో వ్రాసిన 'కరుణకము' అనే కథలో క్షేత్రయ్య ప్రశంసచేసి అతను మువ్వ కాపురస్థుడని వ్రాసినట్లు అప్పుడు వారు నాకు చెప్పియున్నారు. ఆ కథలో కొంత విషయమును యిందచ్చువేయుటకు అనుజ్ఞ ఇచ్చిరి.[2] (పుట-iii)

---

1. కరుణకము – (కథానిక)—వేటూరి ప్రభాకరశాస్త్రి 'భారతి' — రక్తాక్షి-శ్రావణమాసము.
2. క్షేత్రయ్య పదములు (శృంగార మంజరి) - సంపా. విస్సా అప్పారావు. ఆంధ్ర గాన కళాపరిషత్తు, రాజమహేంద్రవరము, 1950

"కరుణకము" కథలోని విషయమే అప్పారావుగారు స్మరించారుగాని, "స్మృతిపథంలో" అన్నవ్యాసంలో ప్రజ్ఞాప్రభాకరంలో వేటూరివారు క్షేత్రయ్యనుగురించి చెప్పారు.

## సీతారామాచార్యులు–క్షేత్రయ్య ప్రామాణికత :

క్షేత్రయ్యను గూర్చి వేటూరివారు మరొక వ్యాసంలో యిలా పేర్కొన్నారు. "ఒకనాడు శబ్ద రత్నాకర కారులను కొక్కొండ వేంకట రత్నము పంతులుగా రాక్షేపించిరట! 'మీనిఘంటువున క్షేత్రయ పదములను గూడ ప్రమాణముగా గ్రహించిరి. రాతాయ (ఆయె (అనుటకు) పోయ(పోయెన్ అనుటకు) అని యాతని పదములలో ప్రయోగములుకూడ మీకు పరిగ్రాహ్యము లయినపుడు మీ నిఘంటువునకు ప్రామాణ్యము సిద్ధిం చదు" అని. సీతారామాచార్యులుగారు వేశ్యాభిరుచి హెచ్చుగాగలవారట! క్షేత్రయ పదములను వేశ్య లభినయించుట, వారభినందించుట పరిపాటియట! "క్షేత్రయ ప్రామాణికుడైన సత్కవి కాకపోతే, ఆంధ్రమున నిక సత్కవి యుండడు. క్షేత్రయ రచనము అక్షరాక్షరమును పరమ ప్రమాణమే! పోయ, ఆయ ఇత్యాదులు పంచతంత్రకారుడును ప్రయోగించి నాడు. మీకు క్షేత్రయ రచనము గ్రాహ్యము కాక పోవచ్చును. లోకమున సహృదయత యంతరించి పోదు. నా నిఘంటువు నాదరించువారుండక పోరు" అనిరట! (పుటలు 113-114)

. . .		. . .		. . .

## క్షేత్రయ్య పదాలు - వేశ్యాభినయం :

"1907 సంవత్సరమున మదరాసులో నేను శ్రీ పనప్పాకం అనంతాచార్యులుగారి వాత్సల్యమునకు పాల్పడినాను. పండిత గోపాలాచార్లుగారు నన్ను వారికెరుకపఱిచినారు. వారికి శ్రీనివాసాచార్యులుగారని బి ఏ.బి.యల్. కుమారుడు. ఆయన తెల్గు కవిత నేర్చినవాడు. తండ్రి అనంతాచార్యులుగారు విద్యా వినోద, విశారద బిరుదాంకితుడు . . . . . అనంతా చార్లుగారికి తెలుగువారంటే చాలా ప్రీతి . . . . . అనంతాచార్యులుగా రెప్పుడూ ఆంధ్ర పండిత గోష్ఠిలో ఉండేవారు. నేను మద్రాసు వెళ్ళిన తర్వాత వారు వైకుంఠ వాసులయ్యేటంత వఱకూ వారానికి నాలు గైదు రోజులయినా నేను వారి యింటికి వెళ్ళేవాడను. ......... అనంతాచార్యులు గారును వేశ్యాభినయ రసికులు. వారెందఱనో వేశ్యలను క్షేత్రయ పదముల నభినయించు వారినిగా జేసిరట! పండిత గోపాలా చార్యులగారి మేడ మీద నా యేడు నవరాత్రులలో గాన సభలు జరిగినవి. ఆ సభలకు అనంతాచార్యులు గారు ప్రసిడెంటు-తొమ్మిది నాళ్ళును స్త్రీలే గాయనులు. పురుషుల పాటలందులేవు. ఆ కచ్చేరీలకు, పొన్నూరి నుండి ఆంధ్ర గాయకరత్నము రామసుబ్బయ్యగారును వచ్చియుండిరి. కాని వారి పాట కచ్చేరీ లేదు. అనంతా చార్యులుగారు నన్ను, రామసుబ్బయ్య గారిని, తమ కుమారుని, ఆ కచ్చేరీలకు తోడ్కొని పోయెడి వారు మాకు టికెట్టులేదు. తొమ్మిది రోజుల పాట కచ్చేరీ లలోనూ, క్షేత్రయ్య పదములను కొందఱు వేశ్యలచేఁ బాడించిరి. ఒక వేశ్య క్షేత్రయ పదమును సాభినయ ముగా పాడెను. నాకు క్షేత్రయ పదముల గానాభినయ ఘనత నాటికి నేటికి కూడ నపరిచితమే. కాని కొన్ని నెలల క్రింద, శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారు సీతారామాచార్యులు గారు ప్రస్తుతించినట్టుగానే, క్షేత్రయను ప్రస్తుతించిరి. సీతారామాచార్యులు గారన్న విషయమును శర్మగా రెఱిగి యుండ రనుకొంటాను. క్షేత్రయ ఘనతను తార్కాణించుటకై యిది పేర్కొ న్నాను."

(పుట-112 మరియు 114)

ఈ పైన వివరించిన వాక్యాలు వేటూరివారు 1944 సంవత్సరం మార్చి 5, ఆదివారం ఆంధ్రపత్రికలో ప్రకటించిన 'స్మృతిపథంలో' అన్న వ్యాసంలోనివి ఈ వ్యాసం యథాతథంగా 'మ ఞ్జ మ ం జ రి వాఙ్మయ-యోగ-పరిశోధన పత్రిక సంపుటం-1, సంచిక-2 ఆగస్టు 1981 లో పునర్ముద్రితమైంది. ఈ వ్యాసంలో గురుదేవులు తాము మద్రాసు చేరిన తొలి

దినాలలో అక్కడుండిన సాంస్కృతికవాతావరణాన్ని తామనుభవించిన సాహిత్యగోష్ఠిని విశదీకరించారు.

## పండిట్ జీ-ప్రభాకరశాస్త్రి

ఇక్కడ మరొక ముఖ్యవిషయం గమనించాలి. శ్రీ పనప్పాకం అనంతాచార్యులుగారితో వేటూరి వారిని పరిచయం చేసింది పండిత గోపాచార్యులుగారని వేటూరివారే చెప్పారు "పండిట్ జీ" అని ప్రఖ్యాతి గడించిన పండిత డీవి గోపాలాచార్యులే వీరు పైగా అనంతాచార్యులు గారు "అనంతాచార్లు" అని తెలుగు పలుకుబడి గుర్తుగా దస్కతు చేస్తే తాను "గోపాలాచార్లు" అని సంతకం చేసేవారట! ఈ విషయం కూడా వేటూరి వారే వ్రాశారు. ఇంకా పండిత గోపాల చార్యుల గారి మేడమీద నవరాత్రులలో గానసభలు ప్రతియేడు జరిగేవని దానికి ప్రెసిడెంటు అనంతాచార్యులుగారని ఆ కచ్చేరీలకు తాము తప్పక హాజరైనట్లు పై వ్యాసంలో పేర్కొన్నారు.

ఇంతగా పండిత డి. గోపాలాచార్యులు గారితో సన్నిహిత పరిచయం గల్గిన వేటూరివారిని డా. నారాయణం కేశవాచార్యులు గారిచే సేకరించబడి డా. డి. వి ఏ ఆచార్యగారిచే రచింపబడి శ్రీ విఖనస గ్రంథ మండలి, పొన్నూరు వారిచే, జూలై 1958 లో 6 వ పుష్పముగా ప్రకటింపబడిన "పండిత గోపాలాచార్య జీవిత చరిత్రము"లో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారిని గురించి ఒక్కముక్కలేకపోవడం ఆశ్చర్యంగా వుంది. అది గ్రంథకర్త లోపం అయివుండదు కాని గ్రంథసేకరణకర్త లోపం అని చెప్పాలి.

21 వ అధ్యాయంలో 130 పుట తర్వాత "బాల్య మిత్రుడు కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు గారితో పండిట్ జీ" తీయించుకున్న ఫోటో ప్రచురింపబడింది. అదే పుటలో ఈ క్రిందివిధంగా వ్రాయబడింది. '1920 సంవత్సరం వచ్చింది. ఒకరోజు పండిట్ జీ అస్వస్థతతో పడక కుర్చీలో కూర్చున్నారు. ఇంతలో పండిట్ జీ బాల్యస్నేహితులైన కాశీనాథ నాగేశ్వరరావు పంతులు గారు విచ్చేశారు కొంత సంభాషణ జరిగిన తరువాత పంతులుగారు తానొక తొందరపని మీద నగరాంతరం పోవాలనిపలికారు. పండిట్ జీ గద్గదంగా అన్నారు. 'నాగేశ్వరరావు! వెళ్ళవద్దు. నీవు తిరిగివచ్చే సరికి నేను కనబడను' అని. పంతులుగారు కంటతడి పెట్టి పండిట్ జీని ఓదార్చారు. వారా మాటలను సర్వ సామాన్యమైన అస్వస్థునిదీనాలాపములుగా మొదట వ్యాఖ్యానించుకున్నారు. నగరాంతరంవెళ్ళడంతప్పనిసరి అయింది పండిట్ జీ పలుకుల్లోని అంతరార్థం తరువాతగానీ పంతులుగారికి బోధపడలేదు. రౌద్రి సంవత్సర భాద్రపద బహుళ పాడ్యమీ బుధవారం (29-9-1920) పండిట్ జీ నిర్యాణదినం."

## ప్రథమ ప్రతిజ్ఞ

శ్రీ వేంకటశాస్త్రి గారికడ విద్యావినోదములతో కాలము వెళ్ళబుచ్చుచున్న ప్రభాకరశాస్త్రి గారు వారి యన్నగారి వివాహసందర్భమున వేశ్యా వినోదములు చూచి రోతపుట్టిన సంగతిని తమ 'ప్రజ్ఞాప్రభాకరము' లో నీ క్రింది విధముగా వివరించినారు.

". . . . మా యన్నగారికి వివాహము జరిగినది. ఆ వివాహము జరపినవారు నా పెదతండ్రి గారి బావ మఱది. సంగీత సాహిత్య విద్యారసికులు, దివిసీమ లోని చోడవర గ్రామమున నెంకొన్నవారు, శ్రీలంక నాగేశ్వరశాస్త్రి గారు వారికి నామీఁద చాల వాత్సల్యము. ఆయన విధురులు. సంతతి లేదు. విద్యావినోదులే కాక వేశ్యావినోదులును. మా యన్నగారి వివాహము తర్వాతఁ గొన్నాళ్ల కొక పుత్రస్వీకారముకూడ వారు చేసికొనిరి. ఆ కుఱ్ఱవాని కుపనయనము చేసిరి ఆ వివాహమునకు నుపనయనమునకును గొప్పగా భోగపు మేళములు ప్రాతస్సాయంకాలములందు, రాత్రులందుఁ గూడ జరుగసాగినవి. వానినిఁ జూచుట కుద్యోగులు పలువురువచ్చుట జరగెను. ఉపనయనము జరగిన తర్వాత కొన్నాళ్ళు నన్నక్కడ నిర్బంధించి వారు నిలుపుకొనిరి. సంస్కృత నాటక కథలు, కాదం

బరీ కథ నన్ను మా మేనమామ గారు వేశ్యా పరివారి తులయి చెప్పగోరుమండిరి. నేనును చెప్పుచుంటిని. ఎన్నాళ్లక్కడుండుట? పదినాళ్లయిన తర్వాత ఆ యూర నుండి మా యూరికి వచ్చివేసితిని."

"ఆ వేశ్యల శృంగారములు, ఆటపాటలు, నేను కథలు చెప్పుచున్నప్పుడు వారు నెఱపిన సౌహార్దము, వారి హాస్యగాడు బ్రాహ్మణవృద్ధుడు, సంగీతసాహిత్య రసికుడు నన్ను మెచ్చు చుండుట, మా మేనమామ గారు ప్రతివత్సరము వేసగి సెలవులలో—శ్రీవెంకట శాస్త్రిగారు బందరు విడిచి వెళ్ళుదురుగాన— తమ యూరికి వచ్చి యుండుమని కోరుట నన్ను ముగ్ధుని జేసివైచినవి. మాయూరు విడిచి బందరుకేగి వారపు మెదుకులు తినుచు చదువుకొనుట వెగటు గొల్పసాగి నది. ఇల్లువిడిచి పదునాలుమైళ్ళు నడిచివెళ్ళుట యెప్పు డును పరిపాటియే యైనను నాకప్పుడది చాల బాధ గొల్పినది. ఒకటి రెండు ఫర్లాంగులు వెళ్ళుచే నాకు చాల కష్టమయ్యెను. అక్కడ నొక బురదకాల్వ దాట వలెను. వెనుకకు తిరిగి పోవుదునా యని తోచెను. బట్టలు సర్దుకొనుచు కొంచెముసేపు కూర్చుండి యోచించితిని. ఎన్నో చీకాకులు రేగినవి. శ్రీవీరేశ లింగము పంతులుగారి ప్రహసనములు, ఉపన్యాస ములు నంతకు ముందు చదివి యుంటిని. వేశ్యల గూర్చి వారు వ్రాసిన వెల్ల తలఁపునఁ బాఱినవి. ఇక నిట్టి గోష్ఠుల కెన్నడుగాని పోరాదని శపథము చేసి కొంటిని. క్రీ. 1904 ప్రాంతముల మాటయిది. అటు తర్వాత నే నెన్నఁడును వేశ్యాభినయ దర్శనమునకు బోయి నట్టెఱుక లేదు"

(పుటలు 33-35)

పైవిధంగా వేటూరివారు అన్నప్పటికి 1907లో వనస్పాకం అనంతాచార్యులు గారి మేడమీద ప్రతి యేట జరుగు నవరాత్రి సందర్భంలో జరుగు గానసభ లలో పాల్గొన్నట్లును, ఆ తొమ్మిది రోజుల పాట కచ్చేరీలలోను క్షేత్రయపదములు వేశ్యలు పాడిన ట్లును, ఒకవేశ్య క్షేత్రయ పదమును సాభినయముగా పాడినట్లును, శ్రీవారు తమ "స్మృతిపథంలో...." అన్న వ్యాసం (ఆంధ్రపత్రిక 5-3-1944) మరియు చూ॥ మణిమంజరి, పుట-114, VOL. 1.NO. 2 అగష్టు 1981)లో వ్రాశారు. 1948 నాటి ప్రజ్ఞాప్రభా కర రచనా సమయానికి పై ఘట్టం స్మృతిపథంనుండి తప్పి వుండవచ్చు.

పైవ్యాసంలోనే వేటూరి వారిలా అన్నారు. "నాకు క్షేత్రయ పదముల గానాభినయఘనత నాటికి నేటికి కూడ నపరిచితమే. కాని కొన్ని నెలల క్రింద శ్రీరాళ్ల పల్లి అనంతకృష్ణ శర్మగారు సీతారామాచార్యులుగారు ప్రస్తుతించినట్టుగానే క్షేత్రయను ప్రస్తుతించిరి."

వేటూరివారి వియ్యంకులైన విస్సా అప్పారావు గారు క్షేత్రయ్యపదములను పరిష్కరించి విపులపీఠి కాదుల సమకూర్చి ప్రచురించినవారు. వీరు11-8-63 లో విజయవాడలో క్షేత్రయ్య పదసాహిత్యముపై జరి గిన ఉపన్యాసములలో పాల్గొని "క్షేత్రయ్య పదముల నాట్యానుకూలత" పై ప్రసంగించిరి. ఈ ఉపన్యాస పాఠంఆం ధ్ర ప్ర దే శ్ సా హి త్య అ కా డె మీ హైదరాబాద్ వారు సాహిత్యోపన్యాసములు-శివసంపు టముగా 1963లో ముద్రించి వెలువరించిరి. అదే సద స్సులో "క్షేత్రయ్య పద కవిత్వము"పై రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు ప్రసంగించిరి

**క్షేత్రయ్యపదాలు-ఆధునికుల విమర్శ :-**

అప్రస్తుతమైనా యిక్కడ ఒక్క విషయం మనవి చేస్తాను. ఎవరినీ విమర్శించడం కాదు. ఈకాలంలోకూడా కొందఱు క్షేత్రయ్య పదాలు శృంగార భూయిష్ఠమని ఏవగించు కొంటున్నారు అలాంటి వారికి శ్రీ పాతల వెంకట రాజమన్నారుగారు క్షేత్రయ్య పదములకు "తొలిపలుకు"లో యిలా అన్నారు.

"ఈ కాలవారు కొందరు ఈ పదాలలో పచ్చి శృంగారం చాలా ఉందని ఆక్షేపించవచ్చును. అ

తప్పు (అది తప్పయితే) ఆయనది కాదు, బలహీను లైన ఈకాలం వారిదే. అజీర్ణ వ్యాధిగ్రస్తునకుపనసకూర అపథ్యమైతే తప్పు పనసకూరదా? మనతాతలుతిన్నంత మనం తినగలుగుతున్నామా? మన జీర్ణశక్తి తగ్గిపో యింది. జీర్ణశక్తితోపాటు రసాస్వాదన శక్తికూడా మనకు తగ్గిపోయింది. అంతే!

కొన్ని పదాలు విని కొందరు చెవులు మూసుకో వచ్చును. ఏ పదంగాని రసవంతమైతే అశ్లీలం ఎలా గవుతుంది. ఇదీ నా సమాధానం.

(పుట—vii)

క్షేత్రయ్య ప్రశంస-రాళ్లపల్లి – బహుజనపల్లి :—

ఇక రాళ్ళపల్లివారుకూడా బహుజనపల్లివారివలె క్షేత్రయ్యను ప్రస్తుతించారని తాళ్ళపాక వారి వాఙ్మ యాన్నంతటినీ త్రవ్వి తీసిన వేటూరివారు పేర్కొ న్నారు. రాళ్ళపల్లివారే బహుజనపల్లవారిని పేర్కొన్న సందర్భం ఒకటి మనవి చేస్తాను.

"శకకర్త శాలివాహన చక్రవర్తి తనకాలంలో కోట్లకొలదిగా వుండిన జానపద ప్రాకృత గాథలలో ఏర్చి సప్తశతిని కూర్చినాడు. తరువాత వాటిని ఉదా హరించి దీవించి చర్చింపని ఆలంకారికుడు లేడు. తెలుగులో బహుజనపల్లి సీ తా రా మా చా ర్యు లు క్షేత్రయ్య పదాలకు ఇట్టిస్థానం సంపాదించే ప్రయ త్నం మహాభయంతో కొంత చేసినాడు. కాని అప్పటి ఆంగ్ల సంప్రదాయప్రవాహంలో ఆయన యెత్తిన చేయి యెవరికంటికీ పడలేదు. ఇటీవల త్యాగయ్యగారి రచనలగూర్చి కూడా ఇటువంటి ప్రయత్నం కొంత జరుగుతూవుంది."అని "కన్నడ జానపదసాహిత్యం" అనే వ్యాసంలో (విజయవాణి-3-1-51) రాళ్ళపల్లి వారు పేర్కొన్నారు.

ఈ విధంగా క్షేత్రయ్య పదములపై బహుజనపల్లి వారికృషిని గురించి వేటూరివారు,కొక్కొండ వెంకట రత్నం పంతులతో సీతారామాచార్యుల వివాదాన్ని స్మరించడం పై రాళపల్లివారి స్మరణకు ఉపబలక మౌతోంది.వేటూరివారి వ్యాసం 1944 నాటిది కాగా రాళపల్లివారిది 1951 నాటిది.

యోగజిజ్ఞాసువు:

చివరగా ఒక్కమాట అనాదృతమైన విస్మృత మైన తాళ్ళపాకవారి వాఙ్మయాన్ని పునరుద్ధరించిన వేటూరివారు క్షేత్రయ్యను గురించి అంతగా పట్టించు కోక పోవడంలో కారణమేమై వుంటుంది అని ఆలో చిస్తే నాకు ఒక్కటే సమాధానం లభించింది. ఆది నుండి గంభీర ఉదాత్త మనస్కులై యోగమార్గాభి లాషులైన వేటూరివారు గీతలో భగవంతుడు చెప్పి నట్లుగా-

ధ్యాయతో విషయాన్పుంసః
సంగ స్తేషూప జాయతే
సంగాత్సంజాయతే కామః
కామాత్క్రోధోభి జాయతే

మనుజుడు శబ్దాది విషయములను చింతించు చుండుట వలన ఆ విషయములం దాసక్తి జనించు చున్నది. ఆట్టి యాసక్తిచే దానియందాతనికి కోరిక ఉదయించుచున్నది. ఆ కోరికవలన కోపము పుట్టు చున్నది.

విషయా వినివర్తంతే
నిరాహారస్య దేహినః
రసవర్జం రసోఽప్యస్య
పరందృష్ట్వా నివర్తతే

శబ్దాది విషయములను స్వీకరింపనట్టి జీవునకు, ఆ విషయములు తొలుగుచున్నవేకాని వానింగూర్చిన వాసన పోవుటలేదు. పరమాత్మను దర్శించినచో ఆ వాసనయు విషయములతోబాటు తొలగి పోవుచున్నది.

తాని సర్వాణి సంయమ్య
యుక్త ఆసీత మత్పరః
వశే హి యస్యేంద్రియాణి
తస్య ప్రజ్ఞాప్రతిష్ఠితా.

బలవత్తరములగు అట్టి యింద్రియములన్నిటిని చక్కగా వశపఱచుకొని సాధకుడు మనఃస్థిరత్వము (సమాధి) గలవాడై నాయందే (ఆత్మయందే) ఆసక్తమైన మనస్సు గల్గియుండవలెను. ఏల యనగా ఎవని యింద్రియములు స్వాధీనము నందుండునో, అతని జ్ఞానమే సుస్థిరమై వెలయగలదు.

## ఆజ్ఞ-ప్రతిజ్ఞ-ప్రజ్ఞ

ఈ విధంగా భగవంతుడు 'స్థితప్రజ్ఞస్తదోచ్యతే' "స్థితధీర్మునిరుచ్యతే" "తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా" అని సాంఖ్యయోగంలో ఐదు శోకాలు చెప్పినది వేటూరివారి పట్ల సార్థకమౌతున్నాయి. 'ప్రజ్ఞాప్రభాకరం' నుండి యితఃపూర్వం ఉదాహరించిన వేశ్యాభినయ ఘట్టం— తర్వాత వారు తీసుకొన్న శపథం— రెండూ పునరాలోచిస్తే 'ప్రజ్ఞ' వైపుగా వారి జీవితపథం ఎలా పయనించిందీ మనకు అవగతమౌతుంది.

దీనికితోడు శ్రీవారి యోగగురువులైన సి.వి.వి. గారి మందలింపు, తీవ్రమైన హెచ్చరికను గురించి ముక్త్యాలలో జరిగిన నవ్యసాహిత్య పరిషత్తు, అధ్యక్షోపన్యాసము (1946) లో వేటూరి వారే యిలా అభివర్ణించారు.

## గుర్వాజ్ఞ

"గ్రంథార్జనము మీదా, సాహిత్య వినోదముమీదా నా బుద్ధి వుండేది. కాని నా ఆధ్యాత్మికసాధన సాగుతూనే ఉండేది. ఏటేటా రెండు తూర్లు కుంభకోణము వెళ్ళడము మామూలు. 1921 లో కాబోలు నేను మరి కొందరము మిత్రులమూ కుంభకోణము వెళ్ళినపుడు భాషలను గూర్చి ఫైలాలజీని గూర్చి తీవ్రముగా చర్చించుకొంటున్నాము. గురుదేవు లది విని నన్ను మందలించినారు. "అస్పష్టముగా ఉన్న యెఱుకతో లోకసామాన్యముతో పాటుగా ఈ వాదాభినివేశములు నీకు ఉండరాదు. వీనిని విడనాడుము' అని.[1] అప్పుడు ఊఁకొట్టి ఊరకొంటిని. పదకొండు గంటల వేళ మరల అక్కడకు వచ్చి ఆ చర్చను గుర్తించి నవ్వి వెళ్ళిపోయిరి. సాయంకాలము దివ్యోపన్యాసమున ప్రత్యేకముగా అందరిముందూ నా పేరెత్తి 'ఈతడు వాఙ్మయ విషయములందు తీవ్రాభినివేశముతో నున్నాడు. ఇది యీతనిని చాలా చిక్కుల లోనికి దింపగలదు. చాలా ఇబ్బందులు పడగలడు. అటు తరువాత గాని, గుర్తింపవలసిన విషయముల గుర్తింపబూనడు'[2] ఇత్యాదిగా ఇంకా మరికొన్ని విషయములు కూడా అనిరి. తలవంచుకొంటిని. దేశాటనమూ, పుస్తకార్జనమూ జరుపుతూ అటుపై ఐదారేండ్ల దాకా నేను మామూలుస్థితిలోనే ఉన్నాను. గురుదేవుల ఆనాటి "దివ్యాజ్ఞ" నాలో ఎక్కడ అడగి ఉన్నదో గాని ఆ స్మరణమే నాకు మరల కలుగలేదు. కాని యోగసాధన జరుపుతూనే ఉన్నాను. కొన్నాళ్లకు గ్రంథార్జన పర్యటనోద్యమము ముగిసినది. వాఙ్మయాది పరిశ్రమములలో నేను అనేక విధములయిన తగాయిదాలలో తగుల్కొన్నాను. ఆ తగాయిదా లనేకులతో. అవి శ్రుతి మించినవి."

## ద్వితీయప్రతిజ్ఞ-యోగప్రజ్ఞ

"ఒకనాడు మదరాసు తంబుచెట్టి వీధిలో నేను వెళుతూ నాతో వివదిస్తూ ఉన్న మిత్రులిద్దరు ఎదురుగా వస్తూ ఉండగా చూచితిని. ఆకస్మికముగా ఆనాటి

1 'విడనాడుము' అన్న గురుదేవుల వాక్యం గీతలో భగవంతుడు చెప్పిన 'శబ్దాది విషయచింతన నుండి త్యక్తసంగత్వము'నే చెప్పుచున్నది.

2 నిజముగా గుర్తింపవలసినది 'ఆంతర ప్రజ్ఞ' అని గురుదేవుల ఆజ్ఞ. దివ్యమైన ఈ ఆజ్ఞ యోగమార్గమందలి ఆజ్ఞాచక్రమే భ్రుకుటి మధ్యగల ఆజ్ఞాచక్రమందే ప్రజ్ఞప్రతిష్ఠమై యున్నది. దీనినే యదార్థముగా గుర్తించాలి. అన్నారు గురుదేవులు.

గురుదేవుల గంభీరాదేశము మెఱుపు మెఱసినట్లు నాకు గోచరించినది.

"త్రికరణశుద్ధిగా భవదధీనుఁడనై యితరప్రవృత్తిపీడికొని పరార్థలాభ మొకటే గమనించెద నింక మీద' నని శపథము అప్పుడే చేసికొంటిని. నాటితోనే వాఙ్మయవిషయ చర్చలనుండి నేను నిష్క్రమించితిని. నాటినుండి శ్రీగురుదేవులఆజ్ఞ చొప్పున శత్రువులను కూడా మిత్రీకరించుకొనుటకే, గాఢముగా ప్రేమించుటకే సాధన సాగించితిని....ఇది మొదలుగా ఎన్నెని లోనికోశముల వింతయనుభూతులు తీవ్రముగా నాకు లభింపసాగినవి....ఈ స్వీయకథ నేనిప్పుడు ప్రధానముగా రెండుప్రయోజనములకై వెల్లడించితిని. వాఙ్మయ విషయములంటించు కొనక పరాఙ్ముఖుడనై నేనుండుట వానియెడల వైరస్యముచేగాదని విన్నవించుకొనుట ఒక ప్రయోజనము. మిత్రులయిన మీయెదుట నే ననుభవించిన ప్రేను మహాత్మ్యానుభవములను సూచనగానైనా విన్నవించుకొనుట రెండవ ప్రయోజనము" అని చెప్పారు శాస్త్రిగారు.

1904 నాటి శపథాన్ని, 1927 నాటి రెండవ శపథాన్ని పర్యాలోచిస్తే మొదటిది సాహిత్యా జిజ్ఞాసనుండి బయట పడడానికి చేసిన ప్రతిజ్ఞఅనీ, రెండవది అంతర్ముఖీనమైన ప్రజ్ఞాప్రతిష్ఠకోసం చేసిన యోగ ప్రతిజ్ఞ అనీ తేటతెల్ల మవుతుంది. ఇవి రెండూ సాహిత్యాన్ని అనుసంధించిన జీవితానుభవ పరంపరా పరిణామాలుగా మనం గుర్తించాలి. కాటట్టి ఈ వ్యాసానికి 'సాహిత్యక జిజ్ఞాస- వేటూరివారి యోగజీవిత పరిణామము' అనే శీర్షిక సార్థక మవుతోంది.

సాహిత్యపరమైన జిజ్ఞాస యథార్థ యోగజీవితా దర్శంకాదని చెప్పిన గురుదేవుల దివ్యాజ్ఞతో జీవితానుభవ పరంపరనుండి ప్రతిజ్ఞ ఏర్పడి అది 'ప్రజ్ఞా ప్రతిష్ఠిత" మవడంతో వేటూరివారి యోగజీవితం పుష్పించి ఫలోన్ముఖమైందని నా నిర్ణయం.

వేటూరివారి వాఙ్మయ తపస్సాధనే- యోగజీవిత సాధనగా పరిణమించిందని నా ఉద్దేశ్యం. ఈ వ్యాసానికి సారాంశ రూపంగా, కీలకంగా నిల్చిన శ్రీవారి రెండు పద్యాలు ఉదాహరించి దీన్ని యింతటితో ముగిస్తాను.

కవితా శిల్పము సల్పఁగాఁ దొలుత వేడ్కల్ రేగె నాకున్, గృతుల్
చివురెత్తెన్, వెస మోము మొత్తె, నిఁక నాచేఁజెల్ల వీకల్ల టొ
ల్లివినోదంబు, లవే జరామరణముల్ చీదల్ హతం బార్చి పు
ట్టవు చెట్టున్ సఫలీకరించుకొని యంటుల్ గట్టెదన్ మాలినై

సీ. వీ. వీ. కరుణాకటాక్షములు రక్షించున్ సదా తన్మయం
బై వర్ధిల్లెడు భక్తి యున్న యెడ నిత్యానంద మారోగ్య మా
హా పుట్టించెడు ప్రజ్ఞ యాత్రయను లభ్యంబౌను;తార్క్యాణ నే
నే! వేయేటికి? మీర లిందఱును దీనిం జక్క గుర్తింపరో!

* * *

# ప్రజ్ఞా ప్రభాకరము

—కొత్త రామకోటయ్య

["గులాబిమొగ్గను గడుపునబెట్టుకొని దానిగ్రమ్ముకొని కఱకునూగుతొడినుతేకే తొలుత గాన వచ్చినట్టుగా ఉపక్రమమున నిందు ప్రభాకరనామకుడనగు నేనే కానవత్తునుగాని, నాలోని దివ్యతత్త్వపుఁ బూవు వికాసము చెందిన పిదప, నది సువాసనను సౌకుమార్యమును వన్నెలను వేలార్పజొచ్చిన పిదప దానిగొని యానందింప గోరువారికి నేను తత్త్వదర్శకుడనుగానే యంగుశ్రీగ్రాహ్యమగు తొడిమనుగానే యడుగునఁబడి యుండి కానవత్తును. అప్పుడిది ప్రజ్ఞాచరిత్రమేగాని ప్రభాకరచరిత్రముగాదు. ప్రభాకరచరిత్ర మయినను ఆ ప్రభాకరుడు తొల్లింటి నేనుగాక వేఱొకడనే."

ఈ వాక్యములు గురుదేవుల ప్రజ్ఞా ప్రభాకరము-ఉపక్రమమునందలివి. ఈ రచనను వారానాడు తమకు గలిగిన యోగానుభూతుల నొక వేయిపుటల గ్రంథముగాను; ప్రజ్ఞావికాసము పనిసేయగా శిష్యులయు యోగ మిత్రులయు అనుభవములను మరియొక వేయిపుటల గ్రంథముగాను నిర్వహింప సంకల్పించిరి.

అట్టి ఆత్మ సంకల్ప కిరణ మొక్కటి మున్ను "ప్రజ్ఞా ప్రభాకరము"న పొడసూపినది. ఆ తేజోరాశి యందలిదే మరొక్క కిరణ మిప్పుడీ "ప్రజ్ఞా ప్రభాకరము"న వెలుగులు నింపుచున్నది- సం॥]

## 1

**వరము**

మన యందరిలో వెలిగెడి ప్రభాకరుల యొక్క దివ్య ప్రజ్ఞలకు నమస్కారములు.

శ్రీ ప్రభాకరులయొక్క దివ్యప్రచోదయము నాజీవితమునకు నిత్యమగు నుషస్సుగా రాజిల్లుచున్నది. అట్టి ప్రభాకర ఉషోదయము మనలో బ్రహ్మవర్చస్సును వెలార్చును. అలాటి వర్చస్సు యొక్క చిన్ని చిన్ని తళుకులే ఈ రచనారూప మందుకొంటున్నవి.

శ్రీ ప్రభాకర శాస్త్రిగారిని నేను మొట్ట మొదట దర్శించే భాగ్యము 13-12-43లో లభించెను. ఆ రోజు నా జీవితమునకు నిజమగు ప్రభాకరోదయము. ఇప్పటికి ముప్పది సంవత్సరములు పైబడి గడచిననూ చెరగని ముద్రగా ఆ దివ్య సంఘటనము నా మనస్సుపై ముద్రింపబడినది. అది యొక వెలుగుబాట. ఆ బాట నాలో విచ్చుకొని సరికొత్త కాంతులను నింపినది, నింపుచున్నది. ఇంకనూ నింపగలదు. అలా కాంతుల నెల్లెడలను నింపగల నిండుదనమే శ్రీ ప్రభాకర శాస్త్రిగారు.

నేను కొన్ని యేండ్లుగా అనారోగ్యముతో జీవితమును గడపితిని, విసిగి వేసారితిని, ఎలాటి మందులు పని చేయనట్టి చిట్ట చివరి స్థితిలో నేను శ్రీ శాస్త్రిగారిని దర్శించుట జరిగినది. కటిక చీకటి అలముకొన్న అర్థరాత్రివేళ నాలో ప్రభాకరోదయమైనది. హఠాత్తుగా నా జీవిత మంతయుకాంతిమయ మైనది. అదీ క్రమంగా మెట్టు మెట్టుగాకాదు. ఒకే ఒక చూపుతోనే నాలోని చీకటులన్నీ విచ్చి పోయినవి.

ఏమిది యెంతటి వింతయొ
పో! మముపీడి యనినంత పోయెను బాధల్,
ఈ మహిమ యెందు గలదొకొ
భూమి సురులు వీరనంగ బోలునొ ఏమో!

భూమిన్ సుర లుందు రటం
చీ మాదిరిగాగ నాకు నెరుకపరచగా
భూమిసురు శ్రీ ప్రభాకరు
స్వామిన్ కనుగొంటి నిచట సద్గురు మూర్తిన్!

స్వామి యన్న పేరుగల స్వాములవారల నెంద రనో నేనెరుగుదును. వారెవరికి తమ శరీరముల మీదనే స్వామిత్వము లేదు. ఇక వీరిలో నిజమగు స్వామిత్వమును దర్శించితిని, వారి శరీరము మీద స్వామిగా నుండుటేగాదు శ్రీవారి చుట్టూ ఉండేవారి శరీరాలపైన గూడ శ్రీవారు స్వామిగానే యుండేవారు. ఇప్పటికిన్నీ అలానే ఉంటున్నవారు వారె!

పట్టుతప్పి శిథిలమై నావశముగాక దిగజారిన నా శరీర వ్యవస్థను కేవల మొకచూపుతోనే చక్కబరచి వేసిన స్వామి-శ్రీ ప్రభాకర శాస్త్రిగారు.

నా శరీరము బాగాలేదని చెప్పగనే గురువుగారు ఈ క్రింది యమృత వాక్కులను నాకనుగ్రహించిరి.

"ఇక్కడ నుండి నీవు బాగా ఉంటావు." అని నా శరీరములోనున్న లోపమేమిటని యడుగకయే నీ వ్యాధి ఏమిటని విచారింపకయే, అలవోకగా, ఎంతో తేలికగా "నీ విక్కడ నుండి బాగా ఉంటావు" అని వరమిచ్చిరి. ఆ వర మాక్షణము నుండి యీ క్షణము వరకు నా చుట్టూరా ఆ వరించి యున్నది. నన్ను సదా కంటికి రెప్పవలె కాపాడుచున్నది. లోపల లోలోపల పూర్ణజ్యోతివలె ఆ వాక్యము, వరమై వెలుగు చున్నది. నా చుట్టూ ఉన్న యోగ మిత్రులనూ వెలిగించుచున్నది. గురుదేవుల వరమును గురించి యాలోచించినపుడెల్ల శ్రీ Master C. V. V వారు తమ శిష్యుల కనుగ్రహించిన మంత్ర రాజము గుర్తుకు వచ్చుచుండును.

## 2

జాగరీ రైర్సు
తియ్యని కవచముగా శ్రీ శాస్త్రిగారి వరము వర్థిల్లు చునే యున్నది. ఆ తీయదనాన్ని వెలుగుదనాన్ని చుట్టూరా వెదజల్లుచునే యున్నది. ఇది జరిగి ఇప్పటికీ ముప్పది నాలుగు సంవత్సరములు జరిగినప్పటికిన్నీ నిత్యమగు నూతనమగు నుషస్సువలె ఈ వరము నాయెదలో ప్రకాశించుచునే యున్నది. నాపై పడు చున్న ముప్పదేండ్ల వయసు భారము నా వరమే భరించుచున్నది.

భారంబంతయు నిట శ్రీ
వారే! భరియించుచుండి వారించిరి శా
రీరములైన బాధల
తీరికయగు తిన్నదనము తీర్చిరి మదికిన్।

ఆ వరము నా మనసులోని కురుచలను చక్కబరచి తిన్నదనము నిచ్చుచున్నది. సన్మార్గమున ఇతరుల కుపయోగించునట్టి జీవిత మార్గమున నన్ను నడుపు చున్నది. ఆ ప్రభాకర వర ప్రభావమును వివరించి చెప్పెదను.

నా శరీరమును మనస్సును ఆలోచనా విధానమును తీర్చిదిద్దుచున్న ఆ దివ్యతేజపు సొబగును వర్ణించెదను.

ఇది 1978సం॥. ఈరోజు ఫిబ్రవరి పదమూడవతేదీ. ఫిబ్రవరి నెలయన్న నా క త్యం త గౌ ర వ ము ఈ ఫిబ్రవరిమాసమే గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రులవారు జన్మించిన పుణ్యమాసము. పదమూడవ తేదీన నేను తిరుపతి వెళ్ళి శ్రీ శాస్త్రిగారిని దర్శించిన పుణ్యదినము. "శ్రీ గురుదేవులు పుట్టిన మాసము ఫిబ్రవరి. పదమూడవ తేదీ గురుదేవులు నాలో పుట్టిన దినము" ఇట్టి యీ శుభసమయమున నా మన స్సానందముతో ఉరకలువేయుచున్నది. శ్రీ శాస్త్రిగారిని గూర్చి ఎన్నోవిషయాలు చెప్పవలె నని పించును. నా జీవితములో ఎన్నో పారిజాతములు వికసించినవి. ప్రభాకర సంస్పర్శవలన నా హృదయ కమలమెంతో వికసించినది. మనస్సున నెన్నో మందారములు వెల్లి విరిసినవి. కన్నుల కఱవుదీర శ్రీ గురు మూర్తుల నెన్నోసారులు దర్శించితిని. శ్రీ వారి దివ్య

బోధల నెన్నో మారులు చెవులార విన్న విందు లభించెను. అవి యన్నియు నా మనస్సున ముసురుకొంటున్నవి. అందేమి వ్రాయుటో తెలియుట లేదు. ఎక్కడ నారంభింపవలెనో తోచుటలేదు. నా మనస్సానందంలో మునుకలువేయుచున్నది. అయినా యీ రోజు జరిగిన యోగ విశేషాలతోనే ఈ రచన నారంభించి వెనకకూ వెళ్ళవద్దాము. ఇది యొక రచనా విధానపు నొగసు-చివరి నుండి యారంభించుట.

"తమసోమా జ్యోతిర్గమయ" అన్న వేదమంత్రపు ప్రయోగానుభవ మీరోజున నడచినది. ఉదయమంతయు నిరుత్సాహముగా నున్నది. అంతా చిరు చీకటి చీదరింపుగానే యున్నది. మనస్సు మందకొడిగా నున్నది. శరీరమంతకన్నను నీరసముగా నున్నది. 11, 12, తేదీలలో నేనునూ, యోగ మిత్రులు శ్రీ శేషగిరి రావు గారున్నూ కలసి కాజీపాలెము కేంద్రమునకు వెళ్ళితిమి. శని, ఆదివారముల ప్రాంతములో ప్రార్థన సమావేశములలో పాల్గొంటిమి అక్కడ నుండి తిరిగి యింటికి ఈ ఉదయమే వచ్చి చేరితిని.

కాని యేదో అశాంతి. ఈ యోగసాధన చేయు చున్నట్టి యోగ మిత్రులలో చాలా మంది సుఖంగా లేరు. శరీరములయం దనారోగ్యము. అందువలన నిరుత్సాహముతో చీకాకుపడుచుండిరి. ఇవియన్నియు కలసి నన్ను కలవరపరుప సాగినవి. మన చుట్టూరా ఈ చీకటి ఏమిటో అని యాలోచింప సాగితిని. సాయంకాలము 5.30గంటల సమయము. చీకాకధికము గానే యుండెను. అంతలో మెరపు మెరసెను. కనులు మూసికొని పరిశీలించితిని.

—అది తిరుపతిలో శ్రీ శాస్త్రిగారున్న యిల్లు. ప్రార్థనలకు కూరుచుండు గది. ఆ గదిలో శ్రీ గురు దేవులవారు వారి స్థానములో కూర్చుండి యుండిరి. నేను భక్తితో నమస్కరించితిని శ్రీ వారిలా శలవిచ్చిరి.

"ఆనందముతో నుండుము. ప్రశాంతముగా ఉండుము, నీవేమియు చీకాకు పడకుము. నన్ను చూడ వచ్చిన రోజున చెప్పిన మాటలు స్మరింపుము. నీ ప్రక్క వారందరూ బాగుండవలెనని తలపోయుము. అందుకు కృషిచేయుము. ఇతరుల క్షేమము కోరుట లోనే నీ క్షేమము ఇమిడి యున్నది. ఎలాంటి భయము లేకుండ నీవు నీ కార్యక్రమములను కొనసాగింపుము. అన్నియు నేను చూచుచుండెదను. తనివితో నుండుము. ముప్పది సంవత్సరములకు పూర్వం నీకు నేను చెప్పిన మాటలనే తిరిగి ఇప్పుడూ చెప్పు చున్నాను.

"ఇక్కడ నుండి నీవు బాగా ఉంటావు"

ఆ వాక్యములు విన్న తరువాత శరీర మానంద ముతో మునిగి తేలుచున్నటులయ్యెను. ఒడలు పులకరించెను. ఎంతోహాయి, విశ్రాంతి, నా చుట్టూరా తిరుగాడెను. అంతకు పూర్వం ఉన్న, చీకాకులన్నియు తొలగిపోయెను. మబ్బులు విచ్చిపోయిన తరువాత సూర్యుని దర్శనము లభించినటు లుండెను. లోపల కొత్త వెల్గు రేకలు నల్గడల విస్తరించి చీకటిని పారద్రోలు చుండెను. అప్పుడు నేనిట్లంటిని. 'అయ్యా. యోగకేంద్రము లన్నింటియందు ఏదో కొంత అలజడి వచ్చుచునే యున్నది. దానిని గురించి ఆలోచించి నపుడు మనస్సు ప్రశాంతముగాను ప్రసన్నముగాను ఉండుటలేదు.'

శాస్త్రిగారు :

'ప్రసన్నముగానే ఉండవలయును, ఇలాంటికొలది పాటి చీకాకులు వస్తూ ఉంటాయి. పోతూ ఉంటాయి. సాధ వలన చీకాకులు చాలా అరుదుగా మాత్రమే రాగలవు వచ్చినను వెంటనే సర్దుకొని పోగలవు. దానికి తగిన కుదురుబాటు వస్తుంది.

నేను :

ప్రస్తుతము ఉన్నటువంటి చిక్కులన్నీ తొలగి అంతటా మంచి శాంతి కుదురుకునే లాగున ఆశీర్వదించండి.

శాస్త్రిగారు :

నా ఆశీర్వచనము ఎల్లప్పుడు సిద్ధముగానే ఉండును మీరు గ్రహించగల కుశలతను, అలవరచుకొన

వలెను. పరోపకారకములైన మంచి పనులను మీరు కుశలతతో, ప్రేమ నిండిన హృదయముతో చేయ యత్నింపుడు. ఆపైన మాస్టరుగా రున్నారు. ఇప్పుడు జరుగుచున్న యోగసాధనమును గురించి వివరించి చెప్పెదను వినుము. ఇటు చూడుము.

నేను శాస్త్రిగారివైపు చూచితిని. వారికొక ప్రక్క నుండి సాధకులు వచ్చి వారికి నమస్కరించు చుండిరి. నమస్కరించి వేరొక ప్రక్కకు వెళ్ళి పోవుచుండిరి. ఆ నమస్కరించు వారిని గురించి శాస్త్రిగారిలా శలవిచ్చిరి. మొదట వచ్చినవారు డాక్టరు ప్రసాదు, డాక్టరు ఇందిర దంపతులు. శాస్త్రిగారు ఇలా ప్రసంగించిరి. 'ఈ డాక్టరు దంపతులు మాస్టరు యోగ కార్యక్రమములకు బాగ ఉపయోగపడగలరు. వీరి వలన చాలా మంచి పనులు జరుగును. వీరిని శ్రద్ధగా చూడుము. తరువాత సంగమేశ్వరరావు దంపతుల యొక్క ఆరోగ్యమును గురించి శ్రద్ధ తీసికొనుము. ఆ తరువాత చౌదరి, రాఘవమ్మయును కనిపించిరి. శాస్త్రిగారు: చౌదరి దంపతులు సఫల మనోరథులయ్యెదరు, వీరిని గురించి తగిన జాగ్రత్త తీసికొనుము. తరువాత వైజాగ్ కేంద్రములోని యోగసాధకులైన డాక్టరు పేషెంట్లు కనిపించి నమస్కరించిరి. శాస్త్రిగారు; వీరందరి యొక్క ఆరోగ్య విధానము వెంటనే చక్కబడును. ఆ తరువాత గుంటూరు కేంద్రము వెంకటేశ్వర శర్మ దంపతులు కనుపించి నమస్కరించిరి. నేను: తమ అనారోగ్యమును గురించి శర్మగారు చాలా ఆందోళన చెందుచున్నారు. కొంత బాధపడుచున్నారు.

శాస్త్రిగారు :

ఎంత మాత్రము ఆందోళన పడనక్కరలేదు. బాధలన్నియు వెంటనే తొలగి పోగలవు. శర్మగారివలె బాధపడుచున్నవారు ఇంకా కొందరున్నారు. వారందరకూ వెంటనే రిలీఫ్ కలుగుతుంది. బండి మరల సరిగా నడచుచున్నది. గుంటూరు ప్రాంతమున యోగసాధన విధానము తిన్నగా నడచుటకు శర్మగారి వంటివారి ఉత్సాహము చాలా అవసరము. వీరిలో శక్తి ఉత్సాహములు బాగా పెంపొందునటుల చూడుము. ఆ కేంద్రము చక్కగా వృద్ధిచెంది అందరకు ఉపయోగ పడవలయును. మాస్టరు యొక్క ప్రేమ యోగమునకు చక్కని గుర్తుగా పెంపొందవలయును. నాగమణి, శకుంతలమ్మగారల యోగసాధన గురించి :—

శ్రీ నాగమణిగారి ఇంటిలోని కేంద్రములో పాల్గొనే వారందరూ వచ్చి నమస్కరించిరి.

శాస్త్రిగారు :

బాలబాలికలలో నీ ప్రేమ తత్వమును మాస్టరుగారి యోగానుష్ఠానమును, చక్కగా వ్యాప్తి చేయవచ్చును. ఈ కేంద్రమును ముందుకు తీసికొని రమ్ము.

విద్యార్థుల నీ ప్రేమ మార్గమున నడచునట్లుగా తీరిచి దిద్దండి, ఆ తరువాత శకుంతలమ్మగారు వారి ఇంటికడ నడచు నట్టి ప్రార్థనా కేంద్రములో పాల్గొనే యోగమిత్రులు నమస్కరించిరి.

శాస్త్రిగారు :

వీరందరూ భగవద్భక్తికలవారే. వీరి ప్రేమ యోగమును సులువుగా గ్రహింపగలరు. వీరినీ మార్గమున నడుపుము.

ఆ తరువాత కాజీపాలెం యోగసెంటరు శ్రీ దశరథరాజు దంపతులు కనుపించిరి. వారి నమస్కారము లందుకొంటూ శాస్త్రిగారిలా చెప్పిరి. ఈ సెంటరు బాగా విస్తరించ వలసియున్నది. వారు అందుకు తగిన భక్తివిశ్వాసములు కలవారు. వీరు మంచి శక్తి సంపన్నులుగా నుండ గలరు. ఇచ్చటి కార్యక్రమములను బాగా నడప గలరు.

నేను :

వీరి ఇంట్లో నడవలేని ఒకబాబు ఉన్నాడు. ఆబాబు యొక్క కాళ్ళు రెండూ పనిచేయుట లేదు.

శాస్త్రిగారు :

ఆ బాబు నడుస్తాడు. ఆ కేంద్రమూ చక్కగా నడుస్తుంది.

నేను :

ఆ బాబు నడచుట అన్నది సామాన్య విషయము కాదుసార్, ఆ బాబు తన కాళ్ళపై తాను నడచుట అనగా అది ఒక గొప్ప యోగ విశేషము.

శాస్త్రిగారు :

కాదు, ఇచ్చట జరిగేవి ఏవీ యోగ విశేషములు కావు. మాస్టరుగారి యొక్క దివ్య ప్రేమ యొక్క వికాసముగా మాత్రమే ఈ యోగ కేంద్రములు నడచును. ఈ యోగము ప్రదర్శనమునకు ఎంత మాత్రము కాదు. మీకు మీ ప్రక్కవారి యందు కల ప్రేమ, ఆదరము, ఆపేక్ష, మొదలగు మంచి భావములకు గుర్తుగా, ఈ యోగ కేంద్రములు నడవ వలయును, కరుణామయులగు మాస్టరుగారి యొక్క ప్రేమతత్వము మీలో నిలువ వలయును. అదియే మీకు దారి చూప వలయును.

నేను :

నా అభిప్రాయము తప్పు. తమరు శలవిచ్చినదియే సరియైన మార్గము- అని నమస్కరించితిని, కాకీపాలెం కేంద్రములోని ఇతర యోగ మిత్రులు, కనుపించి నమస్కరించిరి. శాస్త్రిగారు వారందరను ఆశీర్వదించిరి. 'మీరందరు చెడును తొలగించండి, మంచిని పెంచి అందరకు పంచి పెట్టండి' అని శలవిచ్చిరి. చినకాకాని కేంద్రములో సాధన చేయు వారందరు కనుపించిరి. భక్తితో నమస్కరించిరి.

శాస్త్రిగారు :

మీరందరూ నా యందు భక్తి విశ్వాసములు కలిగి యున్నారు. మీరందరూ నా గుర్తుగా ఉండగలరని ఆశించు చున్నాను. మిమ్ములను చూచిన వారలకు నేను గుర్తుకు రావలయును, అట్టి వారందరూ నాకు దగ్గర వారే అని శలవిచ్చిరి.

ఆ తరువాత కనులు తెరపిన పడినవి. శరీరము లోని అలజడి, కదలికల పొంగు క్రమముగా తగ్గినది. ప్రశాంతమైన స్థితి శరీరమునకు లభించినది. మనస్సు తేరుకున్నది. శ్రీ గురుదేవులను గురించి అది వరకు వ్రాసిన పద్యము అప్పుడు గుర్తునకు వచ్చినది.

కం: మాకేమి భయము శ్రీ ప్రా
భాకర మంత్రంబు మమ్ము పరిరక్షించున్
కైకొన మ వెట్టి బాధలు!
కైకొందుము పరహితంబు కర్తవ్యముగా।

ఆ పద్యమే అప్పటి యోగాను భవమునకు చక్కగా నతికినది. నాలో ఉన్న అశాంతి నీరసభావము వెంటనే తొలగిపోయెను. మంచి ఉత్సాహము వచ్చి మనస్సును శరీరమును నింపి వైచెను.

(సశేషము)

—o—

# ఆశీర్వచన నవరత్నములు

—వేటూరి ప్రభాకర శాస్త్రి

[ఇవి శ్రీ చల్లపల్లి సంస్థానాధీశ్వరులగు శ్రీమంతు రాజా ఏర్లగడ్డ శివరామకృష్ణ ప్రసాద బహద్దరు జమీందారుగారి వివాహ మహోత్సవము సందర్భమున(1929) గురుదేవులు సమర్పించిన ఆశీర్వచన నవరత్నములు. అట్లగుట నీ పద్యములగొన్నిట 'భూవరా!' 'నృపవరేణ్య' అను సంబుద్ధులున్న వంతెకాని, వాస్తవమున నివి గార్హస్థ్య ధర్మము నుగ్గడించు మేలుబంతులు. దంపతులెల్లరు తలలొగ్గి గ్రహింపదగిన దీవెనలు-సం]

1

ఉ. శ్రీయగుతన్; పరస్పరము చెన్నల రారుత మైకమత్య; మా
ప్యాయిత మౌత బంధుహిత వర్గము; పేర్గల సంతతిన్ కులం
బాయతమౌత; బుద్ధి పరమార్థమునం బ్రసరించుఁగాత; శ్వ
శ్రేయస నిత్య సక్త చిరజీవిత మబ్బుత, మీకు దంపతుల్!

2

ఉ. సీతయు రామచంద్రుఁడు సుశీలము నేర్పఁగ వాగ్వధూటియున్
ధాతయు విద్యలందు సమతన్ గృపసేయ, నుమామహేశ్వరుల్
బ్రాతిగ నైకమత్య మిడ, భర్తృపితామహి పుణ్యరేఖయున్
తాత యదృష్టరేఖయును దొర్కొన వర్ధిలుఁడయ్య దంపతుల్!

3

ఉ. పువ్వుల పండ్ల తోఁట యనఁ బొల్చుగృహస్థ మహాశ్రమంబునన్
జవ్వన మన్న జీవిత వసంతము వింతలుగొల్పువేళ మీ
రివ్విధిఁ జేరుచుంటి రిపు; డిందు నమందసుఖావహంబులౌ
మవ్వపుఁ గాన్పులం గని సుమానుషసంపద పెంపు నింపుఁడీ

4

క. పతి పత్నీవ్రతుఁడుగ, సతి- పతివ్రతగ, నుండుటకు శపథ మల్ల యరుం-
ధతి సాక్షిగ జరపుదు; రా- ప్రతిజ్ఞ మీయందు సత్యబద్ధం బగుతన్.

5

చ. సుదతులు మేలుబంతివలెఁ జూచుచు నిత్యము సత్ప్రవర్తనన్
గుదురుచుకొంద్రుగా కనియునో, "కనుచుండుమ దంపతివ్రతా
భ్యుదయ"మటన్న యీశ్వరనియోగముకల్మినా, సత్పథంబునం
దదిగో యరుంధతమ్మ కన నయ్యెడు దంపతులార! మ్రొక్కుఁడీ!

6

చ. ఒకపలు కేవచింతు నిది యొప్పిదమంచుఁ దలంపుమయ్య, పెం
డ్లికొడుక! భారతోర్వికిఁ జలింపని వైభవ మొక్కచేసుమా
అకలుష వర్తనల్ పతిసుతానుమతల్ కులధర్మమూలముల్
సుకృతమయస్వభావ లనసూయలు నైన సతీమతల్లికల్!

7

సీ. ప్రేమభాండారంపుఁబెట్టె తెఱచిచూడ,
యజమానశబ్దార్థ మధిగమింప,
స్వాదుసౌహార్దవాసనల నాఘ్రాణింప,
సకలకలాప్రశంసల రహింప,
ఐహికానందంబు లవియెల్లఁ జవిగొన,
హృదయసుక్షేత్రంబు పదనుపఱుప,
దృష్టాంతముఖమున సృష్టి సిద్ధాంతంబు
గురుతింపఁ, గడకు నీశ్వరుని నరయ,
ప్రకృతిపురుష మాయేశ్వరభావ కలిత
తత్త్వసంగ్రహరూపమై తనరునట్టి
గార్హపత్యమే యర్హతఁ గలుగఁజేయు,
నెఱుఁగు మిద్దానిమహిమంబు నృపవరేణ్య!

8

సీ. అర్ధాంగలక్ష్మి, నేత్రానందనజ్యోత్స్న,
సత్కార్యరచన కుత్సాహశక్తి
అక్షయోదయవంశవృక్షాలవాలంబు,
మనసు మర్మము దాచుకొనెడు నెలవు,
మానుషానంద సంపదలపంటకొటారు,
పుణ్యావగాహంపుఁ బొడుపుదేరు,

తోడుపీడగలేనినీడ, యందమ్ముల
పొట్లంబు, సౌభాగ్యభోగ్యరాశి,
ఇహమునందె కాక సహధర్మచారిణి
పరమునందుఁ గూడ భద్రహేతు;
వివ్విధము నెఱింగి పువ్వారుఁబోణితో
గార్హపత్యసుఖము గనుము నృపతి!

9

ఉ. పుట్టువుఁదొట్టి మానవులు పొందెడు సౌఖ్యములందు ముఖ్యమై
నట్టిది పెండ్లిముచ్చట; క్షణక్షణ మిందలివిందు లన్నియున్
గట్టిగ నాస్వదింపఁ,గల కాలము సంస్మరియింపఁదగ్గ; వి
ప్పట్టున నేర్పుమీర రసభావవివేకివి గమ్ముభూవరా!

10

ఉ. ఉన్నతరాజ్యవైభవము నొందినమిమ్ము నిజప్రజాళి వే
గన్నులఁగాంచుచుందు, రనుకారమొనర్తురు, ధర్మరక్ష మీ
మన్ననఁబట్టి యున్నది; సమస్తబుధస్తవనీయ మైన వై
యెన్నిక కేక్కఁగావలెఁ జుమీ యిఁక మీగృహిణీగృహస్థతల్

—o—

కొన్ని లఘుకృతులు:

# బాలకుల పలుకులు

—వేటూరి ప్రభాకరశాస్త్రి

తీవ్రజ్వరముచే తికమకలు పడుచున్నాను. రాత్రి రెండుగంటలవేళ నిద్రావికారములో, కలలో, నీక్రింది సంభాషణము నేను జరపితిని. ఐదినుండి వచ్చుచున్న బాలకులు పదుగురు నా కగపడిరి ఒక్కొక్కరితోను నేను వేర్వేరుగా సంభాషించితిని. అది యంతయు వింతగా నుండెను. మర్నాటి ప్రొద్దుట స్మరింపగా నలుగురితోడి సంభాషణమే జ్ఞప్తికివచ్చెను.

1

పసిబాలునితో: నాయనా! నీవు గుంట ఓనమాలు దిద్దినావా?

బాలుడు : ఉత్త ఓనమాలు వచ్చినవి ; ఇంకా గుంట ఓనమాలు మొదలు పెట్టలేదు.

2

ఇంకొక పసిబాలునితో: నాన్నా ఇటురా! దగ్గరకురా! ఒక ముద్దుపెట్టు ఒక ముద్దు!

బాలుడు ; ఊహు, నేనురాను ముద్దు పెట్టను.

నేను : ఇదిగో మామిడిపండు. ముక్కలు కోసి పెట్టుతాను రా నాయనా రా!ఒక్క ముద్దుపెట్టుదూ!

బాలుడు : ఊహు' రాను, నాకు నీముద్దు వద్దు, ముక్కలూవద్దు. మూతి అంతా గుచ్చుకొంటుంది నీ గడ్డము. పండు పండుగానే ఇట్టా పడవేయి మామిడిపండు.

3

వేరొక బాలునితో: మీ పంతులు మంచి వాడేనా నాయనా!

బాలుడు : మా నాన్న మంచివాడు.

నేను : పంతులు మంచివాడు కాడా!

బాలుడు:పంతు లెక్కడైనా మంచివాడౌతాడాయేమిటి?

నేను : కాడూ?

బాలుడు : అబ్బే!

నేను : అట్టా అంటావేమి నాయనా!

బాలుడు : అట్టా అంటావేమి అంటావేమయ్యా! ఊరికే కొట్టుతూ ఉంటాడు పంతులు. అమ్మతో చెప్పి ఇంకా కొట్టిస్తాడు కూడాను.

నేను : నాన్నమాత్రము కొట్టడా నాయనా?

బాలుడు : ఎప్పుడయినా కొడతాడుగాని, కొడితేనేమి, కొట్టిన తర్వాత ఏమయినా కొని తెచ్చి పెడతాడు తినడానికి; పంతులేమి కొనితెచ్చి పెడతాడు? చదువుకోమని చంపడమేగాని.

4

మరి ఒక బాలునితో: మా యింటికి తీసుకొని వెళ్ళుతాను వస్తావా నాయనా!

బాలుడు : రాను!

నేను : ఎందుచేత?

బాలుడు : మానాన్న ఎవరిళ్లకీ వెళవద్దన్నాడు.

నేను : మీ నాన్న అంటే ఏమిలే, నేను రమ్మంటున్నాను గదా!

బాలుడు : మానాన్న చెప్పినమాట వినవలెను-

నేను : నా మాటో!

బాలుడు : నీమాట కేమిలే, మా నాన్నమాటే వినవలెను. మా నాన్న నేను వెళ్ళగానే ముద్దు పెట్టుకొని ఎత్తుకొంటాడు. నాకోసం ఎదురుచూస్తూ ఉంటాడు. వేళకు నేను వెళ్లకపోతే దిగులుపడి ఊరంతా వెదకడం మొదలు పెడతాడు-నీవేమిటి?

['సాహితీ' సంపుటి-4 సంచిక-2
రుధిరోద్గారి- భాద్రపదము- 1923
శారదాభండార ముద్రాశాల,బెజవాడ,పుటలు 541-42]

# ముద్దుల బిడ్డఁడు

—వేటూరి ప్రభాకరశాస్త్రి

సీ॥ చిన్నారి పొన్నారి చిరుత కుఱ్ఱఁడ రార!
అయ్య రారా! చక్కనయ్య రార!
అల్లారుముద్దుల పిల్లవాడా రార!
అప్పరారా! కూర్మికుప్ప రార!
రతనాల చిటిముల్లె రార! నవ్వుంబువ్వు
తోట రారా! ముద్దు మూట రార!
ముత్యాలకోవి రా! ముచ్చట్ల దీవి రా
పలుకువన్నెల చిన్ని చిలుక రార!

గీ॥ కన్నకాచి రార! గారాలకూచి రా!
నాన్నరార! చిన్ని యన్న రార!
ఆడ రార! నవ్వులాడ రారా! పలుకు
లాడరార! కులుకులాడ రార?

శా॥ దూరానం దిలకించి చిన్నగవుతోఁ దోతెంచి పాదమ్ములం
దారోహించి మొగమ్ముగాంచి కయిదో యల్లార్చి తాటించు చి
ర్నోరన్ గోరికలూర "నెత్తికొను" మంచుం దొక్కుపల్కాడు న
ల్లారుంబెల్లముఁ బుత్రుఁజేకొననివాఁ డానంద మేమందునో!

—"భారతి" జులై 1924

సంపుటం- 1 సంచిక -7

రక్తాక్షి సంవత్సరం- ఆషాడమాసం

పై పద్యాలు చదివిన తర్వాత శ్రీనాథుడు హర విలాసంలో సిరియాళుని చరిత్ర వర్ణించే ఘట్టంలో సిరియాళునితల్లి కుమారుని "రారా వణిగ్వంశ వారాసి హిమధామ! రారా వికస్వరాంభోరుహాక్ష... అని పిలచిన నప్పటి సీసపద్యం జ్ఞప్తికొచ్చింది. శాస్త్రి గారికి శ్రీనాధునిపైగల అభిమానం విదితమైనదేకదా!

— సేకరణ- వివరణ- ముదివేడు ప్రభాకర రావు

o o o o

# కృతార్థుడు

—వేటూరి ప్రభాకరశాస్త్రి

సీ॥ కనువిందుగూర్చు చక్కఁదనమ్ము, పొంగారు పాలఁబోలిన వయఃప్రాభవమ్ము
శీలవిద్యారూప శాలిని కులకాంత, సంతానమిత్ర బాంధవ సమృద్ధి
విజ్ఞాన సంపత్తి వెలయించు వైదుష్య, మిష్టభోగార్హ మీహితధనమ్ము
ఉద్యత్పరిజ్ఞాన- యోగసామర్థ్యమ్ము, పరమార్థనిశ్చయాభయవినోద

గీ॥ మెసఁగి పొసఁగి పొంపిరివోవ నెల్లవేళ, నల్ల నుల్లాసజలధి నోలాడువాఁడు
వాఁడువో వాడువోవని వన్నెవాఁడు, సర్వసంపూర్ణ పురుషార్థ సార్థవహుఁడు.

— "భారతి", ఏప్రిల్, 1924 పుట–92

# బుద్ధదేవుడు

అజంతా చిత్రము క్రీ॥ పూ॥ 1వ శతాబ్దము.

శ్లో॥ ఆచార్యం స్వస్తికాసీనం జ్ఞానముద్రాంచ పుస్తకమ్
బిభ్రన్తం బుద్ధియోగాఢ్యం వందేహం కరుణానిధిమ్॥

చ॥ ప్రియయువతిం బ్రభుత్వమును వీఁడి యరణ్యముఁజేరెఁ దత్త్వని
శ్చయమునకై మహాతపముసల్పి కృతార్థతఁగాంచె నెల్లెడన్
దయము నహింసయున్ బరమ ధర్మములన్ నెలకొల్పె నమ్మహో
దయుఁడగు బుద్దదేవుని పదంబుల కేను నమస్కరించెదన్.

— భారతి- మార్చి- 1924

ఎవడు కృతార్థుఁడు? బుద్ధదేవుడా? కృతార్థునిగా వర్ణింపబడిన గృహస్థుడా? ఈ రెండూ భిన్నమైన మార్గములు, ఒకటి గృహస్థాశ్రమము రెండవది సన్యాసాశ్రమము. పాండురంగ మహాత్మ్యంలో అయుత నియుతోపాఖ్యాన మున్నది అక్కడ తెనాలి రామకృష్ణుడు అటు గృహస్థాశ్రమాన్నీ యిటు సన్యాసాశ్రమాన్నీ వ్యతిరేక సంవిధానక శిల్పంలో వర్ణించాడు. "కీలారముననుండి పాలింటికేతేర బహుధాన్యములు చేలబండి యొరుగ " యిత్యాది సీసపద్యం గృహస్థాశ్రమ వైభవాన్ని వర్ణిస్తే. "ఉర్వీధరంబుల నెక్కియురుకనే కుచకుంభ యుగళితా నొల్లననిన" యిత్యాది సీసపద్యం సన్యాసికి కావలసిన మన స్తత్వ చిత్రీకరణ.

గృహస్థుడై పురుషార్థముల సాధించిన వాడొక రకముగా కృతార్థుడు. మహాతపము చేసి తత్త్వనిశ్చయము చేసి సర్వసంగ పరిత్యాగియైన సన్యాసి మహోదాత్తుడైన కృతార్థుడు కృతార్థత. జన్మ సార్థక్యత ఈ స్థాయిలో సమచీన మౌతోంది. లౌకిక భోగ సాధనలోకాదు. అనవచ్చు కాని, దీనికి సమాధానం మనుచరిత్రలో మనకు తటస్థ పడుతుంది. సిద్ధునితో సంభాషిస్తున్న ప్రవరుడు తాను తీర్థయాత్రలు చేయలేక పోయానే అని బాధపడితే సిద్ధుడంటాడు– "కెలకుల నున్న తంగెటిజున్ను గృహమేధి యజమాను డంక స్థితార్థపేటి" యిత్యాది సీసపద్యంలో గృహస్థాశ్రమ వైభవాన్ని సార్థక్యాన్ని వర్ణించి–

బధిర పంగ్వంధ భిక్షుక బ్రహ్మచారి
జటిపరివ్రాజ కాతిథి క్షపణకావ
ధూతకాపాలి కాధినాధులకుగాన
భూసురో త్తమ గార్హస్థ్యమునకు సరియె!

అని. కాబట్టి గృహస్థాశ్రమంలో వుంటూనే మనం ఆధ్యాత్మిక చింతన చేయవచ్చు. 'గీత'లో భగవంతుడుపదేశించిన 'కర్మయోగం' యిదే. శాస్త్రిగారిలో 1923-24 ప్రాంతాలలోనే ఈ మీమాంస బయలు దేరింది. తత్పూర్వమే వారు యోగ విధానంలో ప్రవేశించి వున్నారు. (22-6-1916) కాబట్టి అతిధి అభ్యాగత సేవకు పెట్టినది. పేరైన గృహస్థాశ్రమ జీవితంలో కృతార్థులై - తాము నమ్మిన యోగ జీవితంలోనూ కృతార్థులైన ప్రభాకరులు సార్థకనామధేయులు.

సేకరణ-వివరణ
ముదివేడు ప్రభాకరరావు



# స మీ క్ష

—వేటూరి ప్రభాకరశాస్త్రి

పదునైదేండ్ల కింకను బైపడినకాలమే యయి యుండును. రవీంద్రనాథ ఠాగోరు కవీశ్వరు లాంధ్ర దేశమున కరుగుదేరగా వారికి గాను- ప్రొద్దుటూర శ్రీ రాజశేఖర శతావధానిగారు రచించిన సన్మాన పత్రమని "ఆంధ్రపత్రిక"లో నొక వచన రచనము ప్రకటితముకాగాఁ జదివితిని. అదియు మహాకవి కర్పించుట జరుగలేదేమో ? అది చిన్న వచనపుఁ గూర్పే; అయినను భావోన్మేషము మహనీయమై- వినియుండినచో "టాగోరు కవి" తనిసి తన్నుఁ బోలిన వాడవని తద్రచయిత నభినందించి యుండును సుమా యని యనిపించినది. ఎన్నేండ్లో కడచెను. నాటికీనాడు మరల నా కవియే రచించిన "రాణా ప్రతాపసింహ చరిత్ర" మను నిర్వచన మహాకావ్యమును దిజవితిని. అది చదువునవుడు కవిగారికి, అవకాశము కలిగించుకొని విపులముగాఁ దద్గ్రంథ సమీక్షఁ గావింపఁగలవాఁడనని మాటయిచ్చితిని. ఆ గ్రంథమును గూర్చి యంతకుఁ బూర్వమే, నాకు గురువర్యులగు శ్రీ చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారును, మిత్రులగు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారును రచించి ప్రకటించిన సమీక్షల నటుతర్వాతనే చూచితిని. అచ్చముగా నేను వారి యభిప్రాయముల ననుమతించువాడనే యని వ్రాయవచ్చు ననుకొంటిని గాని యా మాట సహృదయులెల్లరు నైకకంఠ్యముగా నంగీకరించునదే కాన యది వ్రాయుట యేలని, గుణవంతమైన సత్కృతిని గొండాడుట మేలని, కవికది యింకను సత్కావ్య రచనకు సముత్సాహ జనకము కాఁబోలునని, చర్విత చర్వణము కాకుండ నెందఱేని కావింపఁదగినంత ప్రశంసా సామగ్రి కలదియే కదా గ్రంథమని, యిచ్చినమాట చెల్లించుకొననే పూనితిని. ఇక్కడ నింకొక్కమాట.

"ప్రతాప చరిత్రము" నాకు వచ్చిన కొ ది ల నాళ్ళకే- వారి యూరనుండియే శ్రీ శేషశాస్త్రిగారు- సుకవివర్యు లింకొకరు తాము రచియించిన "శివ భారతము"ను గూడ సమీక్షార్థము నాకుఁ బంపిరి. వీరిర్వురు నొక యూరనే వర్తిల్లి, యొక పేరనే కవితలు రచించుచు శతావధానములు చేయుచు కొంతకాల మైక్యముతో వర్తిల్లిరట. కావున నీ రెండు గ్రంథములు నొక కొమ్మనే పూచిన రెండు పూవు లనఁదగినవి. కవితా రచనలో నీ యిర్వురును గలసిన నొక్కడైన సవ్యసాచి. ఒకరు కుడిచేయి. ఇంకొక రెడమ చేయి. సవ్యసాచి రెండు చేతులు సమవాటముగలవే యటకదా ! కుడిచేయికంటె నెడమచేయి మఱీవాటము గలదనియు నొక భారతపాఠమున్నది. వీరిర్వురు గలసిన నొక సవ్యసాచి యగుట వింతకాదు. వీరిర్వురు వేర్వేరుగా నున్నను గూడ సవ్యసాచులే ! యగుటను వేఱ్వేఱ రచియించిన యీ రెండు గ్రంథములును సమర్థించుచున్నవి. వీరిరువును గుడి యెడమ చేతుల వ్రేల్మిడితో వడివడిగా బొంగరములఁ బోలెఁ బద్యముల విసరగలరు వీరి పద్యముల నడక బొంగరములవోలె వాలువాటములు కలది.మఱొకమాదిగా నుల్లేఖించుచో వీరి పద్యములెల్ల నాస్వాద్యములో నుత్తరదేశపు రసగోళములు (రసగుల్లాలు). శ్రీ రాజశేఖర కవిగారి రచన అచ్చము బమ్మెర పోతరాజుగారి సరస రచనపుఁ గమ్మఁదనవు సారాంశము. శ్రీ శేషశాస్త్రిగారి రచనము చిదిమి పుచ్చుకున్న శ్రీనాథుని రచనపు జిగిబిగి. పోతరాజుగారికి శ్రీకృష్ణదేవుని వర్ణనమందెంత ముచ్చటో రాజశేఖర కవిగారికీ ప్రతాపదేవుని వర్ణనమందంత ముచ్చట. రా మా య ణ ము న శ్రీరామునితో సమశ్రేణిలో నిలుచు ధీరోదాత్త నాయకుడు ప్రతాపసింహ చరిత్రమున ప్రతాపసింహుడు.

రామాయణమున కుత్తరరామాయణమువలె వీరిర్వుర రచనములును మొత్తమున భారతమున కుత్తర భారతములు. రాణా ప్రతాపసింహ చరిత్రము, శివభారతము రెండును గలసినచోఁ బదునాలు పదునేడు శతాబ్దుల దాక నుత్తర భారతవర్ష చరిత్రమేర్పడును. రాజపుత్ర వంశమున వీరాధివీరుడై వెలసిన రాణాప్రతాప సింహుని చరిత్రమొక గ్రంథమునను, పురాణములు కలియుగము కడతేర్చు నవతారముగా ప్రశంసించిన కల్కిమూర్తియే యనఁదగిన శివాజీ చరిత్రము వేఱొక గ్రంథమునను, వర్ణితములయినవి. శివాజీ యశ్వారోహణము, యవన నిగ్రహము మొదలగు యోగ్యతలు పోల్చిచూచుచో నాకతడు కల్కిమూర్తియే కాఁదగుననుపించును. ఈ రెండు గ్రంథములు గలసి యుత్తర భారతమగుననుచో నుత్తరదేశపు భారతమనియు నర్థాంతరము. ఏలన దక్షిణదేశపు మహావీరుల చరిత్రమిందుఁ జేరలేదు. ఇర్వుర రచనల మొత్తమగు నీ యుత్తరభారత మీ యిరువదవ శతాబ్దిలో వెలసిన యాంధ్ర మహాకావ్యములలో నగ్రగణ్యమని చెప్పుట ప్రస్తుత గ్రంథము నుత్కర్షించుటకాదు.

ఏతత్కావిద్వయము, ఈ నడుమ వేఱు వాసియీ రెండు గ్రంథములను బరస్పర నిస్సహాయముగానే రచియించిరి. అయినను రెండు గ్రంథములును వారి ఏకీభావమునే సమర్థించుచున్నవి. కాన యేకీకరించియే నేనింతదాక వ్యవహరించినాను తథ్యముగా మరల వారిఁకమీదఁగూడ నట్లతనరఁ గల్గుదురు గాక ! ఇందు ముందు ప్రతాప చరిత్రమును పృథక్కరించి సమీక్షింతును.

## ప్రతాపచరిత్రము

రాణా ప్రతాపసింహుడు ఉత్తర హిందూదేశమున రాజపుత్ర స్థానపు టుదయపురమున రాజ్యాభిషిక్తుడై, యక్బరు సామ్రాజ్య చ్ఛత్రచ్ఛాయ క్రింద నడఁగి యుండినొల్లకయిర్వదియైదేండ్లరణ్యములపాలై కడగండ్ల గుడుచుచు,గడ్డిరొట్టెలు తినుచు, స్వాతంత్ర్య తపస్సు గావించి కడకు కాంక్షితసిద్ధి నందిన రవి వంశపు రాజర్షి. ఏతచ్చరిత్రము నభివర్ణించిన శ్రీరాజశేఖర కవిగారు దక్షిణ హిందూదేశపు పశ్చిమాంధ్ర భాగమున నుదయపురమునకుఁ దెలుఁగుపేరగు 'ప్రొద్దుటూర' నుత్తమ బ్రాహ్మణ వంశమున జనించి పదునైదేండ్ల కాలమట!— ప్రతాపసింహునే లక్షీకరించుకొని, యనుధ్యానించి తజ్జీవితచర్యలఁదనలో జీర్ణించుకొని తన్మయీభవించి, యతడే తానై కవితాతపస్సు గావించి, కావ్య రూపతపఃఫలమును బడసిన బ్రహ్మర్షి. 'నా నృషిః కురుతే కావ్యమ్' అని కదా యార్యోక్తి.

"రాణా ప్రతాపచరిత్రము" సర్వలక్షణ సంపన్నమయిన సత్కావ్యము. అష్టాదశ వర్ణనల యాచారపుఁ జాదస్త (చాందసత్వ) మిందు గానరాదు. ఆత్మస్వాతంత్ర్యమర్థించువారు- స్త్రీలు, పురుషులు, బాలురు, వృద్ధులు నెల్లరు నుల్లాసముతో నుద్బోధలాభముతో జదువఁదగిన దివ్యకావ్యమిది. ఇందు ప్రథమాశ్వాసమునఁ దొలి యిన్నూరు పద్యముల కావ్యభాగమున (అంత కింటను కథానాయక చరిత్రోపక్రమము కాలేదు) సంయుక్త, పద్మిని, హమీరసింహుడు, మీరాబాయి, కుంభరాణా, చిత్తూరు యుద్ధము, పున్నా, హమీదా, అగ్బరు, పుత్త— ఇత్యాదుల వీరకథాంశములు వజ్రకందళములు వోలె దివ్యజ్వాలలతోఁ దేజరిల్లుచున్నవి. పయి గ్రంథభాగ మనేక సత్కావ్య వస్తువుల కూటపట్టి ఉత్తమగుణ నాయక రత్నభూషితమైన దివ్యహారము. ఇఁక కథాప్రధాన నాయకుఁడగు ప్రతాపసింహుని చరిత్రాంశమునకు వత్తును.

రాణా ప్రతాపుఁడు నేటికి నన్నూరేండ్లకు ముందు వర్ధిల్లిన వాడగుటచేఁ దచ్చరిత్ర రచనమునఁ గవికి పౌరాణికులగు రామాదుల చరిత్రములందు వోలె రస పుష్టికై యిచ్చ చొప్పునఁ గథా కల్పనము గావింప ననువు పడదు. వాల్మీకి వ్యాసాదులు రచించిన పురాణములను, అందలి యుపాఖ్యానములను, దెలిగించుచోఁ బ్రబంధీకరించుచోఁ గథాంశములందు నన్నయ పెద్ద

నాదులు, కొంతకుఁ గొంతగా నింకనెంతైనఁ గూడ స్వాతంత్ర్యము సాగించుకొనిరి. ఆయాకథలు కూడఁ బురాణ భేదములచే వైవిధ్యముతో నున్నవి గాన వారి స్వాతంత్ర్యము కొంత సమర్థనీయ మయ్యెను. ఇఁక నితివృత్తము కల్పితమే యగుచోఁ గవి సర్వస్వతంత్రుడే యగును గాన దానఁ జిక్కుండదు. ఇతివృత్తము వాస్తవ చరిత్రాంశమయి, మఱియు నాతి చిరకాల ప్రవృత్తమయి విస్పష్టముగా, విస్తృతముగాఁ జరిత్ర గ్రంథ నిరూపితమయి యుండునప్పుడు కవి దానిని విచ్చలవిడిగా నిచ్చకు వచ్చినట్లు మార్చివేయఁగూడదు. ఏవో పరమార్థములు గర్భితము లయియున్నను, గవితాపరికరములు ప్రాయికముగాఁ గవి స్వేచ్ఛాకల్పితముల గావించుట సత్యచరిత్రార్థములందు సముచితము కాదు. అట్లగునేని దాని చరిత్ర ప్రాధాన్యము చెడును. ఉన్నది యున్నట్టు చెప్పుటయిన నది కవిత యనిపించుకొనదన్న వెఱపు చేతఁ గాఁబోలును నేఁటి సత్కవు లధికముగా నర్వాచీనుల చరిత్రములనుగావ్య వస్తువులుగా గయికొనకున్నారు. కవి తానూహించి చక్కదిద్దనక్కఱలేని తీరున- సచ్చరిత్ర సంవిధాన సౌభాగ్యముగల చరిత్ర పురుషులను-బుద్ధుఁడు, జీససు గాంధి వంటి వారిని నాయకులుగాఁ గయికొన్నచోఁ గవికందు తథ్యానుకరణమే, రచన శ్రుతి కలసినయనురణనమే కర్తవ్యమగును. అసలు వస్తువే కవితా శిల్ప పరాకాష్ఠలో వెలసినపుడు, కవి, కవితా కల్పన లల్లబోవుచో నెందేని దాని సౌందర్యమును జెడఁగొట్టువాఁడు కూడ కావచ్చును.

సరి యయిన స్పష్టమయిన ఫోటోగల చరిత్ర ప్రసిద్ధ పురుషునిఁ జిత్రించుచోఁ జిత్రకారునికెంతో కవికి నంతే స్వాతంత్ర్య ముండును. చిత్రకారు డా చిత్రమూర్తికి విగ్రహ పరివేషమును వింతగాఁ గొంత సంతనపఱుపవచ్చును. శయ్యాసన గమనాదులలో ననుగుణమైన యొయ్యారము గూర్పవచ్చును. కవియు వర్ణ్యుని జీవిత కథాంశముల తత్త్వమును గమనించి తార్మాఱు కాకుండఁ బూర్వోత్తరముల సరిపఱిచి సందర్భింపఁ జేయవచ్చును. వాని కనుగుణమైన పరిసరములఁ బొసగింపవచ్చును. అంతేకాని వానిచరిత్ర శరీరమునే తార్మారు చేయ వీలుపడదు. మఱియు నతడు తన కాలపువి, తన తలపులోనివియునగు వాని నాచార వ్యవహారములను, గుణదోష నిర్ణయములను వర్ణ్యునిలో నసందర్భముగా ననుగతపఱుపఁగూడదు. జీససు రూపచిత్ర రచనలో శుభ్రానర్ఘ్య వస్త్రకల్పనమును, శిరోజముల క్రాపు తీర్పును దూష్యములని హెచ్ జి వెల్స్ పరిహసించెనట. ప్రతాపుని జీవిత చర్యయను బంగారు నగను తననాటి యుక్తాయుక్త వివేక కల్పనపుఁ డంకపుఁ బొళ్ళతో నదికి వన్నె మార్పక కవి తానును దన్మయుడగుటచే నదుకులు లేని యచ్చ బంగారుననే నిర్మించె ననుకొందును. పూర్వమెప్పుడో చదివిన శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహకవి గారి "రాజస్థాన కథావళి" నిప్పుడు మరలఁ జూచితిని గాని దానిలోని విషయమున కంటె నిందెంతో అధికముగాఁ గథావస్తువున్నది. ఇది సన్మూలకమేయనుట కెడనెడ కవిగారు ఫుట్ నోట్ తో ఇంగ్లీషు గ్రంథప్రమాణములఁ గూడ నుదాహరించుచు వచ్చిరి. శ్రీలక్ష్మీనరసింహకవిగారి గ్రంథము టాడ్ దొరగారి గ్రంథమునకే సంగ్రహానువాదము కాఁబోలును. కవి యిందేవేవి కొనిపట్టులఁ గథావస్తువును గూడ మార్చెనేమో యిదమిత్థమని నిరూపింపఁజాలను.

పట్టాభిషేకానంతరము ప్రతాపసింహుని వేఁటలో నొక వనవరాహము ప్రతాప సూక్త సింహుల యేటులకుఁ బడుటయు, అది నాదెబ్బకే, నా దెబ్బకేయనియాయన్నదమ్ము లిర్వురును దగవులురేనుకొని ద్వంద్వ యుద్ధమున కుపక్రమించుటయు, దాని నెవ్వరు నాపఁజాలకుండుటయు, వేటఁజూడ వెంటవచ్చిన పురోహితుడు హరభట్టారకుడు హితముపదేశించుచు

"మంచియు చెడ్డయుం దెలుపు మాన్యులులేరు,
గతించెఁ దండ్రి; ప్రా

పంచక పద్ధతుల్ తెలియు ప్రాయముగాదిఁక
రాజ్యమెంతో భా
రాంచితమో; రిపుల్ బలియు;రాహవమర్మ్మముగాదు,
మిమ్ముఁ బ్రా
ర్థించెదఁ దండ్రులార! వినరే!
గురువాక్యము మీఱరాదనన్.

సూక్తసింహుని ప్రత్యుక్తి —
అపజయమొ లేక జయమొ యిప్డందఁగోరి
చావు బ్రతుకుల నున్నాము మీవచించు
చప్పనగు మాట లూఁకొట్ట మొప్పఁబోవ
మేమిటికిఁ గష్టపడగ! నింకేల వగవ.
తనదౌ శక్తికి మీఱు కార్యములకున్
దార్కొన్నచో ముప్పు వ
చ్చును; మా యిర్వురలోన నొక్కఁడు
రణక్షోణిన్ మృతిన్ గన్న మీ
రును రావచ్చును సేద్యవచ్చు మఱిఁ
బౌరోహిత్యమున్ జేయవ
చ్చును! లబ్ధిన్ గొనవచ్చు, నిష్ఫచనవచ్చున్
దాఁటి దూరమ్ముగన్.,,

అనినంత గత్యంతరముగానరాక హరభట్టారకుడు ఖడ్గముతోఁ దనబొమ్మ చీల్చుకొని మృతుఁడగుటయు నంతలోఁ దగవు తీరుటయుఁ గల కథాఘట్టముఁ జదువునపుడు నేను చాల వెన్నడితిని. ధీరోదాత్తుఁడగు నాయకుఁడుగా నుండవలసిన ప్రతాపునకింత మూర్ఖపుఁ బట్టుదలయేల! పందినేసినవాఁడు తమ్ముఁడే యేల కాఁగూడదు. క్షణికమైన యీ యుద్రిక్త వ్యవహృతిలో స్పష్టపరిజ్ఞానము దుర్ఘటముగదా! తాకిన దెవరిదో! తప్పినదెవరిదో! తనయంత పట్టుదలతోను దమ్ముఁడును వాదాడుచున్నాఁడుకదా వ్యవహారౌచితి నేని చూడవలదా! మహనీయుఁడైన పురోహితునిఁ జంపుకొనుట, పరాక్రమశాలియైన తమ్ముని తెగఁద్రెంచుకొని శత్రుపక్షమునఁ జేరఁనడచుట; ఇదియేమినేరిమి. ఇస్సీ! యనుకొంటిని. అన్నను విడనాడి వెడలిపోయిన సూక్తసింహుఁడు తన యన్న మరలఁ గొన్ని యేండ్లకు అక్బరు సైన్యము తోడి మహాయుద్ధమున శత్రువులఁ జెక్కుముక్కలుచేసియు, యుద్ధ పరాఙ్ముఖుఁడై యశ్వైకసహాయుఁడై పరుగువాఱుచుండగా వెంబడించి చేరఁబోయి శరణాగతుఁడై యానాడు వేటలో వంచకుఁడై తాను వాదనకుఁ జొచ్చుటను, పందినేసినది తానుగాక పోవుటను వ్యక్తపఱచిన ఘట్టము చదువునపుడు నేను బులకిత శరీరుఁడనై కన్నుల నశ్రుకణములు దొరుగగా విస్మయము చెందితిని. ఈ పరిణామమును దొలుతనే కవి సూచించినచో నీయద్భుతరస నిర్వాహము పొసగదుగదా! ప్రతాపుని సత్యదీక్ష తెలియరాదుగదా! ఇట్లు నాటకమునందుఁ బోలె నద్భుత రసనిర్వాహ మీగ్రంథమునఁ బెక్కుపట్టులఁ గలదు ఇట్టిపట్టుల సమకూర్చుటలోఁ గవికల్పనా కౌశలము చాలఁగా పనిగొని యుండవచ్చును. ప్రతాపసింహుఁడు దౌర్భాగ్యమయుఁడై విజయాశ వీడి, యనుచరులతోఁ గూడి, పిడికెడు మాతృదేశపు మృత్తికను దలమీద ధరించి దేశాంతరములకుఁ బయనము సాగింపఁబూనినప్పుడుపర్షియానుండి భామాసాహి యను ప్రాచీన మంత్రి వచ్చి పర్యాప్తమైన ధనమొసఁగి, యుద్ధమునకు మరల నుపక్రమింపఁ జేయుటయుఁ దదాదిగా సర్వము జయమే యగుటయుఁ దటస్థించినది. ఇట భామాసాహి సంఘటన సన్నివేశ మద్భుత రసావహము. మహాభారతమును మించి యే గ్రంథమున నలౌకిక మాహాత్మ్య సందర్భములు లేకయే యద్భుత కథార్థములిట్టివి మఱి యెన్నేఁ గలవు. భామాసాహియే కథానాయకుని యశశ్శరీరమునకుఁ బ్రాణము వోసిన మహాత్యాగి. ఈ క్రింది కథాఘట్టములీ గ్రంథమునఁ గండపట్టు లనఁ దగినవి.

రాజపుత్ర స్థానపు క్షత్రియులకు మేవాడ క్షత్రియాన్వయము వారు రాజాధిరాజులును, గురురాజ పట్టభద్రులు నట? అట్టి వంగడపు చేలికయగు ప్రతాపసింహుని తలపై రాజపుత్రస్థాన క్షత్రియ సంప్రదాయ సంరక్షణ భారము, కిరీటముతోఁ బాటు నెలకొన్నది. అందు కర్ణుఁడనియే సలుంబా కృష్ణుఁడు తాను మాటఁ

దప్పిన వాఁడన్న సడికిఁ జాల్పడి యాతనిఁ బట్టాభిషిక్తునిఁ జేసినాఁడు. ఇక్కడ కుటుంబ కలహములు రేగినవి. సోదరులే శత్రువగు నగ్బరు పక్ష మాశ్రయించిరి. రాజ్యారంభముననే యంతకలవరము- అయినను రాజపుత్ర స్థాన సామంత మండలమెల్ల, నిర్వికల్ప నిశ్చయముతోఁ బ్రతాపసింహు ననువర్తించుట, వారికి ధైర్యోత్సాహ దీప్తి నాతఁడు కలిగించుట అబ్బురము గొల్పును. ప్రతాపసింహుఁ డనుచరులతోఁ గర్తవ్యము నాలోచించుట మొదలుగా మేవాడపొడు పఱచుదాఁక గల నూఱు పద్యముల గ్రంథభాగమున, పలువు రొక ధర్మనిర్ణయమునే పలు దెఱఁగుల నుల్లేఖించుటను, గర్తవ్యమునకు దూఁకుటను, నేర్పుతో గంభీర నిర్భరముగాఁ గవి గారు నిర్వహించినారు స్వామిభక్తి, దేశభక్తి, రాజగురురాయని సేవానందము నిక్కడ నఖండముగాఁ దాండవించినది. నాయకుని, సమరోల్లాస సందర్భముల నిట్లు రసోదాత్తముగా వర్ణించి, తోడనే ప్రతినాయకుఁడగు నగ్బరు నాస్థానిని, తదీయుల నిర్ణయములను, గూఢత్రాసు తూకమున నెగుడుదిగుడుగా నూగులాడించి యక్కడనుండిరాయబారిగా వచ్చిన మానసింహుని, అక్బరు తోడి బాంధవము నెఱపినందుకనియి యవమానించి పంపుటతో ద్వితీయాశ్వాసమును ముగించినారు. ఇట 281, 282, 283 పద్యములలో మానసింహుఁడు ప్రతిపాదించిన సంధిషరతుల నభిమానసింహుఁడై ప్రతాపసింహుఁడు ధిక్కరించినాడు. ఉభయ పక్షముల వారి చిత్తవృత్తులకుగూడ నింతటితో నాశ్వాసము ముగిసినది. తృతీయాశ్వాసమెల్ల దారుణయుద్ధము. అందులో నూఱు పద్యముల పట్టునే నే నుద్యోగపర్వరచనా మహత్తుకు మిక్కిలి చేయి యనఁదగినఁ దానిఁ జదివి నీరయినాను. భీమచందు గంభీరోక్తులు. ప్రతాపసింహుని విషాదము చంద్రభట్టారకుని ధర్మోక్ప్రోధము నర్జున విషాదయోగ సారాంశములు! మఱి వీర కరుణ శాంతరసముల సుడిగుండములు- అట కవితా ప్రవాహము నంటుకొన్నచోఁ బాఠకుఁడిందు మునిగిపోవును. వీర భయానక బీభత్స సంక్షోభమయ మయిన పైభాగమును మనసారఁ జదువ నాకు శక్యము కాలేదు.

దూరముదూరముగా పయింబయిన చదివితిని. నాకట్టి పట్టులు దుష్ప్రతములు. ఏ వాఙ్మయమునందుఁ గాని, యే సత్యచరిత్రమునందుఁగాని, యిట్టిఘట్ట మపురూపమే యనదగినది. ఖండేరాయని వీరనిర్యాణము, సూక్తసింహ ప్రతాపసింహ సౌదర్య సౌహార్దముల పునరనుసంధానము; చైతకాశ్వపు స్వర్గప్రస్థానమును, రాజనీతి రీతిని జూచితిమేని, వీనిలో సూక్తసింహుని ప్రవర్తనము దూషితమనవలెను. అక్బరు సేనలో సేనానియై యుండి యాతని యుప్పుఁదినుచు నాతని పక్షమున యుద్ధము సేయుచు దొంగచాటుగా స్వపక్షీయులను జంపి ప్రతిపక్షమునఁ జేరినాడు. తాను జేరవచ్చుటకు ముందు అక్బరు పక్షమును వీడి వచ్చుట యక్కడ వ్యక్తపరుపలేదు. అన్నదగ్గరనుండి మర్నాడు వెడలి అబ్దుల్ రహిమాను ప్రభృతులతోఁ దనమార్పును దెలుపుకొన్నాడు. అప్పుడు అబ్దుల్ రహిమానుడు మానసింహుని మాట వినక సూక్తుని విడిచిపుచ్చుటయు రాజద్రోహమే. రాజనీతిలో- అనఁగా దయాదాక్షిణ్యములు వీడనాడి యుద్ధమొనర్చి శత్రువులను జంపుటకే పూనిన క్రూర తంత్రములో- మెలఁగుచుఁ దద్విరుద్ధముగా సూక్తసింహుని దయదలఁచి ప్రతిపక్షమునఁ జేరవిడుచుట స్వామిద్రోహము కదా! సూక్తసింహుడును, రహిమానుఁడును నాడట్లు ద్రోహము చేయకుండినచో —? కవిగారిందు సత్యచరిత్రమును సంరక్షించిరి! వీరాధివీరుఁడయిన సూక్తసింహుని హృదయమును చిదిమి వైచినది భ్రాతృగౌరవము! ధీరోదాత్తుఁడయిన ప్రతాపసింహుని నా దశలోఁ జూచి యాతఁడు నీరయినాడు. యుద్ధమిక్కడ నొక్కనాటిదే. అయినను నిండు రెండులక్షలతురుష్కవీరులును నిర్వదివేలరాజపుత్రవీరులును దలపడి యుద్ధముజరపిరి. పది గంటలలోఁ బదునాల్గువేల రాజపుత్ర వీరులు, తొంబదివేల తురుష్కవీరులును వీరస్వర్గమందిరి ఉభయపక్ష వీరులలో తేజసింహుడు. అబ్దుల్ రహిమానుఁడు ఖండేరావు (ఈతడు పసుపుబట్టలతోడి పెండ్లికొడుకు, ఈతని పెండ్లి కూతురు,) మానసింహుడు, భీమచాందు, ప్రభృతుల వీరవిహారములు మహనీయములు. శ్రీరామునకు హనుమంతు

డెట్లో ప్రతాపునకు భీమచాందను భిల్లులరేడట్లు. రామునకు సుమంతుఁడు- లక్ష్మణుఁడు ఎట్లో ప్రతాపునకు సలుంబా కృష్ణసింహుఁడట్లు. వీరిద్దర నైరంతర్యపు తోడ్పాటునకును, మఱి తక్కిన రాజపుత్ర రాజ మండలపు సౌమనస్య సహకారములకును, ప్రతాప దేవుని త్యాగ సాహస సత్యధర్మ దీక్షలు సంరక్షకములైనవి. తృతీయాశ్వాసపు యుద్ధవర్ణనమునఁ గవియు శరపరంపరగా దివ్యధారగాఁ గవితను సాగించెను. ఈ బీభత్స వర్ణనమునఁ గవి ప్రామాణికమైన కథావస్తు పరికరమును బడసియే కవిత నెఱపెనని విశ్వసించుచున్నాను. చతుర్థాశ్వాసమునఁ గూడ మరల యుద్ధములు, పరాజయములు, నిష్పచ్చరములు, నిర్వేదములు, ప్రతాపసింహునిఁ జుట్టుముట్టుటయే! దుర్భరముగా దుఃఖము గొల్పు సంఘటన మిందొకటి! "దేవేరీ యుద్ధా"వసానమున ఘోర వర్షము. శైలగుహలో దేవేరియు, బిడ్డలును దడిసి, ముప్పందుచుండిరి. తిండి లేదు. పాటేశ్వరీదేవి గడ్డిరొట్టెలు గాల్చి బిడ్డలకు భర్తకుఁ బెట్టెను ధ్యాననిమగ్నుఁడై ప్రతాపుఁడుండగా గండుబిల్లి పసిబిడ్డలపైకి దూకి, మేను రక్కి రొట్టెముక్కల నెత్తుకొనిపోయెను. ఆహారము లేదు. నెత్తురు గీఱలతో బిడ్డని యేడ్పు. ప్రతాపుఁడు క్రుంగిపోయినాడు మనసు చెదిరినది. భిల్లభృత్యుని ద్వారమున అక్బరునకు యుద్ధవిరామపు లేఖమంపినాడు. పప్పుడు పాటేశ్వరీదేవి ప్రతాపునకుఁ గార్యోత్సాహముఁ గొల్పినట్లు కవి చేసిన వర్ణనము ఉత్సాహోనందరసాయనము! సంగ్రామ రక్ష!

ఒక్క పద్యమే ఉదాహరింతును—

సీ॥ నేనెఱుంగకయున్న నిరతంబు ననుఁగాచి
నాకోప ముపశమనంబు చేసి
మధుర స్వభావ సంపదచే నుడుకుఁ దీర్చి
యలఘు శాంతతఁ గూర్చి కలత దేర్చి
యూరించి లాలించి యుపచరించి కఱచి
యలరించి మించి ధైర్యంబుసించి
మదిహరించెడు గుణమాధుర్యమును రూప
మాధుర్యమును బెంచి మమతనుంచి

గీ॥ యండఁబాయక నీవుండునంత దాఁక
వనిత! కోటానఁగోటు లాపదలు వచ్చి
తలఁబడిన నంగుళంబు ప్రతాప విభుఁడు
దారి తప్పునె స్వాతంత్ర్య ధర్మనిరతి —

(4 ఆ. 164. ప)

అక్బరు నాస్థానికి భిల్లుఁడు వెళ్ళినాఁడు. ఢిల్లీ వర్ణనము, అక్బరు సందర్శన వర్ణనము, అక్బరు నాస్థాన వర్ణనము, సభ్యుల వర్ణనము, అందు సభ్యుల సచ్చరిత్ర సంకలనమునఁ గవి జాగ్రత్త - ఇట్టివి ఆంధ్ర కావ్యములలో ననన్యత్రదృష్టములు, విస్పష్టములు, మనోజ్ఞములు, మహనీయములు! అక్బరు సభ్యులలోనివారు, అబ్దుల్ రహిమానుపృథ్వీరాజులు, భీష్మద్రోణుల మాఱటవారు! అబ్దుల్ రహిమానుఁడు ప్రతాపునెంతో కొండాడునట్లు కవివర్ణన మున్నది. కాని నిజమునకుఁ జూడ రహిమానుఁడు గూడఁ బ్రతాపుని నిత్యప్రస్తుతికి బాత్రుఁడేయనవలెను. కవిగారును దీని గణుతించినారు. కావ్యములోనికెల్ల నక్బరు సభలో భిల్లుని లేఖము చదువుట, దానిపై పృథ్వీరాజు, అబ్దుల్ రహిమానుఁడు, మానసింగు ప్రభృతులు అక్బరు చక్రవర్తితో జరిపిన చర్చలును, మర్నాడు భిల్లుడు పృథ్వీరాజు నింట నుండగా నబ్దుల్ రహిమానుఁడు వచ్చి ప్రతిలేఖము వినుచుట, దివ్యకావ్య ధోరణిలో రసభరితములై యున్నవి. తిక్కన భారతోద్యోగపర్వ రచన కిది ప్రతిరచనము! ఈ పట్టు ప్రతాపుని మహనీయతను బ్రకటించు నొక వస్తుధ్వని మహాకావ్యము!

ఈ కావ్యమున నాకుఁ జాల నబ్బురము గొల్పినది. అక్బరునేర్పు కూర్పు. రహిమాను, పృథ్వీరాజు, మానసింహుఁడు, పలుతెఱఁగుల కర్తవ్యములను నిరూపించునపుడు వానినెల్ల సమరసపఱిచి; తియ్యనితీరున కార్యనిర్వాహము గావించుటలో అక్బరు మెలకువ మెచ్చఁదగినది. అక్బరు నేర్పెట్టిదో కవిగారి నేర్పు

నట్లేమెచ్చదగినది. ఇందుమానసింహుడు కర్ణునంత వాఁడు. ఈతనిఁదేలికవానిగానేను దృణీకరింపఁజాలను. ఒకతీరున స్వామిభక్తిలో పృథ్వీరాజునుఅబ్దుల్ రహిమానును మీఱిన వాడేమో! రాజనీతిరీతిని జూడఁగా అబ్దుల్ రహిమానులేఖ యాక్షేపార్హము కావచ్చును. ఇటభారతమున భీష్మద్రోణులకెట్టి సడివెట్ట వచ్చునో యట్టిసడినే యిరువురపైఁగూడఁబెట్టవచ్చును. దాని నెట్లు సమర్థింపవచ్చునో దీనినట్లే సమర్థింపవచ్చును. ఇందుఁ గర్ణునట్లే మానసింహుఁడు వర్తిల్లెను. స్థలాంతరమందలి యీపద్యమిక్కడ చదువఁదగినది.

ప్రమదోద్యానముఁ బోలు సీయవన
సామ్రాజ్యంబునన్ గంటకో
గ్రమహీజంబులు నెవ్వగన్ బెనిచె
సీరాణా ప్రతాపుండు; త
త్సమదోద్ధత్య మడంపరాని యెడ
సీదర్పంబు నేనొల్ల ఖ
డ్గము నేనొల్ల; నటంచునేలవిసరెన్
గాలాహినా రోజుచున్ (5 ఆ. 320ప)

కవిగారు పయికథా పాత్రముల నా యాతీరుల వివిధమనోవికాసములతో గుర్తించి విభిన్నలక్షణములతో విమర్శింపఁదగినట్టు కట్టదిట్టముగాఁ గల్పించినారు. చరిత్ర గంథములలోనేవేనికొంతస్థూలరూపముగా నాయావిషయము లుండబోలునేమో ! కాని యిందు గవిచిత్రణము చాలఁగౌశలముతో నాయాపాత్రముల మనోభావలేశాతిలేశాంశ వివేచనముతో సువిపులముగా సురుచిరముగా నున్నది. ప్రతిపక్షము వారు గూడఁ బరమానందముతోఁ బ్రస్తుతింపఁదగినది ప్రతాపుని మహనీయత. నిజమెంతోగాని కవిగారు దానినంత చక్కఁగా నద్భుతావహముగా నారాధనీయముగాఁ గల్పించినారు. శత్రుముఖమునఁ బ్రతాపుని సౌగుణ్యమును సన్నుతించుటలోఁ గవిగారు గొప్పనేరిమి నెరపినారు. ప్రతాపుని దూతయైన భిల్లునికి అక్బరునాస్థానిలో జరిగిన సత్కారము రసచమత్కారకలితము. అక్బరు తన పట్టాభిషేకము నాడయిన భిల్లలేఖ ప్రకటనము నాటి మహాత్సవమునను భవించెనో లేడో యనదగినట్లు కవితా విలాస మక్కడ వెలసినది.

అక్బరు ప్రతాపసింహుని లేఖఁగొనివచ్చిన భిల్లుని యునికి సభలో

గీ॥ దుద్దుఁగఁబడి బుజముల దుడ్డుకఱ్ఱ
కరమున నెసంగు గంభీర కాలమూర్తి!
భిల్లుడు వసించెనొక దొడ్డపీటపైన
వేదికాంతమందక్బరు విభుఁడుచూప (4ఆ 209ప.)

ఆతడు వెడలునపుడు.

ఆ॥ అల్ల వాఁడె భిల్లుడంట యక్బరు శాహి
యోలగమునఁ గూరుచుండెనంట
నా ప్రతాపు దూతయట యితండనిమేడ
లెక్కనిక్కిచూచి రింతులెల్ల- (4ఆ. 297 ప.)

అబ్దుల్ రహిమాను లేఖలోని ముక్కలు రెండు —

గీ॥ బరువుపడ కిన్నియేండ్లు కాపాడినాఁడ
వనఘ స్వాతంత్ర్య కనక గర్భాలయమునఁ
బ్రజ్వరిల్లు నఖండ దీపమ్మునిపుడు
కొండ యెక్కింతువే కనుగూర్కిదేవ!
(4ఆ. 328 ప.)

గీ॥ సంగర తరంగ సంక్షుభితాంగమగుచు
నలముకొనియున్న బహువిపదబ్ధియందుఁ
జెక్కుచెదరక చిక్కక సేమమునను
నడచెడును గాక యుష్మదానందనౌక॥
(4ఆ. 334 ప.)

చతుర్థాశ్వాసము ముగిసినది. పంచమాశ్వాసము మరల యుద్ధమే. పరాజయములే ధనములేదు. ధాన్యము లేదు స్వాతంత్రముతో నిలువ నీడలేదు. దేశభ్రష్టుడ నగుదునుగాకని ప్రతాపుఁడు తలఁచెను. తోడివారు సలుంబ్రా కృష్ణసింహాదులెల్లరు వెంటవత్తుమనిరి. ఈ ఘట్టమున కవిగారు తమ కవితలోఁ గరుణరస వర్షము కురిపించినారు.

సీ॥ వేనవేల్ రిపుల నొప్పించు పట్టునఁగర్ణ
పేయమై విందునీ వీరగర్జ
దల్రదుంచు బహుళాపదలుచుట్టినప్పుడు
చెవియొగ్గి హుంకారరవమువిందుఁ
దిండిలేకతపించు దినముల విధిఁజూచి
పెదబొబ్బవెట్టు చప్పుడుల విందు
స్వాతంత్ర్య సమరదీక్షకుఁ బూన్చునీయుప
న్యాసంబులను జెవులారవిందుఁ

గీ॥ గాని కొండంత నొప్పితోఁ గాసిపడుచుఁ
బిడుగుపడినట్లు హృదయముల్ ప్రీలఁజేసి
విన్ననై దీనమగు వాక్కువిని యెఱుంగ
ననలమున ప్రేల్చునట్లు నా మనసు ఫొగిలె.
(5అ. 94ప.)

గీ॥ నీ హృదయ పద్మపీఠ నిర్యూహమెక్కి
యలరి స్వాతంత్ర్యలక్ష్మి సహస్రభాను
కాంతులను వెల్గెఁదన్మహాఖండదీప్తి
కడలుకొని ధిల్లిమొగలుల కనులుగుట్టె. (5-95)

సీ॥ పురము రాజ్యము మాని మూఁడేండ్లు శ్రీహరి
శ్చంద్రుండు పడిన కష్టములనెఱిగి
పదునాలుగబ్దముల్ వనవాసమున రామ
చంద్రుండు పడిన కష్టములనెఱిగి
పదియు మూడేండ్లుగాఁ బాండవుల్ గహనాంత
రములలోఁ బడిన కష్టములనెఱిగి
యిరువదిమూడేడు లీవీ వనులఁ గుటుం
బముతోడఁ బడిన కష్టములనెఱిఁగి

గీ॥ తారతమ్యంబుఁ దూచిన వారియిదుమ
లత్యగాధా పదావర్తమైననీదు
చరితమున నొక్కపుట కొక్కచరణమునకు
సాటిగావని గొంతెత్తి చాటనేర్తు! (5అ. 96ప.)

గీ॥ వీరు లాత్మీయులాప్తులు పృధ్వివరులు
బంధువులు నీగిరీంద్ర గర్భముల నొఱుగ
విరికి దొంగనుగా నిన్ను దొఱగి జాఱ
వ్రాసె నాతల ధాత! మేవాడమాత! (5.అ.116ప.)

గీ॥ తలఁదఱుగ నోపు బహు విపద్దశలనైనఁ
గాంతి యించుక చెడని నాకన్నుదోయి
నశ్రుకణములు వొడమె; నీ యడుగుదోయి
నమ్మ! ముక్తాభిషేకంబు నాచరింతు.(5అ 117ప.)

సీ॥ హారావళీశైల మనుపమ స్వాతంత్ర్య
వీర దుందుభుల శబ్దించుఁ గాక;
గుట్టలు పుట్టలు గుహలు స్వధర్మత
త్పరుల యశంబు మార్చలుకుఁ గాక;
వేవాడ రాజ్యలక్ష్మి పరాక్రమమెల్ల
వేళల భువిఁ దాండవించుఁ గాక;
త్యాగైకధనుల సత్యస్వరూపులచేర
హించి నీ కడుపు ఫలించుఁ గాక;

గీ॥ భానుకుల గౌరవంబు నిల్వంగ నోడి
త్యాగమునఁగుంటువడి నీ పదముల గొలుచు
పున్నెములులేక దూరభూములకు నేగు
మమ్ము మాపేళ్ళు లోకంబు మఱచుఁ గాక?
(5అ. 119 ప.)

గీ॥ అనుచు భక్తినిఁ జూపి వందనమొనర్చి
మరువఁజాలక చేరెడు మట్టిదీసి
కనులనద్ది రుమాలునఁ గట్టి యూర్చి
యాప్రతాపుఁ "డంకారు" పైనధివసించె.
(5అ. 120ప.)

కం॥ ఆ రీతి నెల్లవారలు
చేరెడు చేరెడుఁగ మట్టి చేకొని తలలన్
జేరిచి మ్రొక్కుచుఁ బయనం
బారంభించిరి ప్రతాపుఁ డందఱ నడుపన్.
(5అ. 121 ప.)

ఇట్టి యిక్కట్టు పట్టుననే భామాసాహి యను ప్రాఁత మంత్రి వెదకికొని వచ్చి విపుల ధన మిచ్చి నాడు! పునర్యుద్ధోద్యోగము! దీనికిఁ బ్రతిగా నక్కడ నగ్బరు దౌర్బల్యము! ప్రతాపుని జయములు విజయములు, పునారాజ్య లాభములు! ప్రతాపుని పట్టు గండు

జీమ పట్టు.తలతెగినఁ దెగుగాక! పట్టు విడువడు! తల తెగలేదు. పట్టు నెగ్గినది. ఇర్వదియైదేండ్ల ప్రచండ ప్రయత్నమున సంకటములు, సంశయములు ఎన్నో? అయిన నేమి! మంగళాంతముగా కథ ముగిసినది.

పెక్కు సంవత్సరములు ప్రతాపుని చరిత్రము పఠించి పరవశత్వమున మైమఱచుచు రసమయ హృదయముతో, సత్కవితా దీక్షతోఁ గవిగా రేకధారగా నొక్కయూపున నొక్క యావేశమున నీ కావ్యమెల్ల ముగియ రచించినాడు. గ్రంథమెల్లఁ జదివితిని. ఈ గ్రంథమును జదువుచున్నపుడు నాకు మఱీ ముచ్చట గొల్పిన పద్యములను, గూర్పుపొంకములను గొన్నింటి నిక్కడ పరిగణించుచున్నాను.

## పూర్వపీఠిక

42 43 50 51 57 59.

## ప్రథమాశ్వాసము

1 34 43 44 48 49 51 79 84 95 114 124 125 128 130 132 133 134 139 145 146 147 151 153 154 156 175 181 183 184 191 195 196 198 199 202 204 211 212 213 254 270 296 304 343.

## ద్వితీయాశ్వాసము

43 52 69 71 72 79 80 84 88 93 94 97 98 103 105 106 108 109 110 111 115 117 118 119 135 140 141 142 145 146 148 149 154 160 164 165 168 169 171 172 177 178 179 182 184 188 195 213 220 222 247 248 252 255 258 261 264 265 268 275 276 284 285 290 291 301 312 316 318;

## తృతీయాశ్వాసము

26 28 30 32 33 52 61 71 73 74 82 86 90 101 121 144 149 158 160 161 162 168 169 174 176 182 209 212 219 220 224 228 230 313 314 316 317 321 322 323 324 325 329 331 333 335 336 337 338 339 340 342 343 346 352 353 355 356 359 363 365 366 372;

## చతుర్థాశ్వాసము

4 21 23 27 29 55 67 81 82 83 94 105 128 129 130 135 144 157 162 165 196 224 230 231 232 233 243 250 256 260 272 277 283 297 303 328 334 357:

## పంచమాశ్వాసము

22 29 61 62 71 77 78 79 82 84 91 94 97 116 117 119 120 130 145 147 158 173 181 275 289 290 300 307 309 314 315 317 324 342 346 352 353 356 366 368 372 373 376 381 383 384:

ధారాపాతపు రచనా ధోరణిలో నక్కడక్కడ నెఱసులు గొన్ని దొరలినవి. కవిగారు వానిని బునర్ముద్రణమున సరిపఱచుకొందురని వానిని వ్రాసి వారికి నేఁడు బంపితిని. అవి గణింపఁదగినవి కావు. కవిగారు ఉహ్వని యూది తొలగింపఁగలరు.

'కావ్యమునా జలరాశి యందులో
పల నెఱసుల్ గణింతురె
యపారములై మణులెల్ల నుండఁగన్'—

కావ్యము ముగిసినది. కావ్య నాయక కవీశ్వరుల యైక్యము గుర్తించి వారి వెన్నాడి నేను నానాఁటి వాఁడనై యేదో కొంత కావ్య సమీక్ష చేసినాఁడను. ఇక నేను నేనై నేఁటి వాడనై స్వతంత్రుఁడనయి ఇఁచుక యుగ్గడింతును.

రాణా ప్రతాపసింహుఁడు భారత దేశముపై పొంగి పొరలి పాఱువాఱుచున్న తురుష్కనదీ ప్రవాహమునకు కట్టుటకును, భారత ధర్మమును నిల్వరించుటకును,

నని యిర్వది యైదేండ్లపాటు (నేటి గవర్నమెంటు సర్వీసు కాలము!) పాటుపడి కృతార్థతను ముట్టి కొన్నాఁ డనిపించుకొన్నాఁడేమో! అందుఁబ్రతి నాయకుఁ డగు నగ్బరును నిందుకుఁబ్రతిగాఁదలపులున్నవాఁడుగా వచ్చును గదా! ఏకముఖమైన యేల్బడిలేక చెడుచున్న భారత దేశమును దన యేకచ్ఛత్రాధిపత్యమునకు లోఁబఱచుకొని యేక రాజ్యముగా నేలవలెనని యతని తలపుగావచ్చును. అందాతఁడును గొంత వఱకు కృతార్థుఁడయ్యెననిపించుకొనెనేమో! ఇందు పై యిర్వురు నిర్వదియైదేండ్ల పాటు దారుణ మహామారణ తంత్రమునడపినారు. ఎందఱో మహనీయు లీమహాగ్ని జ్వాలలో మ్రగ్గినారు. యుద్ధమనఁగానే దయాదాక్షిణ్యములులేని క్రూరమారణ కర్మమన్నమాటే. కంబళిలో నంబలి పోసికొని త్రాగువాని నోర వెంట్రుకలేరఁ జూచుట వంటిది యుద్ధతంత్ర నిర్వాహకులలో ధర్మా ధర్మముల వివేచనము చేయఁజూచుట. దేవాసుర యుద్ధమాదిగా నేఁటిదాఁక జరుగుచున్న యుద్ధ కర్మములలో సర్వత్ర సత్యదయా ధర్మ దాక్షిణ్యముల విధ్వంసమే కానవచ్చుచున్నది గదా! మాకారోగ్యా యుష్యైశ్వర్యములవృద్ధి; మా ప్రత్యార్థికిఁదత్ప్రతికూలములసిద్ధి ఇదికదా యుద్ధనీతి. ఇట్టి యుద్ధ తంత్రమునఁగూడ నేవో కొన్ని ధర్మ నిర్ణయములున్నవి. అవి కూడ నన్ని యుద్ధ కథలలోను నవకతవకయినట్లే కన్పట్టును. దేవాసుర యుద్ధమున, రామ రావణ యుద్ధమున, భారత యుద్ధమున, తెఱచియెఱిఁగింపఁబనిలేదు; సువ్యక్తములే. అట్టి లోపము లీయుద్ధకథనము నందుఁగూడనున్నవి. అవి తప్పనివే. యుద్ధమన్నప్పుడు కవిగారు వానిని దిద్దఁగల్గుదురుగాక. దిద్దలేదు. దిద్దఁగూడదు కూడ. నిజమున కీయుద్ధసందర్భము నిప్పటిమనము వెనుకకుఁదిరిగి చూచితిమేని నైరాశ్యమే పొడచూపును. ప్రతాపుని సంకల్పము లాతని యసువులతోనే ఉడిగిపోయినవి. అగ్బరు నాశయు నాశమేయయినది. ఏమేమో జరిగినది. ఏమి లాభము? ఏనాఁడో ముట్టుకొన్న హైందవ తురుష్క వైరాగ్ని రావణాసురుని కాష్ఠమున్నట్లు నేటికిని ఆరకుండ మండుచునే యున్నది ! ఏమి పరమార్థము లభించినట్లు. గ్రంథము రచించుచో శ్రీ రాజశేఖర కవిగారిని ప్రతాప సింహుఁ డాత్మసాత్కరించుకొన్నట్టే యీ సమీక్ష రచించుటలో ప్రహ్లాద బుద్ధ జీసస్ టాల్‌స్టాయ్ గంధులు నన్నాత్మసాత్కరించుకొన్నట్లయినది. సమీక్ష చేయుటలో నడుగడుగునకును నడ్డంకులే! సాగక పోవుటే! మనస్స్వశమగుటే. తలఁపుకుదురదు. వ్రాఁత పొసఁగదు. నేటి నన్ను దిగద్రొక్కుకొని పదునాఱవ శతాబ్ద కాలమున కుఁబంపించి ప్రతాపుని సంకల్పములకు వెన్నాడింపఁజాలక పోయితిని. ఉరికంబము నెక్కించు వారినిఁ గూడ—"తండ్రీ! యెఱుక మాలి యిట్లు చేయుచున్న యజ్ఞానుల రక్షింపు'మని భగవంతుని వేడిన క్రీస్తునంతఃకరణమును, "జనరల్ డయరు ఉద్రిక్తుడై నన్నుఁ గాల్చుటకు రివాల్వరు గురిపెట్టి దూకి వచ్చుచున్నచో నపమార్గమునఁ జాటుగా వచ్చుచున్న యాతని కాలఁ ద్రాచుపాము చుట్టుకొని కాటు వేయుచున్నచోఁ జూచితినేని వెంటనే చేరఁబోయి త్రాచును దప్పించి విషము నోటఁబీల్చి యుమిసి యతని రక్షించుట నా యహింసా సిద్ధాంతపుఁ బరమ పరిష్కార"మన్న గంధి హృదయమును, నా హృదయమునఁ దొణికిసలాడఁ జొచ్చినవి ఉత్తర ధ్రువమున నుండి దక్షిణ ధ్రువముదాఁక, ఇండియా నుండి అమెరికాదాఁక, భూగోళమునఁ గల మానవత యెల్ల నైక్యముతో ననురాగముతో వర్ధిల్లుటే పరమలక్ష్యమని, అహింసా సత్యప్రేమ సామ్యములే దానికిఁబరమ సాధ

నములని, అధర్మముల గానమున శక్యమయినంత వఱకు ప్రతిఁగలుపుకొనుచే, యసురున్నంత దాఁక నా కర్తవ్యమని నిశ్చయించుకొని యుండుటచే నట్టి కలవరము నాకుఁ జెలరేగినది. కాని; క్రీస్తు మాత్ర మేమి చేయఁగలిగెను. గంధి యేమి చేయగలిగెను. అని ప్రశ్నము రావచ్చును ఏమి చేయఁగలుగక పోయినను సరియే. ఆదివ్యతత్త్వములలో జీర్ణించుటే నాయాత్మకు శాంతి. నా బ్రదుకునకుఁ దెరువు. కాల గర్భమున నేమున్నదో. ఇది యెందుకుఁ జెప్పితిననగా నిట్టి వైక్లబ్యము నాకుఁగలుగకుండినచో నీ సమీక్ష నింతకంటె సంతనగాఁజక్కఁగా సాగింపఁగల్గియుండెడి వాఁడనేమో కదాయని.ఇటీవల బుద్ధుని జీవిత విశేషము లెన్నేని గుర్తింపఁబడినవి. విపులముగా బుద్ధ చరిత్ర మునుగాని, క్రీస్తు చరిత్రమునుగాని కొని శ్రీరాజ శేఖర కవిగారు గ్రంథము రచించినచో నాకెంతేని సంతోషము గల్గును. ఇది నా కోరిక.

"సర్వత్ర సంపదస్సంతు సర్వేసంతు నిరామయాః
సర్వే భద్రాణి పశ్యంతు మాకశ్చిద్దుఃఖ మాప్ను
యాత్" —

[మహాకవిశేఖరా, మహాపురుషా, గురుపాదుల సన్నిధికి— ఇత్యాది సంబుద్ధులతో రాజశేఖర శతావధాని గారు వేటూరివారికి వ్రాసిన లేఖలు కొన్ని ఉన్నవి. ఆ ఉత్తర ప్రత్యుత్తరాలలో ఆ పవిత్ర కవితాత్మల అనుబంధము ఈ జన్మపరిచయాన్ని అధిగమించిన రీతిని వ్యక్తం చేస్తున్నది. శతావధాని గారి 'ప్రతాప' గ్రంథం మీది పై సమీక్ష కూడా ఆ అంశాన్ని వ్యక్తీకరిస్తున్నది. 'రేపు సభ జరుగు'ననియు నందు మీరు సమీక్ష చదివి యాశీర్వదింతురనియుసౌ॥ కామేశ్వరీదేవి తెలిపియున్నది.' (18-1-1944)అని ఒకలేఖలోకలదు.

ఇది యీ సమీక్ష రచనా కాలమని తెలియుచున్నది. మచ్చు కిక్కడి మరి రెండు లేఖలలోని విషయ ముట్టంకింతుము. —సం॥]

"మహాపురుషా! నిన్న 5 గంటలకు సౌ॥ మా తల్లియు, శ్రీ చిదంబరశాస్త్రి గారు వచ్చినప్పటి నుండి మీ పవిత్ర హృదయము గూర్చియు మీ ఆదరాతిశయము గూర్చియు వేయివిధముల ముచ్చటించిరి. ఆనందహర్షముల కెడతెరపి లేక పులకిత శరీరుడనై నిలిచిపోతిని. నన్ను గూర్చి మీరెంతయో పరిశ్రమ చేసి మనోమయలోకమున నెన్నియో జనిశతములో వెళ్ళి పరిశీలించితిరి. చూడగా (మిమ్ము) గురుపరంపరలో జేర్చుకొనవలెనని తోచినది. మీరు నిబిడకార్య నిమగ్నులరు. ఎపుడో దినమున నొక శుభక్షణము నాకై వినియోగించిన నా కారోగ్యము మఱల జేకూరగలదని నమ్మకము కలుగుచున్నది. దూరమున నున్న లోపము తోపలేదు. మహోదాత్తమైన మీ మనోబల తరంగ మాలిక ప్రాపున 100 మైళ్ళ దూర మొక లెక్కకు వచ్చునది కాదు. పరమాద్భుతము, ఎన్ని నిగూఢ విషయములు! ఎన్ని పోలికలు! ఎంతటి ప్రతిభా పరిణతి! మా దొడ్డతల్లి యవి యన్నియు నుత్సాహముతో జెప్పుచుండినపుడు బ్రహ్మతేజః పరిపూర్ణమైన మీ జాగ్రన్మంగళ విగ్రహము నాకు సాక్షాత్కారమైనట్లు తోచినది. మీ ప్రేమ వాత్సల్యములకు ముందుగ 'నవ్యాజ' శబ్దమున కన్న దృఢతరమైనది మఱియొండు సృజింపనేరని నా భాషా పరిణతి యే పాటిది?.... సౌ॥ తల్లి కామేశ్వరి నావెంట పూజ్యులగు మీకును మాతృశ్రీ గారికిని నమస్కారములర్పించు చున్నది. సమీక్ష రాత్రి మాతల్లి చదివినది. అందు మీ మహానుభవత్వ మెల్ల యెడల గోచరమై తాండవించినది ఎల్లప్పుడు మిమ్ము మరువక స్మరించుచుండు- రాజశేఖర. ప్రొద్దుటూరు" — (28-1-1944).

"శ్రీశ్రీగురుపాదులకు వందనములు. వాత్సల్యపూర్వకమైన మీ లేఖ కనుల కద్దుకొంటిని. తమ యారోగ్యము చక్కగ నున్నందు కెంతయేని సంతోషము మీ అవ్యాజప్రేమ వాత్సల్యముల మఱువక స్మరించుచుందు. మీ గ్రంథములు పారాయణ మొనర్పవలెనని మీ మూర్తి యిట్టిదని స్థూలనేత్రముల దర్శింపవలెనని నాకు గొండంత కోరిక యుండుట ధర్మమే. కాని యది యెన్నడు సఫలమగునో వేచి యుండక నే జేయగలదేమి? నేను దినదినమును ఉ. 8.00 కిని సా. 7 10 కిని అత్యంత నియతితో వ్రతము చేయుచున్నాను. అప్పుడు మన్మనః కల్పితమైన మీ మూర్తి యెదర సాక్షాత్కృతమైయుండును. ఈపని ఈ నెలనుండి జరుపుచున్నాను. దీనిలో విసుగుగాని యిష్టము లేమిగాని లేవు. మీరు చూడచూడ నెక్కుడు మహోపకారులు. లేకున్న నాయెడ నింతటి దయ యేటికి- తిరుపతిలో మిమ్ము సేవించి కప్పగంతుల లక్ష్మణశాస్త్రి నా యొద్దకు వచ్చియుండెను. మీ యుదారహృదయము గూర్చి చాలసేపు ముచ్చటించు కొంటిమి. మాతృశ్రీ గారికి వందనములు. చిరంజీవుల కాశీస్సులు. తప్పక వారములో 2 లేఖలు వ్రాయుచుందును.

ఇట్లు
డి. రాజశేఖర
ప్రొద్దుటూరు 18-3-44



# సప్తపదులు

—బులుసు వెంకటరమణయ్య

[ఆండాళ్ తిరుప్పావై రచనకు పూర్వము శ్రీనివాస్వ గురుని అనువాదమొక పది పాశురములకు మాత్రమే లభింపగా తక్కిన ఇర్వదింటిని ప్రభాకరులు పూరించి "సప్తపదు"లను పేర 1925లో ప్రచురించిరి. దరిమిలా శ్రీనివాసగురుని అనువాదము సంపూర్ణముగా లభ్యమైనది. అదియే తొలుత పూర్ణముగా లభ్యమైయుండెనేని శాస్త్రిగారీ యిరువది పాశురములనైన తెనిగించుటకు పూనుకొని యుండరు. మనకు వారి యనువాద మాధుర్యము నరయను, పండితులకు ప్రభాకర శ్రీనివాస గురుల అనువాద ప్రతిమను తులనాత్మకముగా పరికింపను వలను కల్గియుండెడిదియు కాదు.

ఈ పట్టున సప్తపదులకు శాస్త్రిగారు వెలయించిన పీఠికను, ప్రసంగవశమున బులుసువారు ప్రకటించిన వ్యాసమును పునర్ముద్రించుచున్నాము - సం॥]

---

ద్రావిడ భాషలో శ్రీ గోదాదేవి (అండాళమ్మ) రచించిన 'తిరుప్పావై' అను ముప్పది 'పాశురము' లకు "సప్తపదులు" గేయరూపము తెలుగుసేఁత. మూలములోని ఒక్కొక్క "పాశురము" ఇందు ఏడేసి చరణములు గల పాటఁగా కూర్పఁబడినది. ఇది సుప్రసిద్ధాంధ్ర కవయిత్రియగు ముద్దుపళనిచే రచింపఁబడిన దని ప్రతీతి. అ ప్రతీతి ననుసరిఁచియే మచిలీపట్టణము నందలి 'శృంగార కావ్యగ్రంథ మండలి' వారు పళనికృతమగు 'రాధికా సాంత్వనము'తోఁబాటు దీనిని చేర్చి, శ్రీ వెంపటి నాగభూషణం, ఎం.ఏ. గారి 'రస సమీక్ష' తోఁగూడ ప్రకటించియున్నారు.

'రస సమీక్షకులు' గ్రంథమండలి వారి ముద్రణమున కాధారమును, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలు గారిచే ప్రకటిత పూర్వము నగు గ్రంథమును గూర్చి క్రింది విధమున వ్రాసియున్నారు—

"శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలు గారు- ఈ విషయంలో, తాము చేయగల్గిన సాహాయ్యము...తెలుగు తల్లికి... సాహసించే చేశారు. ఉపలబ్ధములైన- ముద్దుపళని 'సప్తపదుల'లో నెరసులను- పూర్వలేఖక ప్రమాదవశములైన వాటిని- మాతృకతో సరిపోల్చి నవరించి, మిగిలిన ఇరవై పాశురములకున్నూ 'వాక్కులందు భక్తిరసము వాకలూరగా'- తెలుగుసాయించి చక్కని పీఠికతో, 'సప్తపదుల'ను- ఒక 'పుష్కరం క్రింద ప్రచురించారు. శ్రీ శాస్త్రిలవారు .... ముద్దుపళని పద్ధతిని అనుసరించి, 'సప్తపదు'ల మిగతా గ్రంథమును పూరించకుండా, ద్రావిడ గాథలకు వివరణం వ్రాసి ఊరుకున్నా- ప్రమాదమేమీ ఉండేది కాదు.........

అతుకు అతుకుగానే ఉన్నందువల్ల... రసవ్యత్యస్తమునకు ఏమికాని- గ్రంథమునకు, ఛందోరీత్యా ఏకరూప మిచ్చిన శ్రమకు- శ్రీ శాస్త్రిలవారు— వంద్యులు.

ముద్దుపళని- ఒకవేళ- పది 'పాశురము' లకు మాత్రమే తెలుగు గీతములు కూర్చినదేమో అనిపిస్తున్నది. గ్రంథమంతా ఆమె రచించినదని వినికిడి అయినా ఎక్కడా లేనందువల్ల పైగా, మొదటి పదే-

ముప్పది గాథలలోనూ...రసవంతములు. ఆనర్ఘ భోగ ములకే అలవడిన ముద్దుపళని ఆలా చేసి ఉన్న దన దంలోనూ....అనౌచిత్యము ఏమీలేదూ..."

పయి వ్రాతలోని విషయములు కొన్ని సంతృప్తి కరములు కావు [1]. కావున 'సప్తపదు'ల తత్త్వమును ఎఱుంగంగోరి శ్రీ ప్రభాకర శాస్త్రిలు గారితో ఈ విష యముం గూర్చి ప్రస్తావించితిని.

వారు పూరించి ప్రకటించిన 'సప్తపదుల' ప్రతి వారి యెద్దను లేదు; అది 1925 సం॥ న శ్రీ కను పర్తి మార్కండేయ శర్మగారు ప్రచురించుచుండిన 'స్వధర్మ ప్రకాశిని'లో ప్రకటింపబడినది. ప్రత్యేకించి తీయబడిన ప్రతు లత్యల్పసంఖ్యాకములగుటచే అచిర కాలముననే చెల్లిపోయినవి. ఈ యంశమును దెలుపుచు శ్రీ శాస్త్రిలుగారు 'సప్తపదుల' కర్తృత్వ విషయమున తమకును సందేహము కలిగిన దనియు, తాళపత్ర గ్రంథము శిథిలమై యున్నదనియు, శిథిల భాగములను పూరించి, తొలి పది పాటలను సరిచేసిన శ్రీ పంచా గ్నుల దక్షిణామూర్తి శాస్త్రిలుగారు (అప్పటి తాత్కాలికాంధ్ర పండితులు, మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము) సప్తపదులు ముద్దుపళని కృత ములని చెప్పుట ఉచితమని సూచించి రనియు చెప్పి యున్నారు.

ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని వ్రాఁత ప్రతిని పరిశీలింపగా నందు సంస్కర్తలు చేసిన సవ రణలు చాల కానవచ్చినవి. అందలి మొదటి పాటలోని సవరణయే గ్రంథ కర్తృత్వమునే తారుమారు చేసినది. అందలి మొదటి బంతి—

"శ్రీనివాసగురుడువి...చిత్తమును ముద్దుపడి..." అని యున్నది. సంస్కర్తలు 'గురుడు'ను 'గురుల'గా మార్చి, 'డ'ని త్రోసిపుచ్చి, 'చిత్తమును' 'చిత్తము నన'గా మార్చి 'ముద్దుపడి'ని 'ముద్దుపళని'గా సాహ సించి పరిణమింపఁజేసిరి. కాఁగా వారి పాఠము 'శ్రీని వాస గురుల (దలచి) చిత్తమునను ముద్దుపళని' అను రీతిని ఏర్పడినది విషయ మిట్లుండఁగా 'సప్తపదులు ముద్దు పళనికృతములుకా' వనుటకు వేఱు సాధనము లభింపమిచే ఆ వ్యవహారమే తెలుగునాట చెల్లుబడిలో నున్నది; శ్రీ ప్రభాకర శాస్త్రిలుగారును తమ పీఠికలో పయి పద్ధతినే అనుసరింపవలసి వచ్చినది. వ్యవహార ప్రవర్తకులు శ్రీ దక్షిణామూర్తి శాస్త్రిలుగారు. [2]

పరిష్కర్తల దిద్దుబాటు నటుంచి, ఉప లబ్ధ ప్రథ మగేయ చరణమును పరిశీలించినచో, మూలము 'శ్రీని వాస గురుడు విష్ణుచిత్తమునుల ముద్దుపట్టి' అని యూహించుట కవకాశమున్నది. 'టి', 'డి'లు వ్రాఁతలో నొకటేరీతి నుండుట వింతకాదు. 'ట' ద్విత్వాభావము లేఖక ప్రమాద జనితము. ఇట్టి ప్రమా దములు సర్వ సాధారణములు.

పయిరీతిని నిర్ణయించుటకును ప్రమాణాంతరములు కావలసియున్నది. 'సప్తపదుల'ను గూర్చి పెక్కెండ్ల

1. ఈ 'యంశమును రాధికా సాంత్వనము- సప్తపదులు' అనుగ్రంథవిమర్శమున సూచించి యుంటిని. చూ. భారతి, సం. 14 సంచిక.

2. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని 'ఆర్. నెం. 221' అను సంఖ్యగల కాగితపుఁ బ్రతిలోనే ఈ అసమగ్రపు 'సప్తపదులు' 10 పాటలు ఉన్నవి ఆ ప్రతిలో వరుసగ 'గోపాలశతకము, నరసింహ శతకము, సప్తపదులు, (సప్తపదాలు?) రుక్మిణీగోపాల సంవాదము, ఆంధ్ర ప్రకరణము' అనుగ్రంథము లున్నవి. లేఖకుడు 'J. కాశీపతిరావు; ప్రతి గ్రంథము చివర 'తంపేరు ఆయినది; P. దక్షిణామూర్తి శాస్త్రి' ఒక లిఖింపఁబడి యున్నది.

క్రిందట శ్రీ శేషాద్రిరమణ కవులొక వ్యాసమును వ్రాసినట్లు జ్ఞప్తి అని శ్రీప్రభాకరశాస్త్రిలుగారుతెలుపుటచే నేను శ్రీ దూపాటి. వెంకటరమణాచార్యులు గారి కొక జాబు వ్రాసితిని. వారు 'శ్రీనివాస దేశికులు రచించిన 'సప్తపదులు' ముద్రితము లయియున్నవనియు, ప్రస్తుతము ప్రతులు అలభ్యము లనియు తెలుపుచు పరిచయము లేకున్నను నన్ను నమ్మి వారి యొద్దనున్న ఏకైకప్రతిని పంపిరి. శ్రీ పురాణం సూర్యనారాయణ తీర్థులు గారు వాత్సల్యము చూపుచు ప్రతినెరువిచ్చిరి. వీనిసాయమునసే "సప్తపదుల" శ్రీ ప్రభాకరశాస్త్రిలు గారు వెలువఱచిన 'సప్తపదుల ఉన్నరూపు నెఱుకపఱచుటకు వీలు కలిగినది. నా కీయవకాశము గల్గించిన పయి పండితత్రయమునకును ధన్యవాదములు.

శ్రీ వేంకటరమణాచార్యులు గారు పంపిన గ్రంథము పేరు "తిరుప్పావై". దానిని నైజాము రాజ్యములోని 'గార్ల' నగరమున నుండిన "వేంకటేశ్వర గ్రంథ మాల" వారు ప్రకటించిరి. క్రౌను 1/8 సైజున 82 పుటల పరిమితి గలది. దానిని రచించినవారు శ్రీనివాస దేశికులు.

"శ్రీనివాస దేశికులు పాశురముల లోని భావముల జక్కగ నొక్కటియు వీడకుండ నన్పటచ్చట విశేషార్థ సూచకముగ సైత మాంధ్రీకరించిరి. ఆంధ్రీకరణము పద్యములుగను, సప్తపదియను పాటలుగను నున్నది." అంతియ కాక గ్రంథసంపాదకులగు శ్రీ చిలకూరు శ్రీరాములుగారు కూర్చిన టీకతోఁ గూడిన ద్రవిడ పాశురములును (మూలమును) ఇందు జేర్పఁబడినవి. ఆ 'సప్తపదుల' తొలిని—

"శ్రీనివాస గురుడు విష్ణు
చిత్తుకూర్మి ముద్దుపట్టి
పూనిచేయు ద్రవిడపాట
లోని భావమూ,
చెలగి తెలియగాను నాదు
జిహ్వకొనను నిలచి యిటుల
పలికె తిరుప్పావు సప్త
పది పదంబుగా"

అనియును, చివరి పాటలో—

"వావిరిలగ నిటుల శ్రీని
వాసదేశికుండు తిరు
ప్పావుభావ మెల్ల సప్త
పదులు గూర్చిరీ"

అనియు కలదు. కాఁగా గ్రంథము శ్రీనివాస దేశికులు రచించినదే అనుటకు సందేహము లేదు. ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారపుఁ బ్రతియును ఈ విషయమున విరుద్ధము కాదు.

* * *

శ్రీ ప్రభాకరశాస్త్రిలు గారు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని ప్రతియందలి తప్పులను, శైథిల్యములను ఎన్నిటినో సవరించిరి; "విచిత్ర శతావధానీత్యాది బిరుదాంకితులును, అతిలోక సామాన్య ప్రతిభాశాలులును, అఖండ విద్వాంసులు నగు శ్రీ పండిత టి. లక్ష్మణాచార్యులవారి యుపన్యాసముల ననుసరించి వ్రాయఁబడిన "తిరుప్పావై" తెలుగుటీక సాహాయ్యమున మిగిలిన 20 పాశురములను రసవంతములగ ననువదించిరి

శ్రీ వేంకటేశ్వర గ్రంథమాలవారు (గార్ల) ముద్రించిన ప్రతిలోని పాఠములును, ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారపు ప్రతిలోని పాఠములును, చాలవఱకు సరిపోవుచున్నవి. కాని శ్రీ శాస్త్రిలుగా రొనర్చిన సంస్కరణమే మూలాభిప్రాయమున కనువుగనున్నది. మచ్చునకు మూఁడుదాహృతులు—

1. మొదటిపాటలోని 5 వ పాదము-

గ్రంథమాల వారి ప్రతిపాఠము

'న్యాయశాలియైన నంద
నందనుండు శ్రీయశోద
తోయజాక్షి సింహశిశువు
తో సమానుడే?

ప్రాచ్యలిఖిత పుస్తకాలయములోని పాఠము నిట్లే యున్నది.

'న్యాయశాలియైన నంద
నందనుండు తోయజాక్షి
శ్రీయశోద కనిన సింహ
శిశువు గాఁడటే?

అనునది శ్రీశాస్త్రిలుగారి సంస్కరణము. ఇదియే అన్వయమున కనుగుణము. వెనుకటి వనన్వితములు. ఇచట మూలమున-

'యశోదై యిళఞ్జిజ్గమ్"

అని యున్నది. 'యశోదాదేవికి సింహకిశోరము వంటి కుమారుఁడు' అనిదాని తాత్పర్యము. ఈమూలము శ్రీ శాస్త్రిలు గారి సంస్కరణమునకే అనుగుణ మయినది.

2. రెండవపాట 2వ చరణము :

గ్రంథమాలవారి ప్రతి-

'పాలవెల్లిమీద చిల్వ
పాన్పుగొన్న పరుని పాద
మూలములను బాడి నెయ్యి
ముట్టుకుంద మూ.'

వ్రాఁతప్రతి యందును ఇట్లేయున్నది. శ్రీశాస్త్రిలు గారి సంస్కరణము:-

'పాలవెల్లిఁ బాఁపసెజ్జఁ
బండుకొన్న పరునియడుగు
లొలిఁ గొల్చి నేయి, పాలఁ
గ్రోలఁగూడదూ.'

దీని మూలము—

'పాల్కడలుళ్ పైయ త్తుయిన్ఱ
పరమనడి పాడి
నెయ్యుణ్ణోమ్ పాలుణ్ణోమ్'.

'పాలసముద్రము పయి యోగనిద్రఁ గొప్ప పరమ పురుషుని పదములఁ గొల్చి, నేతిని, పాలను ముట్టక యుంద' మని మీఁది మూలమునకు అభిప్రాయము.

3. మూఁడవపాట మూఁడవ చరణము గ్రంథాలయ ప్రతి-

"ప్రేమమీరగాను మనము
నోమునంటి నీరులాడ
క్షేమమలర నెలకు మూఁడు
క్షితిని వానలూ"

ప్రాచ్యలిఖిత పుస్తకాలయ ప్రతిలోని పాఠమునిట్లే యున్నది.

శ్రీ శాస్త్రిలుగారు దీనిని-

"ప్రేమమీఱఁగాను మనము
నోముపట్టి నీళులాడ,
భూమిమీఁదఁ గురియు నెలకు
మూఁడు వానలూ.

అని సంస్కరించిరి.

ఇంటి మూలము—

'నాఙ్గళ్! నమ్బావైక్కు చ్చాత్తి
నీరాడినాళ్,
తీఙ్గిన్ఱి నాడెల్లామ్ తిఙ్గళ్
ముమ్మారిపెయ్దు '

'మనము వ్రత మొనర్చుటకు చేరి స్నానమాడ దేశమున నెలకు మూఁడువానలు కురియు'నని తాత్పర్యము 'వ్రతము పట్టుట'కు 'వ్రతమునంటుట' సరి యగుననువాదము కాదు.

ఇట్టి వింకను చాల కలవు.

పయివిషయములఁబట్టి సంస్కరణపు ప్రాశస్త్యము వెల్లడికాఁగలదు.

శ్రీ శాస్త్రిలుగారు స్వతంత్రించి యొనర్చిన ఇరువది పాశురముల అనువాదమును మూలమున కత్యంతము ననుగుణమయి శ్రీ శ్రీనివాసగురుల యనువాదము కంటె మిన్నయై యున్నది. మచ్చునకు రెండు దాహరణములు—

28వ పాశురము (మూలము)—

'కఱవైకళ్ పిన్ శెన్ఱు
కానమ్ శేర్న్దుణ్బోమ్,

అఱివొన్ఱుమిల్లాద
వాయ్‌క్కుల త్తున్దన్నై
ప్పిఱవి పిఱన్దనై
పుణ్ణియమ్ నాముడై యోమ్
కుఱై వొన్ఱు మిల్లాద
గోవిన్దా వున్దన్నో
డుఱవేల్ నమక్కిఙ్గొ
ళిక్క వొళియాదు
అఱియాద పిళ్లైగళో
మన్బినా లున్దన్నై
చ్చిఱుపే రళైత్తనవుమ్
శీఱియరుళాదే
యిఱైవా నీతారాయ్
పఱై యేలో రెమ్బావాయ్.

ఇది గోపికలు శ్రీకృష్ణుని గూర్చి చేయు ప్రార్థనము.

'ఆవుల వెంట వంటి యడవులఁబడిపోయి జీవించు వారము; వెఱ్ఱిగొల్లల కులమున దేవర పుట్టుటచే ఆ కులమున పుట్టిన భాగ్యమునకు సంతోషించువారము; కొదువ కొంచెమైననులేని గోవిందా నీతో మాకుఁగల సంబంధము త్రెంపఁదలఁచినను తెగునది కాదు. తెలివి లేని ఆఁడుబిడ్డలము. చనవుచే మిమ్ములను కొంచెపు మాటలచే కించపఱచినా మేమో? మా తప్పులను క్షమించి కోపింపక ఓ స్వామీ! నీ సాన్నిధ్యమును దయచేయుము' అని పయి పాశురము యొక్క భావము.

దీనికి శ్రీ శ్రీనివాసగురుల యనువాద మీ క్రింది విధముగ నున్నది.

'పాపఁదగిన పాపముల క్ష
మాపణంబు చేసుకొనుచు
శ్రీపతిని యిటుల ప్రాప్య
సిద్ధికోరగా-
చంచలాక్షులెల్ల తమ య
కించనత్వమెల్ల తెలుపు
కొంచు మించి వాని పలుక
రించి రెలమిని-
కొంచెమైన తెలివిలేని
గొల్లకులమువార మేము
మంచి పుణ్య మనుచు నిన్ను
తించినారము -
మొదవకదుపువెంట నంటి
పొదలనొదలు నడవి చేరి
కుదిరి చెదిరి నడుచుకొంచు
కూడు తిందుము -
కొరతలేని కలిమి గలుగు
గోవింద నీదు పురుడు
ఎరగగూడ దిందు నెంత
వెదకి చూచినా-
ఎరుగనట్టి చిన్నతనము
మరుగుగొన్న ప్రేమ నీదు
బిరుదు కొరత పేరు పెట్టి
పిలిచినామని-
కోపమునకు నోపదగిన
రూపు లేదు వినుము గొప్ప
ప్రాపకంబు నీవు మాకు
ప్రాప్య మొసగవే—

ఇందు మొదటి రెండు చరణముల భావము మూలమున లేదు. శ్రీ శాస్త్రిలుగారి అనువాదము.

'గోవుల వెంబడిఁబడి పెనుఁ
గోనలందుఁ గానలందు
దేవుళ్ళాడెదు గోప
స్త్రీలము దేవా!
దేవర మా కులమునందు
నా విర్భావముఁ గాంచుట
చే వన్నెయు, వాసియు వ
చ్చినది మాకునూ.
దేవరతోఁ గలసి మెలసి
తిరగఁగల్గె నొకకుల మని

తెలుపఁగల్గె మా భాగ్యము
తలఁపఁదరమఁటే!
గోవిందా! యెప్పుడు నే
కొఱఁతలేని మహనీయా!
దేవరతోఁ జెలిమి మాకు
స్థిరము గావలెన్-
వేర్పాటికక్కడ మాకు నొ
నర్పకుమా! వెఱ్ఱి గొల్ల
వెలఁదుల మిట నిన్ను పిడి
వెడలఁజాలమూ.
తెలిసీ తెలియని మాటలఁ
బిలిచితిమో, కలఁచితిమో
జలజాక్షా! మా తప్పులు
క్షమియింపఁగదే!
కరుణింపుము పరమపదము
కనికరింపుమో స్వామీ!
శరణము లే దన్యము నీ
చరణముదక్కన్.

29వ పాశురము (మూలము)—
'శిత్తమ్ శిఱుకాలే వన్దున్నై
చ్చేవి, త్తున్
పొత్తామరై యడియే
పోత్తుమ్ పొరుళ్ కేళాయ్.
పెత్తమ్ మేయ్త్తుణ్ణుమ్
కులత్తిల్పిఱన్ద, నీ
కుత్తేవలెజ్గళై క్కొళ్ళా
మఱ్పోగాదు
ఇత్తైప్పఱై కొళ్వానన్ఱు
గాణ్ గోవిందా
ఎత్తైక్కు మేత్తుపిఱవిక్కు
మున్దన్నో
డుత్తో మేయా వోమునక్కే
నామాట్చెయ్వోమ్.
మత్తైనజ్గామజ్గళ్
మాత్తేలో రెమ్బావాయ్.'

'తెల్ల వాఱకముందే మేమందఱము దేవరను సేవించి, పాదారవిందములను గొలువ కోరికపడు వారము. పశువుల మేపి బ్రతుకు గొల్లకులమందు పుట్టిన నీవు నీ దాస్యమును కోరు మమ్ము అంగీకరింపవలెను. గోవిందా! సర్వకాలములందును ఏడేడు జన్మములకును దేవరవారితో అవినాభావమును పొంది యుండఁగలవారము. దేవరకే మేము దాస్యము చేయఁగలవారము. ఇంత కంటె మాకు వేఱు కోరికలు లేకుండునట్లు చేయుము' అని తాత్పర్యము.

శ్రీ శ్రీనివాసగురుల అనువాదము—
'ప్రాప్యమనుచు జనులు కామ
రూప్యమనుచు సర్వదేవ
గోప్యమైన ప్రాప్యము మది
గోరుకొనుచును-
రుచిరరుచిరమైన దాని
ప్రచురిలంగ జేయుటయును
విచికిలాంగు లెల్ల త్వరగ
విశదపరచిరి-
పొద్దు పొద్దు మేము లేచి
పొలుసు నీదు పదము కనుల
నద్ది నీదునుతుల బాడి
యరసివినవలెన్-
పొట్ట నింద పసుల కసవు
పొసగ మేపిగాని కూడు
ముట్టనట్టి కులమునందు
బుట్టిమమ్ములన్-
బట్టి నీకు వలసినట్టి
గుట్టుపనుల నెల్ల చుట్ట
బెట్టుకొనుము పరగ నాన
బెట్టలేదులే;-
ఎన్ని జన్మములకునైన
నిన్నె తలపవలయు కృష్ణ
చెన్ను మీర నీకె పనులు
చేయుచుందుము.

వేరెమేము గోరు కోర్కె
వేరు చేసి నీదు మనసు
దీర మముల నెల్ల నీవె
దిద్దుకోవలెన్-'

ఇందు మొదటి రెండు చరణముల భావమును మూలమున లేదు. శ్రీ శాస్త్రిలుగారి తెనిఁగింపు—

'తెలతెలవాఱకముందే
చెలియల మెల్లరము వచ్చి
దేవర పదకమలయుగము
సేవ చేయఁగాఁ-
గోరిక యిది చిత్తగింపఁ
గోరెదమో కమలాక్షా!
కూడదు కాదనఁదగదో
గోపవల్లభా!
దాస భావమునను వచ్చి
రీ సతు లో సర్వేశ్వర!
ఆసాసలఁ బఱతు రంచు
నరయఁబోకుమా.
వీడక యీ కాలచక్ర
మాడుచుండుదాఁక నేఁడు
నేడు జన్మములకు నిన్ను
వీడఁజాలమూ.
అవినాభావమున నన
న్యార్హలమై యుండెదమో
యఖిలేశా! యనుమతింపు
మనునయింపుమా.
దాసవృత్తి నెఱపుదు నీ
తో సంతోషమున నుందు
మీ సంపద మాకు నెప్పు
డెనఁగఁజేయుమా!
చింత లింతకంటె వేఱె
చేరకుండఁ జేసి మమ్ముఁ
జేరఁదీసి యేలుకొమ్మ
శ్రీమనోహరా!'

పయి రెండిటి యందును శ్రీ శాస్త్రిలు గారి యను వాదమే మిన్న యని మూలానువాదముల తత్త్వము నెఱిఁగినవారి కెఱుకపడక పోదు. ఈ విశేషము లించుమించుగ ప్రతి పాటయందును గాననగును.

కావున గ్రంథమాలవారు ప్రకటించిన 'తిరుప్పావై కి' విజ్ఞప్తిని కూర్చిన శ్రీ చిలుకూరు శ్రీ రాములు గారు "కేవల వైష్ణవ సంబంధము లేని శాస్త్రిగారి యాంధ్రీకరణము కన్న గురు పరంపరయం దొకరై వైష్ణవులకు తలమానికమువంటి శ్రీనివాస దేశికుల పద్యములు (పాటలని వారి భావమేమో) సమంజస ములుగను, సముచిత భావభరితములుగ నుండునని తలంచుట సరికాదని చెప్పవలసి వచ్చుచున్నది.

భాషాంతరీకరణపాటవము ప్రతిభా ధీనము; కాని ప్రత్యేకమతాధీనము కాదు. 'తిరుప్పావై'ని సరసముగ నాంధ్రీకరించుటకు 'వైష్ణవ సంబంధ' మక్కఱలేదు. 'గురుపరంపరయం దొకరై' యుండుటయు నావశ్య కము కాదు.

o o o

శృంగార కావ్య గ్రంథ మండలివారు పళని రచించిన రాధికాసాంత్వనముతోఁజేర్చి ప్రకటించిన 'సప్త పదుల'కు పీఠిక రచించిన శ్రీ వెంపటి నాగభూషణం గారు శ్రీ ప్రభాకర శాస్త్రిలుగారి కవిత్వమును విమ ర్శించుచు 'శ్రీ శాస్త్రిలుగారు—...మిగతా గ్రంథం పూరించకుండా ద్రావిడగాథలకి వివరణం వ్రాసి ఊరుకున్న — ప్రమాదమేమీ ఉండేది కాదు' అని వ్రాయుట సరికాదు. శ్రీ శాస్త్రిలుగారు శేష రూప మున నైనను 'సప్తపదు'లను రచింపఁబట్టియే సరస మును మూలానుసారియు నగు ననువాదము తిరు ప్పావునకు కొంతవఱకయినను లభించినది!

శ్రీనాగభూషణంగారు 'అతుకు అతుకుగానే ఉన్నం దువల్ల...రసవ్యత్యస్తమునకు(?)ఏమీ కాని—గ్రంథ మునకు ఛందోరీత్యా—ఏకరూపమిచ్చిన శ్రమకు— శ్రీ శాస్త్రిలవారు వంద్యులు' అని వ్రాయుట ఉచితము

కాదు. 'స ప్తపదులు' కేవలము శృంగార గ్రంథమని తలఁచి శ్రీ నాగభూషణంగారు 'శాస్త్రిలుగారు రస మును భ క్తిగ వ్యత్య స్తము చేసినట్లు' అభిప్రాయపడి నారని తెలియుచున్నది. ఇది కేవలము శృంగార గ్రంథమను తలంపుతోనే గ్రంథ మండలివారును రాధికా స్వాంత్వనముతోఁబాటు ముద్రింప దొరఁకొని యుండవలెను. ఇందు భ క్తి ప్రధానము; ప్రాప్యము భగవత్సాన్నిధ్యము. భ క్తి శృంగారములు రెండిటికిని రతియే స్థాయి యగుటచే భక్తురాండ్రకు భగవంతుని యెడఁగల 'రతి' శృంగారమని విమర్శకులు తలఁచిన తలఁచియుండవచ్చును. దేవ గుర్వాది విషయకరతి 'భావ' మగును. అదే 'భ క్తి' కాన శ్రీ శాస్త్రిలుగా రేమియు వ్యత్య స్తము చేయలేదని తెలియవలెను. శ్రీ శాస్త్రిలుగారి రచన 'ఛందోరీత్యా' మాత్రమే కాక 'భావరీత్యా' కూడ అన్ని విధముల అనువాద మునకు మెఱుఁగు పెట్టి మేలనిపించుచున్నదని సహృదయు లెఱుఁగక పోరు.

శ్రీ నాగభూషణం గారు అంతటితో తృ ప్తిపడక 'పళని పది పాశురములకు మాత్రమే తెలుగుగీతలు కూర్చినదేమో అనిపిస్తూన్నది.... మొదటి పదీ ముప్పది గాథలలోనూ రసజీవములు. అనర్ఘ భోగములకే అల వడిన ముద్దుపళని అలా చేసి ఉన్న దనడంలోనూ అనౌచిత్యము ఏమీలేదూ' అని కేవలము ఊహలపయి ఆధారపడి సిద్ధాంతీకరింపసాగిరి. కాని యీ వ్యాస మునఁ జర్చింపఁబడిన విషయములఁబట్టియు, తొలి పాటలకన్న వెనుకటిపాటలే భ క్త్యనుగుణము లగుటం జేసి ప్రధానములని చెప్ప వీలగుటంబట్టియు, వారి యూహలు నిరాధారములని స్పష్టపడకపోదు.

—భారతి- మార్చి 1938

—o—

# తిరుప్పావై - సప్తపదులు

## పీఠిక

—వేటూరి ప్రభాకరశాస్త్రి

ద్రవిడ వైష్ణవులు వేదకల్పముగా నధ్యయనము చేయు నాలాయిర (చతుస్సహస్రి) మను ద్రావిడ భాషాప్రబంధమునందు ప్రథమసహస్రిలో నీ "తిరుప్పావై" యను ముప్పది పాశురముల గ్రంథ మున్నది. అది ద్రవిడ దేశమందేకాక యాంధ్రదేశ మందునుగూడ వైష్ణవులకు వాచోవిధేయమైయుండును. అనుదినమును గీతోపనిషత్కల్పముగా దీనిని వా రనుసంధానము చేయుచుందురు. అందును ధను (మార్గశీ)ర్మాసమున నతిప్రధానముగాఁ జేయుదురు. విష్ణ్వాలయములందునుగూడ ధనుర్మాసమున దినమున కొకపాశురము (సీసపద్యమువంటి పద్యము) చొప్పున ముప్పది దినములు ముప్పది పాశురములను దెలతెల వారకముందే యనుసంధించి స్వామి యారాధనము గావింతురు. చక్కెరపొంగళ్ళు, దధ్యోదనములు నారగింపులు పెట్టుదురు. పెరియాళ్వారని పేరొందిన విష్ణుచిత్తుల పుత్రియగు నాఁడాళ్ (గోదా) దేవి ఈ కృతికిఁ గర్త్రి. ఈమెచరిత్రము ప్రఖ్యాతాంధ్ర ప్రబంధమగు నాముక్తమాల్యదలోఁ గొంత చూడఁ దగును ఆమె శ్రీరంగనాథస్వామినే వివాహమాడినదట భగవద్గుణానుభవానందపరవశయై యామె తనభర్త శ్రీరంగనాథస్వామియే యని వినోదించుచు లౌకికరీతిచే నవివాహితగానే యాయుష్కాలము గడపి యుండ వచ్చును.

### గ్రంథార్థము

ఈ గ్రంథమునకు ద్రవిడభాషలోఁ బెక్కు వ్యాఖ్యా నము లున్నవి. ''పెరియావాచ్చాం బిళ్ళై'' యను వ్యాఖ్యాత యిట్లు చెప్పినాడు. "సర్వేశ్వరుడు లోకము నుద్ధరించుటకై గోకులమున శ్రీకృష్ణుఁడై యవతరించి పంచలక్ష కుటుంబముల నున్న గోపస్త్రీలను సౌందర్య గుణకర్మములచేత వశపరచుకొని ప్రాప్త యౌవనుఁడై యానందమునఁ దేలుచుండెను. ఆట్లు యౌవన విలాస ముల నందుచున్న యువతులను శ్రీకృష్ణునిఁజూచి గోపవృద్ధు లందరును గూడి "ధూర్తుండగు శ్రీకృష్ణుని కడకు పోఁగూడ"దని ప్రతిషేధించి స్త్రీలనిండ్ల నడంచి పెట్టిరి. వారి కృత్యమువల్ల వర్షములేదయ్యెను. అప్పుడు "గోధనులగు గోపకు లీయెద్దడికిఁ దాళఁజాలక వర్షార్థమై వ్రత మాచరింపను మనల నియోగింతురు. శ్రీకృష్ణుఁడు ఘటకుండు కాఁగలఁ'డని గోపకాంతలు సంతసించిరి, అపాయము తప్పుటకై గోపవృద్ధులట్లే శ్రీకృష్ణుని ఘటకునిఁగాఁ గోరిరి. గోపవృద్ధులు వెడలి పోయిన తర్వాత శ్రీకృష్ణుఁడు గోపికలచే నారాధితుడై "యిండ్లకుఁబోయి ఈరాత్రి నిద్రించి వేగుజామున వచ్చి నన్ను నిద్రలేపవలసిన'దని వారి ననిపెను. శ్రీకృష్ణుఁడు నా విరహము నోర్వఁజాలక నీలాదేవి సౌధమున కరిగెను. ఆ స్త్రీలును పరస్పర సంశ్లేష ముతో నిండ్లకేఁగి యట నిదురపట్టకపోఁగా శ్రీకృష్ణుని స్మరించుచు మిగిలిన గోపికలఁగూడ నిదుర లేపుకొని వచ్చిరి. శ్రీకృష్ణుని దర్శించిరి.........."ఇత్యాదిగా.

శ్రీ భాగవతము దశమస్కంధమున హేమంత ఋతువులో గోపికలు కాత్యాయనీవ్రతమును చేయఁబూని నట్టును, తొలినాఁడు వారు నదీస్నానమునకుఁబోయి వలువలు దరి నుంచి నీరాడుచుండఁగా శ్రీకృష్ణుఁడు వానిని హరించినట్టును గోపికావస్త్రాపహరణ కథా ఘట్టమునఁ జెప్పఁ బడిననో మాకాత్యాయనీవ్రతము కావచ్చును. తిరుప్పావై పాశురములలో మకుటముగాఁ గానవచ్చు "ఏలో రెంబావాయ్" అనుపదము బొమ్మ రూపునున్న స్త్రీదేవతను జెప్పుచున్నదట! వైష్ణవులకు శ్రీకృష్ణైకశరణ్యత బలసిన తర్వాత కాత్యాయనీ

వ్రత ప్రస్తావము జారవిడువఁబడి యుండవచ్చును. కావుననే 'పెరియువాచ్చాంబిళ్ళై' ప్రభృతులు దాని బేర్కొనరయిరి. వైష్ణవులకు వేదకల్పమగు నాలాయిరమున 'తిరుప్పావై' యున్నట్టు ద్రవిడదేశమున శైవులకును వేదకల్పమగు తిరువాచకమున (మాణిక్యవాచకర్ రచించినది) తిరువెంబావై యని యొక లఘుగ్రంథ మున్నది. వారును బరమశివునిఁ బడయుటకై ధనుర్మాసమున వేకువజాముననే నిద్రలేచి దాని ననుసంధానము చేయుదురట! "మార్గళి నీరాడేలో రెంబావాయ్" అని యందున్నది. ఇది తిరుప్పావైలో గూడ నున్నది రెండు గ్రంథములందును విషయ సామ్య మున్నది. కావున నీవ్రతము శైవ వైష్ణవ విభేదములు సాగక పూర్వముననుండియు నాచారముగా ధనుర్మాసమున ననుష్ఠింపఁబడు వ్రతముగాఁ దలఁపఁదగిన దగుచున్నది. దక్షిణభారత దేశమందెల్ల నీవ్రతము కొన్నిమార్పులతో నిప్పటికిని గలదని నే ననుకొనుచున్నాను. ధనుర్మాసమునఁ దెలుఁగు దేశమున బాలికలు, తెల్లవారుజాముననే నిద్రలేచి గొబ్బెమ్మలను పేర గోమయముతో బొమ్మలు (ముద్దలు)గాఁ జేసి ముంగిళ్ళ ముగ్గులతోఁ బెట్టి పూలతో నలంకరించి పూజింతురు

సుబ్బిగొబ్బెమ్మా సుఖములియ్యావే
తామరపూవంటి తమ్ముణ్ణియ్యావే
చేమంతి పూవంటి చెల్లెల్నియ్యావే

ఇత్యాదిగాఁ బాటపాడుచుఁ బ్రార్థింతురు. ఇట్టి ప్రార్థనము తిరుపావైలోనుఁ గొంతగలదు దక్షిణభారతమం దంతటను సామాన్యమయిన యొకవ్రతము ననుసరించి ద్రావిడ వైష్ణవులు విష్ణు సంప్రార్థ నార్థకమగు *తిరుప్పావైని*; ద్రావిడశైవులు శివ సంప్రార్థ నార్థకమగు *తిరువెంబావైని* గ్రహించుకొనియుందురు. 'గొబ్బెమ్మ' పదము, గోపెమ్మ పదభవము. ఆరవమున 'గొబ్బియళో' "గోపిగళ్" పదభవము.

## తెలుఁగుచేఁత

మద్రాసు ఓరియింటల్ లైబ్రరిలోనున్న సప్తపదులు పదింటినిగొని నేను కడమ యిర్వదింటిని మూలముఁజూచి పూర్తిచేసితిని. తొలి పదిపాటలకు గర్త శ్రీనివాసగురుఁడు. కడమ యిర్వది నేను రచించినవి. [*శ్రీ కె. వెంకటస్వామి నాయుఁడుగారు (దేవస్థానం కమిటీ ప్రసిడెంట్)* పూర్వమెప్పుడో నేను ప్రకటించిన యీ సప్తపదు లొక్క ప్రతియే యుండఁగా జూచి యిట్లు వారై పునర్ముద్రణము గావింపించిరి. ఇందు వారిశక్తి ప్రవత్తులు వందనీయములు].

[1950 సం॥లో శ్రీప్రభాకరులు తిరుప్పావై - సప్తపదుల అనువాదమును రెండవ కూర్పుగా పునర్ముద్రించిన తి. తి దేవస్థానమువారి సౌజన్యము నీ పట్టున స్మరించుచున్నాము-సం॥]

—o—

# తిరుప్పావై - సప్తపదులు

## — శ్రీనివాస గురుడు (1-10)

**1**

*మార్గళి...

శ్రీనివాస గురుఁడు విష్ణు చిత్తమునుల ముద్దుపట్టి
పూనిచేయు ద్రవిడపాట లోని భావమూ
చెలఁగి తెలియ వాణి తనదు
జిహ్వకొనను నిలిచి యిటులు
పలికెఁ దిరుప్పావు సప్తపది పదంబుగా
మాసములకు నెల్ల మంచి మార్గశిరము పౌర్ణమాసి
యాస గలిగినట్టి చెలులు డాసిరారే
మంచి నగల మించి కులము నెంచి యవతరించినట్టి
చంచలాక్షు లెల్లఁగూడఁ జనఁగరారే
న్యాయశాలియైన నంద నందనుండు తోయజాక్షి
శ్రీయశోద కనిన సింహ- శిశువుగాఁడటే
నల్లనీటి మబ్బు చాయఁ జెల్లు- మేనివాఁడు రక్త
పుల్లపద్మ నయనుఁడై న- పురుషవర్యుఁడే!
కీరవాణులార! హరిని గోరి- చేరి తేరి సకల
పూరుషార్థములను- దృప్తి పొందరారే!

**2**

వైయత్తువాళ...

వారిజాక్షులార! నంద వ్రజనివాసులార! మనము
కోరునోము క్రియలు వినుఁడి కూరి మలరనూ
తెల్లవారకుండ నీటఁ జల్లులాడి మనము పెద్ద
లెల్లఁజేయ నట్టిపనుల నొల్లఁగూడదూ
పాలవెల్లిఁ బాఁప సెజ్జఁ బండుకొన్న పరునియడుగు
లోలిఁగొల్చి నేయిపాలు క్రోలఁగూడదూ
కనులఁ గొనలుదీర నునుపు కాటు కుంచరాదు విరుల
ననలఁ దురుమరాదు కురుల ననువుమీఱగా
వికచకమలనేత్రునెదుట నొకరి కొకరుపల్కు పలుకు
ప్రకట మొప్పఁగాను బలుకఁ బదఁగఁ గూడదూ
బాగమీర మనకుఁ దెలుపఁబడినతీరు జనులకెల్ల
వేగతెలిపి బ్రదుకుతీరు వెదకిముదమునా
సారెసారె విభుని మనము సన్నుతించి సంతసించి
వారిజారిముఖుల మెల్ల వ్రతముచేతమూ.

## — వేటూరి ప్రభాకరశాస్త్రి (11-30)

**3**

*ఓఙ్గి యులగళన్ద...

నోము నోఁచువారు నోఁచు నోముతీరు తెలిపె గోప
కామినులకు విష్ణుచిత్త కన్యకామణి
వడుగచిన్ని పెండ్లికొడుకు
పొదవుఁదొడరి పుడమిని మూఁ
డడుగు లడుగువానిపేరు నుడువు కొనుచునూ
ప్రేమమీరఁగాను మనము నోమువట్టి నీళులాడ
భూమిమీఁదఁ గురియు నెలకు మూఁడువానలూ
పెరుగునీటి వరులనడుమఁ దిరుగుమీలు దూటఁగాన
కరుల తెరలుపొరలు గదలి కలువ లూఁగఁగా
నెమ్మిమీఱఁ దేనెఁద్రావి సొమ్మసిల్లి నట్టియాఁడుఁ
దుమ్మెదలును రేగి మగల దూఱి పలుకఁగా
చెలఁగి పిదుకఁగలుగువారు చెయ్యివేసి తియ్యఁగాను
నిలువు కడవలెల్లఁ బాల విండి పొరలఁగా
కుదురుకొదమ మొదవుగుంపు పదులునూర్లు పెరుగనం
పదలఁ బొదలి గొల్లపల్లె బాగుమీఱునూ.

**4**

ఆళిమళక్కణ్ణా!...

గోపవృద్ధు లెల్లఁగోరు కోర్కెఁ గురియువర్షదేవు
నేపుఁజూచి చేయు క్రియలరూపుఁ దెలిపిరీ!
ఓ గభీరభావ! మేఘ! ఓ గుణాఢ్య! దానధుర్య!
బాగుగ నీచేయవలయు పనులు వింటివా?
జలధికేఁగి నడిమిజలము కొలఁదిమీఱఁ ద్రావి యుఱిమి
వెలయఁ గలయ మిన్ను ముట్టి యలముకోఁగదే
జలధిశాయి మేనిడాలు గలుగునట్టి మేనుదాల్చి
చక్రకాంతిసరణి దెలియఁజక్కె మెఱయుమా
పాంచజన్యమనెడు సంకు పగిది మ్రోసి శార్ఙమట్లు
మించి యంబు లొక్కె మొగిని నించి కురియుమా
నోమునోమ మేము మేని గాము దీఱ జేపకడను
క్షేమ మలర నీటనాడి చెలఁగియుందుమూ
నందసుతునిఁగూడి గోప సుందరాంగులెల్ల ముదము
చెందుకొరకుఁ గురిసె మేఘుఁ డందు నెందునూ.

### 5

మాయనై మన్ను...

కోమలాంగులార! మనసు కోర్కు లెల్లఁదీర మనము
నోము నోఁచగాను వాన భూమిఁ గురిసెనూ
అనిన నొక్క చెలియ పలుకు నతివలార! మాయవాని
ఘనుని నుత్తరంపు మధురఁ గాచువానినీ!
గొల్లపిల్లలందుఁ గలసి జల్లులాడి కొల్లలాడి
యుల్లసిల్ల యమున చెంత నున్నవానినీ
యదుకులప్రదీప మనఁగ నుదయమంది కన్నతల్లి
యుదరశోక మెల్లఁబాపి యొప్పినాతనీ
కాంతలార! మనము శ్రీకాంతుఁగూడి చెంత వాని
వింత నోటి నిండఁబాడి వినుతిచేసినా
చేతులున్న ఫలము పూజసేయ శుద్ధభావములను
ఖ్యాతి మీఱ వానితోడఁగలయఁ గల్గినా
తొంటిపాపజాల మెల్ల మంటఁబడిన దూదివోలె
నంటు లేక చెడును నోము పంటపండునూ.

### 6

పుళ్ళుమ్....

ముందు లేచినట్టిసకల సుందరాంగు లొక్కముగ్ధ
మంౘదయాన నిటుల నిదుర మలుపవచ్చిరీ
పక్షిజాల మెల్ల దెసల వీక్షణములు గొలిపి వేగ
కుక్షులకయి కూఁతలిడుచు గూళ్ళు వదలెను
పంకజాక్షుసేవ జ్ఞప్తి పఱుచుకొఱకుఁ దెలుపు తెల్ల
సంకుపిలుపు నీదుకర్ణ సరణిఁ జొరదటే!
బాల లేచిరావె నందబాలుఁడు దాఁ బూతనచనుఁ
బాలుద్రావి దాని యముని పాలు చేసెనూ
రక్కసుండు బండిరూపు నుక్కుమిగిలి రాఁగ సంధు
లొక్క మొగిని వ్రక్కలుగాఁ ద్రొక్కెముదమునా
మునులు యోగిజనులు నీట మునిఁగి వేడ్క హరిహరీ
యనెడునాద మినుమడించె వినఁగరాదటే!
మెల్లమెల్ల నుల్లమల్లఁ బల్లవించి చెల్లె సంత
సిల్లి లేచినార మిటుల మళ్లి లేఁగదే!

### 7

కీశుకీశెన్ను...

విరివిమీఱ హరినిగలయ నెఱిఁగి మఱచికను మొగుడ్చు
సరసిజాక్షి నిదురలేప సఖులు వచ్చిరీ
కుటిలనీలకుంత లొకతె చటులసూక్తిపటిమఁ బల్కు
నటన దెలియకుండ నొక్కనాతి పలికెనూ
కీచుకీచు మనుచుఁ బక్షు లేచి లేచి కూయుచుండె
లేచిరావె పెరుగుతరువఁ దోచె మిన్నునా
గల్లుగల్లు మనెడినగల కలరవంబు దెల్ల దమ్మి
కనులవానిమీఁది పాటఁ గలసి మ్రోసెనూ
వినఁగఁబడదె వెఱ్ఱిపిల్ల విడిచి నిన్ను వెడలలేక
కనుఁగొనంగ నున్న మమ్ముఁ గనవె నాయికా
హరి దయాభిపరవశుండు పరుఁ డటన్న మొరలు చెవి
దరికి రాఁగ నిదుర చెందఁ దగునె నాయికా
తేజమొప్పఁ గన్నువిప్పి తెప్పరిల్లి లేచి వచ్చి
రాజసమునఁ దలుపుఁదీయ రావె నాయికా.

### 8

కీఙ్ వానమ్...

బాలలెల్ల నందగోపబాలునకును వలపు గొలుపు
లీలగలిగినట్టి సఖిని లేపవచ్చిరీ
ఇదుగొ తూర్పు తెల్లవాఱె నదిగో బఱ్ఱెలెల్ల మెల్లఁ
బొదలె మళ్ళలోని మంచు పూరి మేయనూ
నిన్నులేపకుండ మున్న కన్నెలాత్రితోడ నేఁగ
నున్నమాట విన్నవించి నిన్ను లేపఁగా
వచ్చినార మట్లుగాన మెచ్చి ముదము హెచ్చి యోసి !
మచ్చెకంటి మిన్నలేచి మములఁ గలయవే
మల్లవరులయుల్ల మెల్లఁ బెల్లగిల్ల కొల్లలాడి
వెల్లివిరిసి యుల్లసిల్లు విష్ణుమూర్తినీ
పాడుకొనుచు నేఁగి చిగురు టీడువచ్చునడుగుఁ దమ్మి
జోడుసోఁక మ్రొక్కి సరగ వేఁడుకొంటిమా
ఎంతవింత కాంత లంత కంత కింత కింత యనుచుఁ
జింతచేయ మనలఁ గరుణ చెలఁగి ప్రోచునే.

## 9

తూమణి మాడత్తు...

వాఁడెవచ్చి పిలువ లేచి వత్త మనుచుఁ బండుకొన్న
చేడె నిదుర లేపఁగాను జెలులు వచ్చిరీ
మణివిచిత్రసౌధమందు మంగళార్థమైన దీప
కణికలుల్లసిల్లఁ బొగలు గమ్మ మనఁగనూ
కులుకుతళుకుళయ్య నిద్రఁ గూరినట్టి మేనమామ
కూర్మి బిడ్డ! గడియతలుపు గొలుసు మలువవే
అత్త! పూలగుత్తి నీదు ముత్తయంపు బిడ్డ మెల్ల
నొత్తిగించి నిదురలేప నెత్తరాదటో!
మూఁగచెవుడు గలదొ లేక రాఁగనీక మత్తునిదుర
సాఁగితూఁగి నెవరు మందు చల్లినారలో
మాధవుండు మాయలాఁడు వేధకైన బోధలేని
గాథవాని వెయివిధాల గణనచేతుమూ
అమ్మ! తోడి కొమ్మ లిరుగొ లెమ్మనం గదమ్మముద్దు
గుమ్మ నీదుతళుకుఁగులుకు బొమ్మ నిప్పుడూ!

## 10

నోత్తుచ్చువర్క్కమ్....

నందనందనుఁ డన నానంద మొందువార లొక్క
కుందరదన నిదుర లేపఁ గోరివచ్చిరీ
నోఁచు నోము స్వర్గ మిచ్చు నోచెలీ! యిదేల తల్పు
వైచి పండుకొటి విట్లు వడిగ రాఁగదే
నీటుమీఱఁ బల్క వున్న చోటనుండి మాటి కొక్క
నోటిమాట కైన మేము నోఁచలేదటే
వలసినట్టిచోటఁ గలసి మెలసి సిరుల వెలసి శ్రీ
తులసిదండఁ గురులనిండఁ దుఱుమువాఁడటే
పొంగి మంగళంబు లొసఁగి పొగడినంత మనకు నంత
రంగవాంఛ లిచ్చుపుణ్యరాశి గాఁడటే
ముందు నిదురయందుఁ బేరు నొందినట్టి కుంభకర్ణు
డిందు నోడి నీకు నిద్ర యిచ్చినాఁడటే
తత్తరమ్ము మాని నిద్ర మత్తు వీడి వచ్చి చెల్మి
కత్తెతోడ నిపుడు నీవు పొత్తుగూడవే.

—o—

—వేటూరి ప్రభాకరశాస్త్రి

## 11

కత్తుక్కఅవై క్కణజ్కళ్ ...

మించుఁబోఁడు లెల్లఁ గలిమిమించి చక్కఁదనపుఁబేర్మి
గాంచు చెలి నొకర్తె మేలుకనుప వచ్చిరీ!
కండగలిగి చాలఁబాలఁ బిండునాలతండమున్న
దండిగోపవంశపుంబసిండి తీగవే!
పుట్టవెడలు త్రాచుపడిగ బోలిన జఘనంబు గల్గు
నట్టి మవ్వమైనమేని యందగత్తెవే.
నెమలిపింఛియమ్మువోలె నిమరి మార్దవంబు పొడుగు
నెఱులు గల్గినట్టి మంచి కురులదానవే
చేరినారు నీవు తక్కఁ జెలియ లెల్ల నీగృహ
ద్వారమందు నిద్రలేచి త్వరగ రాఁగదే!
సరసిజాక్షు లెల్ల మబ్బుచాయ మేని వానిమీఁద
తిరుప్పాట పాడుచుండఁ దెలియరాదటే!
మేలుకొన్న గుర్తు తెలుపవేల మాట లాడవేల
శ్రీలుగల్గు నీవు పాలుమాలఁ దగునటే.

## 12

కనైత్తిళ ఙ్క త్తిరుమై...

వెన్నుని చెలికాఁడును సంపన్నుఁడు నగునొకనిచెలియ
లినె న్నలంతలెల్ల నిద్రలేపవచ్చిరీ
కట్టిపెట్టినట్టి దూడకదుపుమీఁది కూర్మి నఱపు
వెట్టిచేఁపువచ్చి చనులు నిట్టవొడువనూ
పాలునేలఁ గార్చునట్టిబఱ్ఱెలెన్నొ గల్గుభాగ్య
శీలుఁడైనవాని కీవు చెలియ లౌదువే!
మంచుగురియఁ దడియలేక మండువాను జొచ్చి నీగృ
హాంచలమునఁ జెలులమెల్లఁ బొంచియుంటిమి.
చేరరావె లంక నేలు చెడుగుఁ జంపినట్టిదిట్ట
దారుకీర్తి రామమూర్తి సన్నుతింతము
రూపగుణాధిక్యముగలయాపృథివీపతి కుమారు
నేపుసన్నుతింపుచుండ నేటినిద్దురే!
చెలియలెల్లఁ గూడి గేలి చేయునట్లు నిద్రపోవ
వలదులేచి రమ్ము తలిరుఁబోఁణిరో!

## 13

పుళ్ళిన్‌వాయ్ కీణ్డానై...

అందగత్తె నాకుఁ గృష్ణుఁ డిందె వచ్చునంచు నిద్రఁ
జెందునొకతె లేపవచ్చి రిందువదనలు
బకుని రావణుని దురాత్ము బారిసమరినట్టి దేవు
ప్రకటసచ్చరిత్ర మిపుడు పాడుచుంటిమీ
పడుచ లెల్ల లేచియల్ల యెడకుఁ జనిరి వేగుఁజుక్క
పొడిచెఁ దూర్పుతెల్లవాఱెఁ బువ్వుఁబోఁడిరో
కూయుచుండెఁ బక్షులెల్ల గుఁరుడు నస్తమించెఁ నిద్రఁ
గూరుచుంటివేల యింకఁ గువలయాక్షిరో!
చల్లనైన తేటనీట నల్లనల్ల మెల్ల డిగ్గి
స్నానమాడఁ దగిన మంచిసమయమిది గదే!
మేలిదినము లివిగదోసి మేలుకొనఁ గదోసి నిద్ర
చాలుఁ జెలుల మిచట నిల్వ జాగుసేయకే
కుటిలవృత్తి వీడి మమ్ముఁ గూడిరమ్మ వేడ్క నమ్మ
కుందుమీఁదఁ బాటపాడు కొందమో చెలీ

## 14

ఉఙ్గళ్ పుళక్కడై...

మేలుకొల్పవత్తు నేనె మిమ్ము నంచుఁ జెప్పి ప్రాలు
మాలుచెలిని లేపపచ్చి రాలతాంగులూ
అల్లవిరిసెఁ జెంగలువలు నల్లకలువ లెల్ల మొగిడె
నల్లదెమీ యింటికొలనియందె కంటిమీ
తెల్లని పల్వరుస కావి దేరువల్వలున్న తపసు
లెల్ల రనుష్ఠానములకు నేఁగుచుండిరే!
ముందుగ దేవళము తలుపులం దెఱవను బీగ మంది
యందుఁ బెద్దతపసి వేగ నరుగుచుండెనే!
మమ్ము ముందు లేపుదునని మాటయిచ్చి కూడ నింత
కిమ్మెయి నిద్రించె దెంత యెమ్మెలాఁడివే!
పంకజాక్షు శంఖచక్ర సంకలితాజానుబాహు
నంకితమిడి పాడ నాలు కాడదో గదే!
మాటయిచ్చి యుంటి విప్పు టోటమించుకైనఁ బూన
ఫేటినాయ మెంత మాయ మాటదానవే!

## 15

ఎల్లే! ఇళఙ్గిళియే!...

ఓసి! ఓసి! ముద్దుఁబలుకు లొలుకుచిలుకకూన నిద్ర
బాసిరావదేమె? యేలె ప్రొలుమాలెదూ?
ఓసి! ఓసి! యనుచు బిగ్గ గూసి నన్ను మంచిని
ద్రాసుఖమున నున్నదానిఁ దడవకుందురే?
అమ్మ! నీవు మీఱిపోతి వౌనె- నేనుగాదు మీరె
మీఱిపోతి రిపుడు మిమ్ముఁ జేరుకుందునూ
ఎంచ నింక నన్యకార్య మేమినీకు? లేచిరావె
మ చిది మీ రెల్ల రరుగుదెంచినారటే
వచ్చినార మెల్లరమును మచ్చెకంటి నమ్మవేని
వచ్చిలెక్క పెట్టుకొనుము వరుస నందఱిన్
ముదముమీఱ మదపుటేన్గు నుదుటుమాన్పినట్టి వాని
బదింబదిగ నెల్లరమును బాడుకొందమూ
కంసుఁడు మొదలయినరిపుల హింసించినవాని మనము
కలసిమెలసి కొలుత మింకఁ గదలి రాఁగదే.

## 16

నాయగ నాయ్ నిన్ఱ...

గోపవల్లభుండు నందగోపరాజు సౌధమునకుఁ
గాఁపువాఁడ మేము లోని కరుగవలయునూ
పడగలు తోరణము లున్న ద్వారము కాపాడువాఁడ!
వడిగా రత్నాలతలుపు గడియ తెఱవుమా
కల్లకపట మెఱుఁగమేము గొల్లపిల్లలము గదోయి
నల్లనితిరుమేనివాని నరయ వస్తిమీ!
మాయలాఁ డతండు మాకు మాటయిచ్చినాఁడు 'మీకు
మంచివాద్య మొకటి యిత్తు' నంచు నిన్ననూ!
చిత్తశుద్ధి నెల్లరమును మొత్తముగాఁ గూడి లోని
కిత్తఱిజని వేడుక నాయుత్తమోత్తమున్
మేలుకొల్పుపాట లల్ల మెల్లమెల్లఁ బాడి నిద్ర
మెలఁకువగొనఁ జేయుకొఱకు మేము పోవలెన్
తొలిఁదొలి నోయన్న! నీవు వలవ దనుచు నడ్డుఁజెప్ప
వలదు వేగ మూసియున్న తలుపు దెఱవుమా.

## 17

అమ్బరమే తణ్ణీరే...

లలితగతిని లోని కరిగి చెలియలెల్లఁ జెలఁగిమెల్ల
మెలగ నందగోపముఖుల మేలుకొలిపిరీ
అన్నవస్త్రముల నొసంగి యాదరించు ధర్మచింత
సన్నుతిగను నందగోపస్వామి మేలుకో!
పుట్టినిల్లు మెట్టినిల్లు పుణ్యమున వెలుంగఁజేసి
నట్టికొమ్మవమ్మ యశోదమ్మ మేలుకో!
సర్వలోకములను మించి నిర్వాణము గాంచి సర్వ
గీర్వాణుల నేలుదేవ! కృష్ణ! మేలుకో!
పాదమందుఁ బొడవుదొట్టి పసిఁడి పెండెరమ్ము వెట్టి
ప్రబలకీర్తి గాంచిన బలభద్ర! మేలుకో!
మేలుకొనుము నందదేవ! మేలుకొను యశోదదేవి
మేలుకొనుఁడు మేలుకొనుఁడు మీర లిర్వురున్
మేలుకొందు మేము కామపాల! మేలుకొమ్ము గో
పాల! మేలుకొమ్ము భక్తపాల మేలుకో.

## 18

ఉన్దు మదగళిత్తన్...

కరిబలమ్ము నుఱుమఁజాలు ఘనబలమ్ము గలుగువాని
కరిబలమ్ము మాల్చు శక్తు లలరువానికీ
నందగోపదేవునకు నమందముదము వెంచుసుగుణ
బృందముగల కోడలవును సుందరాంగివీ
పొంది వలచు కమ్మపూవులం దుఱుమునఁదుఱిమినిద్ర
చెందుచుంటి వమ్మ లెమ్మ మందగమనరో!
తీయవమ్మ తల్పు కోళ్ళు కూయుచున్న వింకఁజేయి-
దోయిఁ బూల చెండ్లుదాల్చి తొంగియుంటివీ!
దళితమాధవీలతా వితానమందు నిద్రచెందు
చిలుకలు గోర్వంక లెగిచి పలుకుచున్నవీ!
నీమనోభిరాముఁడు మహనీయ కీర్తి కృష్ణమూర్తి
నామకీర్తనమ్ము మే మొనర్చుచుంటిమీ
కంకణ నిక్వణము తాళగతి ఘటింపనెఱ్ఱఁదమ్మి
కరణి నొప్పు కేలఁ దల్పుగడియ తెఱవుమా!

## 19

కుత్తు విళక్కెరియ...

నలుప్రక్కల రత్నదీపములు వెలుంగ నేన్గుదంత
ములవెలగల పట్టెమంచమునను హాయిగా
నున్నుమీఱు నంచగఱుల పాన్పుమీఁద నెక్కి కురులఁ
దన్నువెలయ విరులఁదాల్చి తనరునువిదతో
నీలతోడఁ గుచయుగమునఁ గేలుసేర్చి నిద్రచెందు
లీలావిగ్రహ బదు ల్బలికిన దోసమా
నిమిషమయిన మోహనాంగునిన్ నప్పిన్నప్పిరాట్టి
నీవు విడిచి నిలువరింప నేరవోగదే!
కాటుకకళ లొలుకు వెడఁద కన్నుదోయి బెళుకుఁజూపు
వీటున నాఁకట్టిచెంత నిలుపుకొందువో!
లెదుర లేపకుండునటులు నిర్బంధించితి గదమ్మ
నిబ్బరంపుఁ గౌగిలింపు నెఱతనంబునా
జగన్మోహనాంగు దివ్యసందర్శన మాసపడెడు
సకియలదయఁజూడుమ! నాయకుని వీడుమా!

## 20

ముప్పత్తు మూవర్....

ముందునిల్చి ముప్పదియును మూఁడుగోట్ల దేవతలకు
ముప్పదీర్చు శౌర్యధైర్యమూర్తి మేలుకో
ఆశ్రయించి నట్టివారి నాదరించి ప్రోచుదేవ!
ప్రశ్రయస్వభావ! సుప్రభావ మేలుకో!
దొండపండు వంటితీపు తోపుమోవితోడ రాగి
కుండజంట వంటి గబ్బిగుబ్బదోయితో
తూఁగులాడు సన్ననడుముతో హొయల్ రహించుదేవి
తూఁగుచుంటి వింకమమ్ముఁ దొలఁగఁ ద్రోచెదో
కనుము కనులువిచ్చి మేలు కను నప్పిన్నప్పిరాట్టి
ఘనాఘనశ్యాము మేలుకనుపప స్తిమీ!
ఆదర్శము నాలవట్టె మాదియైన వస్తువులను
నీ దయితుఁడు నిద్రలేవ నీవొసంగవో!
చెలియలెల్ల మేమువచ్చి చేరియుంటిమమ్మ మమ్ము
జలకమార్ప నీవుగూడఁ గలసిరావటో!

## 21

ఏ త్తకలజ్గళ్...

నిండి పొర్లి పాలు పొంగుచుండ లెప్పు డుండునట్లు
దండిపాండి గల్గు నాల తండ మొదవంగా
నేపుగన్న నందగోప భూపునిగారాపుం దనయ
ఆపన్నార్తిహర సుప్రతాప! మేలుకో!
వైకుంఠము విడిచి భూమిలోకమునన్ నెలకొని యతి
లోకవిభవ మందిన సుశ్లోక! మేలుకో!
ప్రత్యర్థులు నీదుబల పరాక్రమముల కోర్వలేక
యత్యాపన్నులయి శరణ మనుచు వచ్చిరీ
దేవర చరణాంబుజములు సేవింపంగ నగరిముందుం
గావలి కాచెదరు నిద్రలేవవే విభూ!
మేముగూడ దేవరపద తామరసములన్ భజింప
స్వామీ! కడు హెచ్చు సంతసమున వస్తిమీ!
నిద్రలెమ్మ నిద్రలెమ్మ నిద్రలెమ్మ భద్రమూర్తి!
నిద్రలెమ్మ సకల జగన్నియతిదాయకా!

## 22

అజ్గణ్ మాళాల....

అందపు సింహాసనమ్ము లందువెలయు శత్రురాజు
లభిమానము దక్కి నీశయనము చెంగటా
గుంపులు గుంపులుగ వచ్చి కొల్వు గోరుచుండి రట్లె
కూడివచ్చినారము నినుం బాడ నేమునూ
అరవిచ్చి యొప్పుపైండి యురుగజ్జియలట్లు మఱియు
నరవిరి కెందమ్ము లట్లు మెఱయు కన్నులన్
ఇంచించుక దెఱచి మాపయిన్ గృపాకటాక్షములను
నించి మమ్ము సమ్మదాబ్ధి ముంచి తేల్చుమా!
మార్తాండుండు నిండుంజందమామయు నుదయించినట్లు
లుండు నీ విశాలనేత్రయుగము చూడ్కిచే
బహుజన్మా భ్యస్తమయిన పాపకర్మబంధమెల్ల
మిహిరకాంతిచేత మాయు తుహిన మట్లుగా
తొలంగిపోవ నిష్కల్మష విలసిత వర్తనల మగుచుం
జెలంగంగలము సత్కరుణాశీల! మాధవా!

## 23

మారి మలై మురళైల్...

వర్షాకాలమ్మునం బర్వతగుహలోం గూర్కి సింహ
వర్యము కొంచెము మెలంకువ వచ్చికూడనూ
లేవక శౌర్యాగ్ని రగులం దీవరించి కనులుదెఱచి
మై వొంగ గగుర్పు గదురంగా విదల్చుచున్
జాడించుచు సటలు మేను సాగనూచి గర్జించుచు
వేడెము వాఱుచు వెల్వడు విధము దోంపంగా
అగసిపువులవలెను నల్లనై మృదువై యలరుమేని
నిగనిగల వేల్పు! నీవునిద్ర వీడ్కొనీ
శయనాగారమువిడి యాస్థానమంటపమ్మునకు వి
జయంచేయందగవె సర్వజగన్నాయకా!
భాసమానబహురత్న స్వర్ణవర్ణ మిహపరసు
శ్రీసంధాయకమగు సింహాసనమ్మునా.
ఆరూఢుండవై దేవా? యనుగ్రహము వెలయంగ మా
యరుదెంచిన కార్య మరసి యాదరింపుమా!

## 24

అన్రు ఇవ్వులగ మళన్దా....

వేలుపులెల్లరు వేండం ద్రివిక్రమావతార మెత్తి
వెలయునీపదమ్మునకును విజయమంగళం
పొంగి లంక రాక్షసులను ద్రుంగంజేసినట్టి విజయ
సంగత! నీ భుజములకును సర్వమంగళం.
శకటాసురు బాల్యమందె సంహారము చేసిన నీ
ప్రకటకీర్తి విస్ఫూర్తికి భవ్యమంగళం.
వత్సాసురు నెగురందన్ని వైచినట్టి నీ పదముల
సత్సౌభాగ్యమునకుం బ్రశస్తమంగళం.
గోవర్ధన పర్వతమును గొడుగువోలె నెత్తినట్టి
దేవరకారుణ్యమునకు దివ్యమంగళం.
స్వామికరాబ్జమ్ములందు నవదరించు దివ్యాయుధ
రామణీయకమ్మునకును భూమమంగళం.
భవ్యభవ ద్వైభవ మిటు ప్రస్తుతించుచు వచ్చినమా
బంధము లెడంబాపి దేవ! భద్ర మొసంగుమా!

## 25

ఒరుత్తి మగనాయ్...

దేవకిదేవికి బిడ్డఁడవై వెలసియు నొక్కరాత్రి
లోవెల్వడి యయ్యశోద కీవు సుతుఁడవై
దొంగతనమ్మున నచటఁ జెలంగుట నారదునిచే నె
ఱింగి దురాగ్రహము పెల్లుపొంగి పొరలఁగా
కంసుడు దుశ్చిత్తుఁడు నిను హింసింపఁగఁ బూన వాని
కణఁకయెల్ల నణఁగ మేన వణఁకు గదురఁగా
కడుపున నిప్పంటినట్లు లెడపక తోఁచితివి వాని
కడఁకువగల వారిఁజల్ల నరయు వేల్పవు!
ఆశ్రితరక్షాదీక్షుఁడ వగు ని న్నభ్యర్థింపఁగ
నరుగుదెంచియుంటిమి మ మ్మరసి కావవే!
ఇష్టార్థము పూర్తిచేసి యేలుకొమ్ము మమ్మును బరి
తుష్టిమీఱ నిను శ్రీమహితుని నుతింతుమూ!
నీవాల్లభ్యసుఖంబును సేవించుచు భావించుచు
నే వేళను ఖేద మెఱుఁగ కెసఁగుచుందుమూ!

## 26

మాలే! మణివణ్ణా!...

సాంద్రకృపారసమనోజ్ఞ: సంశ్రితసంరక్షణజ్ఞ!
ఇంద్రనీలమణిచ్ఛాయ సుందరకాయా!
మార్గశిరస్నానమునకు మాకు వలయునట్టి వస్తు
వర్గ మిదే యవధరింతువా మహాప్రభూ!
భూమండల మెల్ల వఁణకు వొందునట్టు శబ్దించెడు
స్వామి పాంచజన్యమునకు సాటి యైనవీ
పాలవన్నెఁ బ్రకాశించు మేలిశంఖములును మఱియుఁ
బ్రబలమైన మ్రోఁతగల్గు పటహవర్గమున్
మంగళ మణిఖచితదీప మాలికలును హారతిచ్చు
శృంగారపుఁ బళ్ళెరమ్ములుం గలంతెలూ
ధ్వజపటములు మేల్కట్టులు ద్వారతోరణమ్ములు మీ
విజయములను బాడు గాయకజనసంఘమున్
స్వామీ! కరుణించి మాకు సమకూర్చితివేని యిపుడు
మేము నోఁచుకొనదలంచు నోముసాఁగునూ.

## 27

కూడారై వెల్లుమ్‌శీర్....

ప్రతిఘటించు విరోధులను భగ్నపఱుచుశక్తి గల్గు
స్వామీ! సర్వజ్ఞ మీ ప్రశస్తగుణములూ
ప్రస్తుతించి పటహాదులఁ బడయుట చాలదు దేవా!
బహుతరసమ్మాన మింకఁ బడయవలయునూ
అది జగమెల్ల న్నుతించు నదిగనుండవలయు మఱియు
నదిగా కివి గూడను మే మడిగికొందుమూ
సూడిగములు భుజకీర్తులు పాదగములు తమ్మంటులు
వేడుకతో మేము దాల్చు విధము కావలెన్
పలువన్నెల చీరలు కంచెలలున్ ధరియింపవలయు
జలజాక్షా! పాయసాన్న మలరఁ గావలెన్
నేయును వెన్నయుమీఁగడ చేయి మునుఁగునట్లు కలుగఁ
జేయవలయు నెల్లరమును జేరి కూరిమిన్
దేవరతో సారగింపఁ గావలయును దానఁజేసి
జీవితసౌభాగ్య మేము చెందఁగందుమూ!

## 28

కఱవైగళ్ పిన్ శెన్ఱు...

గోవుల వెంబడిఁబడి పెఁనుగోనలందుఁ గానలందు
దేవుళ్ళాడెడు గోపస్త్రీలము దేవా!
దేవర మాకులమునందు నావిర్భావము గాంచుట
చే వన్నెయు వాసియు వచ్చినది మాకునూ
దేవరతోఁ గలసిమెలసి తిరుగఁగల్గె నొకకులమ్ని
తెలుపఁగల్గె మాభాగ్యము తలఁపఁ దరమటే!
గోవిందా! యెప్పుడు నే కొఱఁతలేని మహనీయా!
దేవరతో చెలిమి మాకు స్థిరము కావలెన్
వేర్పాటిక్కడ మాకు నొనర్పకుమా వెఱ్ఱిగొల్ల
వెలఁదుల మిట నిన్నుపేడి వెదలఁజాలమూ
తెలిసీ తెలియని పిలుపులఁ బిలిచితిమో కలఁచితిమో
జలజాక్షా! మా తప్పులు క్షమియింపఁగదే!
కరుణింపుము పరమపదము కనికరింపు మోస్వామీ
శరణములే దన్యము నీ చరణము దక్కన్.

## 29

శిత్తమ్ శిఱుకాలే....

తెలతెలవాఱకముందే చెలియల మెల్లరము వచ్చి
దేవరపదకమలయుగము సేవచేయఁగా
కోరిక యిది చిత్తగింపఁ గోరెద మోకమలాక్షా!
కూడదు కాదనఁదగ దోగోపవల్లభా!
దాసభావమునను వచ్చి రీసతు లోసర్వేశ్వర!
ఆసాసలఁ బఱతు రంచు నరయఁ బోకుమా!
పిడక యీకాలచక్ర మాడుచుండుదాఁక నేడు
నేడుజన్మములకు నిన్ను వీడఁజాలమూ
అవినాభావమున ననన్యార్హలమై యుండెదమో
యఖిలేశా! యనుమతింపు మనునయింపుమా!
దాసవృత్తి నెఱపుచు నీతో సంతోషమున నుందు
మీసంపద మాకు నెప్పు డెసఁగఁజేయుమా!
చింత లింతకంటె వేఱె చేరకుండఁజేసి మమ్ముఁ
జేరఁదీసి యేలుకొమ్ము శ్రీమనోహరా!

## 30

వఙ్గ క్కడల్ కడైన్ద....

నిండుఁజందమామశిరు పండునెమ్మొగమ్ము గల్గు
నెలఁత లరుగుదెంచి దయానిధిని మాధవున్
జలధిఁ జిలికినట్టి పరునిఁ బలువిధములఁ బ్రస్తుతించి
కొలిచి పరమపదము గన్న పొలుపుదోఁపఁగా
క్షితికి నలంకారమైన శ్రీవిలుపుత్తూరిలోను
నుతిగను పెరియాళువారి సుత రచించెనూ
ముప్పది పాశురము లరవమునను బూలసరమువోలెఁ
దప్పకుండ వానిఁజదువు ధన్యచరితులూ
ఆరక్తవిలశానయను క్షీరాంబుధి శేషశయను
నారాధితుఁ జేసి సుఖ మిహమునఁ బరమునా
పడయఁగలరు తత్ఫలంబు పడయఁగోరి పాటలు పది
తొడఁగి శ్రీనివాసగురుఁడు నొడివె నెన్నఁడో
చేకొని పై యిర్వదిం బ్రభాకరుండు పూర్తిచేసె
వాకులందు భక్తిరసము వాఁక లూరఁగా
సప్తపదులు ముగిసెను.

—o—

# లవంగి

—వేటూరి ప్రభాకరశాస్త్రి

[లవంగి అనే యవనకన్య వృత్తాంతము పండితరాయలకు ప్రసక్తించినదికాదనీ, ప్రౌఢదేవరాయల కాలమందున్న శోణగిరినాధుడనే డిండమ భట్టారకునకు ప్రసక్తించినదనీ వేటూరివారు 1916 లో కృష్ణా పత్రికలో వెల్లడించినారు. దీనికి ఆధారము విభాగరత్నమాల ఆనే సంస్కృత గ్రంథమని వారు ఇందులో పేర్కొన్నారు- సం॥]

జగన్నాధపండితరాయల వింతచరితలు తెల్గుదేశపు బండితులకు జిరపరిజ్ఞాతములు. ఈ యుద్దండ పండితుడు డిల్లీనగరమున కరిగి, తన ప్రతిభావైభవముచే నక్కడి పాదుషాహ నబ్బురపుచ్చి తత్పుత్రికయగు లవంగిని బెండ్లి యాడినట్లును, దానిచే బహిష్కృతుడైనట్లును, ఎల్లరును జెప్పుకొనుచున్నారు. ఈ విషయమునే యాధారపరచుకొని యస్మద్గురులు బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వర కవీశ్వరులు, 'పండిత రాయ చరిత్ర' మను నాటకమును రచియించినారు. బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనృసింహ కవిగారు నావెలును రచియించుచున్నట్లు తెలియుచున్నది. ఈ విషయమున నొకవింత మార్పు వెల్లడి చేయవలసియున్నది. కవిసార్వభౌముడు శ్రీనాధునిచే నోడగొట్టబడిన డిండిమ భట్టారకుని వంశచరిత్ర మిప్పుడు, శ్రీమాన్, రంగస్వామి సరస్వతిగారి మూలమున ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునకు జేకుఱినది. దీనిపేరు విభాగ రత్నమాల. సంస్కృత గ్రంథము. అనర్ఘమనదగినది. ఆ వంశమందే జనించిన కవీశ్వరుడొకడు తనవంశ్యుల యశఃపటములు కాలక్రమమున జినిగిపోవునను సందేహముతో నీగ్రంథమును రచించినాడు. ప్రౌఢ దేవరాయల కాలమందున్న శోణగిరి నాథుడను పేరి యీ వంశపు గవీశ్వరుడు ఢిల్లీ పట్టణమునకు వెళ్ళినట్టును అక్కడి పండితులతో వివదించి యోడించినట్టును, అప్పుడు లవంగియను పేరుగల యా ఢిల్లీశ్వరుని కుమార్త యీ యరుణగిరినాథుని పక్షమున బ్రవర్తించినట్టును, అప్పుడే యీతనికి, డిండిమ, కవిసార్వభౌమాది బిరుదములును, గజాందోళికాది రాజార్హ సమ్మానములును జరుపబడినట్లు పై గ్రంథమున బేర్కొ-బడినది. కొన్ని యాశ్లోకము లుదాహరింతును.

శ్లో॥ సురత్రాణరాజం జగత్రాణదక్షం  
ద్విజత్రాణదీక్షం నిజత్రాణశక్తం  
ద్విజేభ్యో విదిత్వా నిజేభ్యోఽ వదిత్వా  
జగామద్విజాగ్య్రః పురం హస్తినాఖ్యం॥

అక్కడ నుపద్వార దేశమున నీ కవీశ్వరు డొక శ్లోకార్థమును వ్రాసి వెల్లడించెనట! అక్కడి పండితులసూయాకువులై దాక్షిణాత్య కవియొక్కడు దురర్థమగు శ్లోకార్థమును ద్వారమున వ్రాసెనని తేనితో దగవులు సెప్పిరట!

శ్లో॥ సురత్రాణే తతః క్రుద్ధే విచార యతిమానసే  
లవంగీతనయాతస్య తాతమాహశుభాంగిరం  
విద్వానర్థీచ భూత్వాకః స్ఫుటమేవం రచిష్యతి  
ఆనర్థైవ భవేదర్థ అనేయ ఇతివై కవిః॥

రాజసమ్ముఖమున నీకవీశ్వరు డాశ్లోకార్థము నిట్లు పూరించెనట!

సురత్రాణ భవదాజ్ఞ్యా నిద్రాతు మహామాగతః
అనిదేశిష్వన్యదేశేషు త్వదాగమన శంకయా॥

ఇరువదిమూడు దినములు వివాదము జరిగినదట! కవిమల్ల ప్రభృతులగు ప్రతిపక్షవిద్వాంసు లప్పుడు నిర్జింపబడిరి. అప్పుడీతనికి:-

శ్లో॥ వాదం డిండిమమస్య నూపుర వరాహ స్తింద్రము
కుంభకం। విద్వత్కంఠగదుం వితీర్య విమతానా
ధూయవాలాగ్రతః! సౌవర్ణమణిరంజితే సమభిషి
చ్యైనం సుభదాసనే। విద్యాడిండిమ శోణశైల
కవిరిత్రాఖ్యాం విభుర్దత్తవాన్॥

ఇందు లవంగి నిచ్చినట్లులేదు. కాని యితరచాటువు లిక్కడ సందర్భించుకొనవచ్చును. అప్రతిష్ఠావహమని యే తద్గ్రంథకర్త యావిషయమును విడచెనేమో! ఏమయినను లవంగీగాధ డిండిమభట్టారకునకు ప్రసక్తించినదనుట కాధారమేర్పడినది. పండితరాయలకు ప్రసక్తించిన దనుటకు దగిన యాధారములేదు.

—కృష్ణాపత్రిక-అక్టోబరు 14, 1916.

# తంజావూరి రాజుల విగ్రహములు

—వేటూరి ప్రభాకరశాస్త్రి

[ఈ వ్యాసమును వేటూరివారు 10-9-1919 నాటి ఆంధ్రపత్రికలో ప్రకటించిరి. తంజావూరు నేలిన తెలుగునాయక రాజగు రఘునాథరాయల విగ్రహములు కుంభకోణము నందలి రామస్వామి దేవళమున నుండుటను గుర్తించి లోకమున కెరుకపరచినవారును, తంజావూరు ఆంధ్రరాజుల చరిత్రను విపులమైన పీఠికతో సవిశేషముగా వెల్లడించినవారును వేటూరివారే! ఇట్లే తాళ్ళపాక పదకవుల విగ్రహముల నుద్ధరించి అన్నమాచార్య చరిత్రను విపుల పీఠికతో వెలయించి (1948) జగద్విదితము కావించిన వారును వేటూరివారే యగుట ఆంధ్రజాతి కృతజ్ఞతతో స్మరించి కీర్తింపదగిన విశేషము కదా!—సం॥]

నేను తంజావూరి యాంధ్రరాజుల చరిత్రను ప్రకటించు కాలముననుు, తర్వాతను గూడఁ దంజావూరి యాంధ్ర నాయకరాజుల విగ్రహములు శిలానిర్మితములుగాని లోహనిర్మితములుగాని యెక్కడనేని యగపడునేమోయని మిక్కిలి విచారించితిని. కాని నాకప్పుడెక్కడనునున్నట్టు తెలియరాలేదు. నాయకరాజుల యనంతరమా చోళరాజ్య మాక్రమించుకొన్న మహారాష్ట్రరాజు లట్టివిగ్రహము లుండినను నాశపఱిచి యుందురని యప్పుడు భావించితిని. తంజావూరి యాంధ్రరాజులచరిత్రమునఁ గూడనట్లే వ్రాసియుంటిని. కొంతవఱకదియు సత్యమే కాఁదగును. ఇటీవల నేను తంజావూరిలో రాచనగరికి సమీపమున నున్న రాజగోపాలస్వామి దేవళమున లోహనిర్మితము లయిన రెండు విగ్రహములను చూచితిని. రూపవేషవిన్యాసమును బట్టి యవి యాంధ్రనాయకజాలి విగ్రహములే యని స్పష్టముగాఁ జెప్పఁదగియున్నను, అందు నామాంకము కనఁబడకపోవుటచే నెట్లును నిర్ణయింప రాదయ్యెను. తంజావూరి సీమ లోనేయున్న మన్నారుగుడి యను గ్రామమున రాజమన్నారు దేవునిదేవళమందు మన్నారుదాసుఁడని నామాంతరము గల విజయరాఘవ నాయకుని (రఘునాథ రాయల కొడుకు) లోహ విగ్రహమున్నట్టు వింటిని. కాని యది జూడఁ దటస్థించినది కాదు ఈ నడుమ నేను కుంభకోణము వెళ్ళినప్పుడక్కడి నా మిత్రులతో నీ విషయము ముచ్చటించితిని. వారికిఁ "గుంభకోణమందున్న మహోన్నతమగు రామస్వామి దేవళము తెలుగునాయకరాజగు రఘునాథరాయలు కట్టించినదే యన్న విషయము" తెలియఁ జెప్పితిని. ఆ రామస్వామి దేవళమునఁ నొక స్తంభముపై నా దేవళమును గట్టించిన రాజకుటుంబము విగ్రహములు చెక్కఁబడి యున్నవనియు నుత్సవకాలమందు ముందావిగ్రహముల దగ్గఱకు స్వామి వచ్చుననియు నా మిత్రుల వలన విని, నాఁడే యక్కడికరిగి యా విగ్రహములను జూచితిని. కాని అందును నామాంకము గానరాలేదు. దేవాలయాధికృతులఁ నడిగితిని. పేళ్ళు మాకుఁ దెలియ వనియు, నీ దేవళమును గట్టించిన తెలుఁగురాజుల విగ్రహము లగుట వాస్తవమనియు నాదినుండియు స్వామి యుత్సవారంభములందిక్కడకు వచ్చుట, పుష్పహారములు గొనుట మొద

లగు మర్యాదలు జరుగుచున్నవనియును చెప్పిరి. ఆ దేవళమును గట్టించినవాఁడు రఘునాథరాయలగుట స్పష్టమగుటచే నా విగ్రహ మాతనిదేయని విశ్వసించితిని. రూపవేష విన్యాసము గూడ నీ విషయమును స్పష్టపఱిచెను: భార్యాపుత్ర సహితముగా నా రాజ విగ్రహ మంజలిబంధముతో భక్తిప్రహ్వముగాఁ జెక్కఁబడినది. బాలుఁడుగా నున్న పుత్రుఁడు విజయరాఘవ నాయకుఁడు కాఁదగును. ఆ దేవాలయ మాకుమారుఁడయిదాఱేండ్ల ప్రాయమువాడయి యుండగాఁ గట్టింపబడి యుండును. రఘునాథరాయల కాతఁడు లేకలేక కల్గిన సంతానము. మధుర శ్రీరంగము మొదలగు స్థలములందు తిరుమల నాయకుఁడు విజయరంగ చొక్కనాథ నాయకుఁడు మొదలగు మధుర తెలుఁగు నాయకుల విగ్రహములు ప్రసిద్ధముగాఁ గానవచ్చుచున్నవి. ఆ విగ్రహముల ప్రతిబింబము లింతవఱకు దెలుగు దేశమున వెల్లిడింపఁబడినట్లు తోఁపదు. మీఁద నేను బేర్కొన్న తంజావూరి నాయకరాజ విగ్రహము కల ప్రతిబింబములును తప్పక యాంధ్రలోకముకన్నులకు గోచరింపవలసినవి. మధుర శ్రీరఁగము తంజావూరు కుంభకోణము మన్నారుగుడి మధ్యార్జునము గౌరీమాయూరము మొదలగు ప్రసిద్ధ పుణ్యక్షేత్రములందు, మన తెలుఁగునాయకరాజులు చేసిన ధర్మప్రతిష్ఠాపనము లనేకములుగలవు. ఆయా దేవాలయములందువా రొసఁగిన యనర్ఘ రత్నాభరణాదులు నేఁటికిని కలవని వినికిడి. కొన్నింటియందు దాతల నామాంకములు గూడఁ గలవట! అట్టి వానినెల్ల బరిశీలించినచో జరిత్రోపయోగములగు నపూర్వ విషయము లెన్నో బయటపడగలవు. దక్షిణదేశ దేవాలయముల కిప్పుడున్న వైభవమంతయు నానాఁడు మన తెలుఁగు నాయకరాజులు వెలయించినవే.



# నాకుతోచినమాట

— వేటూరి ఆంజనేయులు

శ్రీ కట్టమంచివారు, శ్రీ ప్రభాకరశాస్త్రిగారికి, రంగ నాథరామాయణ పరిష్కరణ విషయములో వ్రాయించిన, వారు వ్రాసిన జాబుల తీరు 'మణిమంజరి' (ఫిబ్రవరి 1983)లో చదివినంతనే, వాటిలో నేను కట్టమంచివారిని గురించి యూహించుకొన్న విశాల హృదయము, పండిత పక్షపాతము, నిష్పాక్షికమైన విమర్శనాదృష్టి, భావౌదార్యము లోపించినట్లు తోచి విషణ్ణుడనైనాను.

o o o

ఆంగ్లభాషలో కట్టమంచివారి వక్తృత్వము నన్నెక్కువగా ఆకర్షించెడిది. విద్యార్థి దశలో నేను వారి యుపన్యాసములను నాలుగైదుసార్లు వినదము; మద్రాసు రాష్ట్ర శాసనసభలలో వారు 1921-1939 మధ్య చేసిన ఉపన్యాసములను, చర్చలను చదవడము తటస్థించింది. సుప్రసిద్ధులైన శ్రీనివాసశాస్త్రి, శ్రీనివాస అయ్యంగార్, సి. పి. రామస్వామి అయ్యర్, భూలా భాయ్ దేశాయ్, జవహర్‌లాల్ నెహ్రూ, సుభాష్‌చంద్ర బోస్, ఆచార్య కృప్లానీ, సత్యమూర్తి, రాధాకృష్ణన్, డా॥ పట్టాభి సీతారామయ్య, కోలవెన్ను రామకోటేశ్వరరావు, డా॥ లంక సుందరముల వక్తృత్వము కన్న, రెడ్డిగారి వాక్చాతురి మరింత సరళమై, పద లాలిత్యము, అర్థగాంభీర్యము, వ్యంగ్యవిన్యాసము, ప్రవాహప్రౌఢిమ, సమయస్ఫూర్తి, పలుకుబళ్ళు, చమత్కారాలతో శ్రోతలకు కర్ణపేయంగా వుండేవి. కొంత వరకు శ్రీ కట్టమంచివారి వాక్ప్రవాహము, నిశిత విమర్శనము కృష్ణమీనన్‌గారి ఉపన్యాస సరళితో పోల్చదగునేమో! కట్టమంచివారికి కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయములో వారి సమకాలికులైన ప్రముఖ అర్థశాస్త్రవేత్త జె. యమ్ కీన్సు ప్రభువు రెడ్డిగారి షష్టిపూర్తి సందర్భమున పంపిన సందేశము నాకు కట్టమంచివారి యెడల గల గౌరవాన్ని ఇనుమడింప చేసింది.

శ్రీ రెడ్డిగారు రెండవసారి కాబోలును, ఆంధ్ర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్ష పదవికి, శ్రీ వేపా-రామేశం పంతులుగారితో పోటీ పడవలసి వచ్చినట్లు జ్ఞాపకం, ఆ సందర్భంలో శ్రీమతి-సరోజినీనాయుడు వాల్తేరులో ఉపన్యసిస్తూ "I prefer a bachelor Vice-Chancellor to a birth-Control Vice-Chancellor" అని రెడ్డిగారి అభ్యర్థిత్వాన్ని, చమత్కారయుతంగా సమర్థించారు.

కొన్నాళ్ళు రెడ్డిగారు కాంగ్రెస్ సభ్యులుగా నుండి మద్రాసు రాష్ట్రంలో ప్రప్రథమంగా కాంగ్రెస్ మంత్రి వర్గము 1937లో పదవీస్వీకారము నేసినప్పుడు వారికి విద్యామంత్రిత్వము లభించనందున, మచిలీపట్నం, హిందూ కాలేజీ ఆవరణలో జరిగిన సభలో తాము కాంగ్రెస్ సభ్యత్వానికి రాజీనామాచేస్తున్నట్లు ప్రకటించారు

తదుపరి, కాంగ్రెస్ పార్టీ యెడల వారు వైషమ్యం పెంచుకొన్నారు. మద్రాసు విశ్వవిద్యాలయపు ఎగ్జామినేషన్ హాలులో అప్పటి ముస్లిమ్‌లీగ్‌కు అనుకూలంగా రెండుమూడుపన్యాసాలు వారిచ్చినట్లు నాకు జ్ఞాపకం.

వారు ఆంధ్రవిశ్వ విద్యాలయములో నిపుస్తక భాండాగారం నుంచి, విద్యార్థులు సామ్యవాద గ్రంథాలు చదివి చెడిపోతున్నారని, అట్టి సామ్యవాద సిద్ధాంతానికి చెందిన గ్రంథాలను తీసివేయించారు. ఈ చర్యను గర్హిస్తూ అప్పట్లో అఖిలభారత కాంగ్రెస్ కార్యదర్శియైన, ఆచార్యకృప్లానీ "King Canerte of the Andhra University" అనే శీర్షిక

గల వ్యాసంలో రెడ్డిగారి చర్యను నిశితంగా విమర్శించారు.

శ్రీ రెడ్డిగారొకసారి 1936లో కాబోలును, నోబెల్ కళాశాలలో (మచిలీపట్నం) ఉపన్యసించారు. కళాశాలాధ్యక్షులైన రివరెండ్ షటిల్ వర్తు గారు వారి అధ్యక్షోపన్యాసంలో, కళాశాల ఆర్థిక దుస్థితిలో నున్నట్లు వివరించారు. తర్వాత శ్రీ రెడ్డిగారు మాట్లాడుతూ, ఆ కళాశాల ఆర్థిక దుస్థితికి కారణము "ఛోటాఛోటా" కాళాశాలలను నెలకొల్పుటకు ఆంధ్ర విశ్వవిద్యాలయము వాతిచ్చిన తోడ్పాటేనని వివరించారు. ఆప్పట్లో, విజయవాడలోను, గుంటూరులోను, హిందూకాలేజీలు క్రొత్తగా నెలకొల్పబడినవి. అందరులో హిందీకాలేజి సుప్రతిష్ఠితమై యుండనేయున్నది. వ్యంగ్యంగా శ్రీ రెడ్డిగారు తమకుపూర్వము ఆంధ్ర విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షులైన శ్రీ రాధాకృష్ణన్ గారిపై విసిరినవిసుర్లివి. ఆ తరువాత కళాశాల ఆర్థిక దుస్థితిని గురించి తామేమీ చేయలేమని చెపుతూ; 'Though my heart is with you, my finances are not" అన్నారు. పైపెచ్చు, 'ఫోనిక్సు' పక్షివలె నోబెల్ కళాశాల తన బుగ్గినుంచి తానే మరల ఆవిర్భవించగలదని ఆశ్వాసించారు. ఇది జరిగిన రెండేండ్లకే నోబెల్ కళాశాల, గుంటూరులోని ఎ. సి. కళాశాలలో లీనమైపోయింది.

సహజంగా శ్రీ రెడ్డిగారిలో అహమిక, తొందరపాటు వాక్పారుష్యం, కొన్నికొన్నిపట్ల వైమనస్యం కన్పడుతున్నా, ఆయన ప్రజ్ఞాశాలిత్వానికి, వక్తృత్వానికి చాలమంది ముగ్ధులయేవారు. ఇట్టిలోపాలను ఆయన సవరించుకొని, సమరస భావాలతో నల్గురినీ కూడగట్టుకొనే దూరదృష్టికల్గి వ్యవహరించి యున్నచో ఆయన వంటి విద్యావేత్త, బహుముఖ ప్రజ్ఞాశాలి జాతీయ స్థాయిలో పరిపాలననెరపుతున్న కాంగ్రెస్ప్రభుత్వంలో యిమిడియుండేవాడే.

o o o

శ్రీ రెడ్డిగారికి, ప్రభాకరులకు జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలలో, కట్టమంచివారి పోకడ కొంతవ్యక్తమౌతున్నది. ఆంధ్రవిశ్వ విద్యాలయమువారు శ్రీ శాస్త్రిగారికి 8-9-1938 తేదీన వ్రాసినలేఖలో పరిష్కరణ పాటవాన్ని గురించి క్రిందివిధంగా వ్రాయబడింది.

"I am to inform you that the University expects you to pepare a masterly edition embodying portions omitted so that a scholarly edition may bemade available."

విస్మరింపబడిన వృత్తాంతాలను చేర్చినంత మాత్రాననే పరిష్కరింపబడినగ్రంథము 'Scholarly edition" కాజాలదు. గ్రంథపరిష్కరణతోపాటు సవిమర్శకంగా విపులమైన, పరిశోధనాత్మకమైన పీఠిక కలదే "Mastely"Scholarly edition.మరియు పాఠాంతరాలను సూచించుటతో గ్రంథపరిష్కరణము పూర్తికాదు. శ్రీ శాస్త్రిగారికి చెందదగు పారితోషికాన్ని గుర్తించి మాత్ర మీలేఖలో ఎట్టి సూచనలేదు.

ఒకనెల తర్వాత, 7-10-1938 తేదీన ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు శ్రీ శాస్త్రిగారి కొకజాబు వ్రాశారు- దానితో పి. పి.యస్. శాస్త్రి; (క్యూరేటర్) గారికి కట్టమంచివారికి జరిగిన సంభాషణవలననండి, ఒప్పందంప్రకారం అనండి, ఓరియంటల్ లైబ్రరీలో అప్పటికి పనిచేస్తున్న శ్రీ ప్రభాకరశాస్త్రిగారు ఎట్టి కట్టుబాట్లక్రింద రంగనాథ రామాయణ సంస్కరణచేయవలసివచ్చింది సంగ్రహంగా వివరింపబడింది. పి. పి. యస్. శాస్త్రిగారు ప్రతిపాదించిన షరతులు అక్రమమైనవి. అవేవనగా, శ్రీ వే॥ ప్ర॥ గారు రంగనాథరామాయణానికి పరిష్కర్తలుగా నుండుటకు ప్రభుత్వము అంగీకరించుట దుష్కరమనీ కాబట్టి జరగతగిన పరిష్కరణ పరిశ్రమ నిగూఢంగాను. అనధికారరీత్యాను జరుగవలెననిన్నీ; శ్రీ శాస్త్రిగారు గన్నవరపు సుబ్బరామయ్యగారితో సహకరించా

లనిన్నీ; కాని, విశ్వవిద్యాలయమువారిచే నియమింప బడిన గన్నవరపువారు, శ్రీ శాస్త్రిగారికి సహకారిగా నిర్ణయింప బడినట్లు తెలియకూడదనిన్నీ శ్రీ ప్రభాకర శాస్త్రిగారి పేరు ఆంధ్రవిశ్వవిద్యాలయము వారిచే నియమింపబడిన సంపాదకులుగా ప్రచురితము కాగూడదనిన్నీ; విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు పరిష్కరింపబడిన గ్రంథానికి ఉపోద్ఘాతము వ్రాస్తారు గనుక, దానిలో శ్రీ శాస్త్రిగారి సహకారాన్ని సూచించ వచ్చుననిన్నీ.

ఋజుమార్గవర్తి, నిష్కపటియైనవారెవరూ పై నుదాహరించిన షరతులను పెట్టరు. అట్టి కట్టుదిట్టాలను కార్యకర్తకు తెల్పుటకుగూడ ముఖము చెల్లడంకష్టమే. పై నుదహరించిన కట్టుబాట్లకు శ్రీ శాస్త్రిగారంగీక రించడం కూడా ఆశ్చర్యకరమైనదే. దానికి కారణం నిరుద్యోగిగానున్న శ్రీ గన్నవరపు- సుబ్బరామయ్య గారికి ఉపాధికల్పించడం కాబట్టి ఆయన నిష్కామకర్మ చేశారు.

ప్రభాకరులు పండితప్రకాండులేకాని, ధనాభావ ముచే వారెట్లో కాలమునెట్టుచుండిరి. విశ్వనాథవారు వారిని ప్రస్తుతిస్తూ 'వేటూరివారి వ్యాఖ్యలును పీఠికలుం దెలుగుం బొలంతికిన్ బేటులురేగు గందవొడిపెట్టిన పూతలు; అట్టిదయ్యు వారేటికొ వట్టి పేదతనమే భజియింతురు' అని 'భారతి' సంచికలో వ్రాశారు. ఆర్థికముగా సామాన్యస్థితిలోనున్నా సాహిత్య ప్రజ్ఞా పాటవమును దాని నావరించిన ఆత్మాభిమానమును గల శాస్త్రిగారిని సహృదయముతో ఆకళించుకొని సాహిత్యాభిమానులుగాను భాషాపోషకులుగాను రాణిం చతగిన పదవిలో నున్నవారైన కట్టమంచివారు, తామెన్నికచేసి రంగనాథరామాయణ పరిష్కరణ భారమును శాస్త్రిగారిపైనుంచిరి గనుక, ఆట్టిపరిశ్రమకు వచ్చిన అంతరాయములను నిర్మూలించి, శాస్త్రిగారి వైదుష్యానికి తగినంత ప్రోత్సాహమిచ్చి, వారికి చేయ తగిన సత్కారము నేర్పాటుచేయుట వారిబాధ్యతకాగా దానిని వారు విస్మరించుట విచారకరమైన విషయము.

ఓరియంటల్ లైబ్రరీ క్యూరేటర్, పి. పి. యస్. శాస్త్రిగారికి, అయన వద్ద పనిచేస్తున్న శ్రీ ప్రభాకర శాస్త్రిగారికి పొసగుబాటులేకపోవడం, ఆ క్యూరేటరు శాస్త్రిగారిని సైదాపేట టీచర్స్ కాలేజీలోని మాడెల్ స్కూలుకు బదిలీ చేయడం, శ్రీ శాస్త్రిగారు దీర్ఘ కాలము శలవు పెట్టి, తదుపరి ఉద్యోగ విరమణ చేయడాన్ని గురించి శ్రీ బులుసు వెంకటరమణయ్య గారు వారి వ్యాసంలో పేర్కొన్నారు. (మణిమంజరి ఆగస్టు 1982 పుట 193). ఎంత మందబుద్ధికైనా క్యూరేటరు శ్రీ శాస్త్రిగారి యెడల స్పర్థతో అక్రమ మైన షరతులను పెట్టుచున్నాడని తెల్లము కాదగును. రంగనాథరామాయణ పరిష్కరణముమీద మిక్కిలి మక్కువ గల్గి, విద్యాసంస్థల నిర్వహణలో ఆరితేరిన మేధావంతులైన కట్టమంచివారికి పి. పి. యస్. శాస్త్రికి ప్రభాకరుల యెడ గల వైరబుద్ధి స్పష్టమైనప్పటికీ వారుదాసీనతనే వహించిరి. దీనికి కారణమేమో? వారు తలచుకుంటే క్యూరేటర్ కన్న ఉన్నత స్థానములో నున్న యుద్యోగితోగాని, విద్యామంత్రితో గాని యీ విషయము ప్రస్తావించి, శ్రీ శాస్త్రిగారిని డెప్యుటేషన్ మీద ఆంధ్ర విశ్వవిద్యాలయానికి పరిమితకాలము తీసుకొనుట కేర్పాటు చేయదగిన దక్షత వారికి లేక పోయెనా? ఆ రోజులలో కాంగ్రెస్ ప్రభుత్వము నెరపు చున్నందున అట్టి ఏర్పాటు సులభసాధ్యమే కదా!

శ్రీ శాస్త్రిగారికి వారి పరిశ్రమకు తగిన ప్రతి ఫలము లేకపోగా, పైపెచ్చు పరిష్కరింపబడిన రంగ నాథరామాయణాని కుపోద్ఘాతము కట్టమంచివారే వ్రాయుదురన్న కట్టడి యొకటి; అట్టి యుపోద్ఘాతానికి తగిన వస్తుసేకరణ చేసి కట్టమంచివారికి కైంకర్యము చేయవలయునను కోరిక వేరొకటి! (లేఖ 28-9-41)

ప్రభాకరులు కట్టమంచివా రుపోద్ఘాతము వ్రాయుట కామోదించినను, వారి 30-10-1938 లేఖలో విమర్శ నాత్మకమైన వ్యాసమును వ్రాయదలచుకొన్నట్లు స్పష్టీ కరించిరి. (మణిమంజరి: ఫిబ్రవరి 1983- పుటలు

31-32) తమ 11-9-1941 లేఖలో దీనిని క్లుప్తముగా పునరుద్ఘాటించిరి. శ్రీ రెడ్డిగారు వారి 28-9-1941 లేఖలో పీఠిక, ఉపోద్ఘాతము — ఈ రెండు అవసరము లేదనియు, తాముపోద్ఘాతము వ్రాసెదమనియు, అందు శ్రీ శాస్త్రిగారి తోడ్పాటును స్మరించెదమనియు వ్రాసిరి. వారి లేఖనుంచి యొక తునక. (28-9-41)

"Please let me have brief notes on the textual improvements made in the present edition. I shall write the introduction in two parts: one based on the information supplied by you and it will practically (be) your own— and the other the literary criticism which will be mine mainly. Though(?) if you send me your notes. I shall in corporate them giving credt of course to you"

అంతా దీనికి భిన్నంగానే జరిగింది. ఈ లేఖ వ్రాయుటకు పూర్వమో, పిదపనో జరిగిన యుదంతమును శ్రీ ప్రభాకరశాస్త్రిగారి కనిష్ఠ సోదరులైన శ్రీ శంకరశాస్త్రిగారు వారి వ్యాసములో (మణిమంజరి-ఆగస్టు 1982) యీ క్రిందివిధంగా వ్రాసిరి.

"అందుకు (పీఠికారచనకు) కావలసిన చరిత్రాంశము లన్నిటినీ సమకూర్చుకొని పీఠిక చిత్తుప్రతి తయారు చేయుచున్న సమయంలో శాస్త్రిగారికి మిత్రులైన యూనివర్సిటీ (ఆంధ్ర) పండితు లొకరు తమ వద్దకు వచ్చి పీఠికా విషయములను చర్చిస్తూ ఇందును గూర్చి శ్రీ రెడ్డిగారికి కొన్ని నిశ్చితాభిప్రాయములు కలవనియూ, అవి ఇట్టివనియూ ముఖాముఖి చర్చలలో తెలిపిరి. అందుకు అనుగుణముగా మీ పీఠిక ఉండుట సమంజసమని సలహా చెప్పిరి అవన్నియు సావధానంగా విని 'గ్రంథావిష్కరణ కార్యము ముగిసినది. పరిష్కర్త తాను సత్యములని నమ్మిన విషయములను పీఠికలో వ్రాయుట సమంజసము. పీఠికలోని విషయములకు నేను బాధ్యత వహించవలెను గదా! ఇతరుల అభిప్రాయములను అందు చొప్పించుట తగనిపని. నా అంతరాత్మ ప్రబోధమునకు విరుద్ధముగా నేనేమీ వ్రాయజాలను.' అని తెలిపిరి."

పీఠిక, ఉపోద్ఘాతము — రెండును వేర్వేరుగా నవసరము లేదన్న రెడ్డిగారు, వేటూరివారిచే పరిష్కరింపబడి, ఆంధ్ర విశ్వవిద్యాలయమువారిచే ప్రకటింపబడిన రంగనాథరామాయణములో శ్రీ లక్ష్మీకాంతముగారి పీఠికతో తమ 'అనుబంధ పీఠికను' జోడించిరి. ప్రభాకరుల విపులమైన, విమర్శాత్మకమైన పీఠికను వీటితో అనుసంధానించి యుండినచో వేర్వేరు దృక్కోణాల నుంచి సవిమర్శకంగాను, పాక్షికదృష్టితో కాకుండాను గ్రంథరచనను సమీక్షించుట జరిగెడిది. వాటి గుణదోషాలను ప్రాజ్ఞులే నిర్ణయించేవారు.

ఇక రెడ్డిగారు కోరికపై శ్రీ శాస్త్రిగారు పంపిన నోట్స్ విషయం శాస్త్రిగారే యీ క్రింది విధంగా వ్రాసిరి.

"గ్రంథ ముద్రణ ముగిసిన కాలమున నేను గొన్నాళ్ళు అనారోగ్యముగా నుంటిని. అయినను, తత్ప్రసక్తముగా పీఠికా గ్రంథమును గొంత పడుక మీదనుండియే శ్రీ రెడ్డిగారి కోరికపై వ్రాసిపంపితిని. దాని ప్రత్యంతరము నాదగ్గఱలేదు- అది వారు ప్రకటింపనులేదు; నాకు బంపనులేదు. ఇప్పుడు వారికి జాబు వ్రాయుచున్నాను - త్రిప్పి పంపగోరి. పంపినచో దానిని ముగించి ప్రకటింపగలనేమో !" (మణిమంజరి. ఫిబ్రవరి 1983 పుట 38).

శ్రీ రెడ్డిగారు వారి లేఖలో వ్రాసినట్లు చేయలేక పోయిరి. కారణము వారి అనారోగ్యము కావచ్చును. ప్రభాకరులకు వారు పంపిన నోట్సు త్రిప్పి పంపినట్లు గూడ కన్పడదు.

o o o

ఆంధ్రాంగ్లాలలో నాకున్న సాహిత్యజ్ఞానం చాలా స్వల్పం. కాని, ఈ రెండు భాషలయెడ గల ఆసక్తి మెండు. రంగనాథరామాయణం చదువగా నా స్వల్ప బుద్ధికి తోచిన సందేహాలు క్రింద వివరించబడినవి.

గోనబుద్ధారెడ్డి రచించనీ. రంగనాథుడనే కవి రచించనీ, రంగనాథరామాయణము, హృద్యము, ప్రౌఢమునైన ద్విపదకావ్యము. కృత్యవతరణికలో బుద్ధారెడ్డి యొక్క బృహత్కావ్యాన్ని రచింప నుత్సుకుడై యుండగా,అతని తండ్రియైన విఠలభూవిభుడొక నాడు కొలువుదీర్చి, శాస్త్రజ్ఞులు, పురాణవిదులు, కావ్యనాటక కర్తలు, బహుశ్రుతులు పరివేష్టించియున్నపుడు తెనుగురామాయణము రమణీయముగా, కావ్యపటిమతో చెప్పగలవారెవరని ప్రశ్నించెనట. అప్పుడా విబుధు లావిభుని కుమారుడైన బుద్ధుడేయట్టి బృహద్రచన చేయగలవాడని చెప్పిరట. అప్పుడాయన తనపేర రామాయణము పురాణమార్గమున రచింపుమని తనయు నాదేశించెనట.

బుద్ధుని గుణగణాలను వారీ క్రిందివిధముగా విఠలునకు చెప్పినట్లు రచింపబడినది.

"నీతనూజన్ముండు నిపుణమానసుడు
ధూతకల్మషుడు బంధుర నీతిధనుడు
కమనీయబహుకళాగమవిచక్షణుడు
సుమనీషిపోషణోత్సుకసుఖోన్నతుడు
కవిసార్వభౌముండు కవికల్పతరువు
కవిలోకభోజుండు కవిపురందరుడు
ప్రత్యర్థిరాజన్య బలవజ్రపాణి
పత్యర్థినృపదావ పావకోజ్వలుడు
భీకరనిజఖడ్గ బింబితస్వర్గ
లోకానురక్తారి లోకదుర్దముడు
సరసార్థిజలజాత జలజాతహితుడు
పురుషచింతామణి బుద్ధయాహ్వయుడు
నీకతిభక్తుండు నిఖిలశబ్దార్థ
పాకజ్ఞు డత్యంత పాండిత్యఘనుడు
మరియురామాయణ మర్మమాతండ
యెరుగుమాతని బంపమీకథజెప్ప"

(రంగనాథరామాయణము. పుట-4)

పై నుదాహరించిన పంక్తుల వలన నాకుగల్గిన సందేములు.

1. రాజాశ్రితులై, కావ్యరచనే జీవికగా నున్నపండితులు, రామాయణ రచన తాముచేయగలమని ముందుకు వత్తురేతప్ప, అరచనోద్యోగము ప్రౌఢపాండిత్యముగల నీకుమారుకే నివ్వతగునని యేకగ్రీవముగా ననరేమో!

2. కుమారుని పాండిత్యపటిమ తండ్రియగు విఠలునికి ఆస్థానపండితుల వలననే తెలియవచ్చుట అసంగతముగా నున్నది.

3. ఎంతపాండిత్య శౌండీర్యమున్నా తన్నుగురించి ఇతరులు పొగిడినట్లుగానైన చెప్పికొనునా? రాజాశ్రయమున కెదురుచూచు అట్టికవులు లేకపోలేదు కాని, రామాయణకావ్యములో వేరొకచోట "కులజుండు తను దానె కొనియాడు కొనునె" (అరణ్యకాండ-పుట 190) యనిన రాజవంశజుడైన బుద్ధుడు అట్టి పొగడ్తను చేసికొనుటగాని సందేహాస్పదము.

4. కొన్ని విశేషణాలనుబట్టి (సుమనీషి పోషణోత్సుకసుఖోన్నతుడు;కవికల్పతరువుకవిలోకభోజుండు; సరసార్థి జలజాత జలజాతహితుడు; పురుష చింతామణి) ఆశ్రితుడైనకవి ఈ కావ్యమును బుద్ధునిపేర రచించెనాయను సందేహము కల్గును.

5. అసమానమైన పాండిత్యము కల్గియున్నను, శత్రువిచ్ఛేదనచే (ప్రత్యర్థిరాజన్య బలవజ్రపాణి-ప్రత్యర్థి నృపదావ పావకోజ్వలుడు- భీకరనిజఖడ్గ బింబిత స్వర్గలోకాను రక్తారిలోక దుర్దముడు) రాజ్యరక్షణ ముఖ్యముగనుక, రాచరికపు బాధ్యతలలో తలమునకలగుచున్న విఠలపుత్రునకు- బుద్ధునికి- ఇట్టి గొప్పకావ్యరచన ఏకాగ్రతతో పెద్దకాలము నిర్వహించే వ్యవధి యుండెనా?

6. "కవి సార్వభౌముడు" "కవి పురందరుడు" నిఖిలశబ్దార్థ పాకజ్ఞుడత్యంత ఘనుడుగా నెన్నబడిన వాడీ రామాయణరచనకు పూర్వము కొన్నికావ్యములు రచించియుండవలెను. అందువలననే శాస్త్రజ్ఞులు, పండితులు బుద్ధునే రామాయణ కావ్యరచనకు పూన్పమనిరి గదా! అట్టివేమైన బుద్ధారెడ్డిపేర (రంగనాధుని పేర గాని)యుపలబ్ధమైనవా?

పై నుదాహరించినవి కాక వేరొక చిన్నసందేహము క్రింది రచనవల్ల కల్గుచున్నది.

శుకుడు రావణరాయబారిగా సుగ్రీవుని వద్దకు వెళ్ళినపుడు సుగ్రీవుడు కోపించి ఈ విధముగా పల్కినట్లు రచన.

"పటుకార్ముకంబు యూపంబుగా నిలిపి
చటులాస్త్రములు పరిస్తరణముల్ చేసి
పరగగెంధూళులు ప్రభలుగావించి
తరుచుస్రుక్ స్రువ తతులుచేపట్టి
సమరభూదేవికా స్థలముననుండి
యమరులకెల్ల బ్రియంబెక్కుచుండ
గరమొప్ప వీరాంగకంబులుచెల్లు
దొరుగుచునున్న నెత్తురునేయిగాగ
మహితగుణధ్వనుల్ మంత్రముల్ గాగ
బహురాక్షసశ్రేణి పశుకోటిగాగ
దనరెడుసింహనాదధ్వనుల్ పేర్చి
యనిమిషావలికి నాహ్వానంబుగాగ
విడువనికాహళ వితతులమ్రోత
కడునింపుగా సామగానంబుగాగ
ఘనమైన రామలక్ష్మణుల కోపములు
మునుకొనినాకోప మునగూడబర్వి
యనుపమత్రేతాగ్ను లైయుండనందు
దనదుప్రాణంబుల త్తరి నాహుతులుగ
రణమునదనవీర రసమడంచుటయె
ప్రణుతింపగా సోమపానంబుగాగ
ప్రకటరాక్షసవీర పశుపలలముల



సకలభూతవ్రాత సంతృప్తిగాగ
విడువకసంగ్రామ విపులయజ్ఞంబు
గడునొప్పజేయురాఘవ సోమయాజి.!

(యుద్ధకాండము పుట 356)

ఇంతగా సాగదీసి రాబోవు రావరావణయుద్ధమును యజ్ఞముతో నుపమించుట యజన యాజనానిరతుడైన కవియొక్క వైదికనిష్ఠా ప్రలోభమేమో! వాల్మీకి రామాయణములో గూడ నిట్టిపోలిక వింతగా నేర్పరించినచో అనువాదాను క్రమణమే కాగలదు.

మాయాసీత తలవ్రేటునువిన్న రాఘవుడు మూర్ఛిల్లగా, లక్ష్మణుడు పరితపించుచూ నిర్ధనులుచేయు యత్నాలన్నీ విఫలమగుటనుగూర్చి, తమ కడగండ్లన్నీ రాజ్యమునువీడుటవలన కల్గిన లేమిడివల్ల నన్నట్లుగా పలవించును. చాలవిపులంగా అర్థసార్థక్యము, నిర్ధనుల నిరర్థకత్వము ఇందు నిరూపించబడింది. (యుద్ధకాండము- పుటలు 523-524) ఇది ఎంతవరకు మూలానుగుణమో! (ధనమార్జయ కాకుత్స! ధనమూలమిదంజగత్! అంతరం నాభిజానామి నిర్ధనస్య మృతస్యచ), సంస్కృత మూలానికి అనువాదమైనా, సీతారాముల సేవలో నిమగ్నుడై, మితభాషియైన లక్ష్మణుడు, రాముడు మూర్ఛిల్లినంత మాత్రమున అర్థ నిరర్థకతల పర్యవసానాన్ని గురించి ఉపన్యసించుట సహజంగా లేదు. రాజ్యమును పితృవాక్యాన్ని పాలించుటకై త్యజించినముని నిస్వార్థంతో, సేవానిరతితో వెంబడించిన ఇక్ష్వాకు వంశజుడైనలక్ష్మణుని నోటినుండి పేలవమైన యిట్టి బీదఅరుపులు వెల్వడునా?

రంగనాథరామాయణములో శ్రుతిమించిన శృంగార వర్ణన లేవీలేవు. కాని, నాగపాశబద్ధులైన రాఘవులను చూచి సీత శోకించునపుడు, సాముద్రికరీత్యా తన అంగసౌభాగ్యాన్ని, సులక్షణాల నెన్నికజేసి, లాక్షణికులైదువైయుండువన్న విషయాన్ని విస్తరించి, దానికి భిన్నంగా పరిస్థితు లున్నందుకు వాపోవును. ఈ సందర్భంలో తనకు దానుగా తనకచకుచాది వర్ణనము

లాక్షణికులు నిర్ధారించిన రీతినైనా, కవి సీతచే స్మరింపజేయడం ఒప్పుగాలేదు. (యుద్ధ కాండము- పుట 506) మూలానుగుణమైనను ఇట్టి వర్ణన యుచితముగా తోపదు.

ఒకరి రచనమునకు వేరొకరు తమ పేరు పెట్టించుకొనుట నేడు సర్వసాధారణముగా జరుగుచున్నది. జె. బి. యస్. హాల్డేన్ ఇండియాలో పెద్దపెద్ద సైన్టిస్టులు తమవద్ద కృషిచేస్తూ మేధావంతులైన సన్నకారు సైన్‌టిస్టులను వారి ప్రయోగాలను స్వప్రయోజనమునకై వినియోగించి తాము పేరు ప్రతిష్ఠలు సంపాదించుటను గర్హించెను. అనేకమంది రాజకీయ నాయకులు, తాము ప్రభుత్వము నెరపుచున్న కాలములో, తమ క్రింద పనిచేయుచున్న వారితో వ్యాసములు, ఉపన్యాసములు వ్రాయించుకొని వాటిని సంకలనపరచి తమపేర పుస్తకరూపమున ప్రకటించుకొన్న విషయము నాకు తెలుసును. కేంద్రంలో గాని, రాష్ట్రాలలో గాని మంత్రిపదవి లభ్యమైనంతమాత్రాన తమ కివ్వబడిన పరిపాలన శాఖలో పరిపూర్ణావగాహన వారికి కల్గిందని గాని, తమ క్రింద పనిచేయుచున్న ఉద్యోగుల అండదండలులేకుండా వారు జాతీయ,అంతర్జాతీయ రాష్ట్రీయస్థాయిల్లో అనేకసమస్యలపై చర్చలు ఉపన్యాసములు, వ్యాసములు తమ స్వశక్తితోనే చేయుచున్నారని గాని తలచుట పొరపాటు. విశ్వవిద్యాలయాలలో కూడ, ఆచార్యపదవి నధిష్ఠించువారు తమ వద్ద రిసెర్చి డిగ్రీలకై పనిచేస్తున్న వారిచేత తమకు కావలసిన పని చేయించుకొని, గ్రంథరచనకు తగిన సామగ్రి సేకరింపజేసి, రచన కూడ వారిచేతనే గావించి, కొద్ది తీసివేతలు, చేరికలతో తమ పేర గ్రంథములు ప్రచురించుకొనుటకూడ కద్దు. రాజకీయాలలోను, ప్రభుత్వములోను తలమున్కలగుచున్న వారికి గ్రంథరచన చేసే తీరిక, ఓపిక, సామర్థ్యము వారికెక్కడ కుదురును? అమెరికా అధ్యక్షులకు ఛాయా రచయితలు లేరా?

పూర్వపు ప్రభువులు కీర్తికాములు. యశస్సుకై కృతుల గొనుచుండిరి. గుళ్లు, గోపురములు కట్టించి, తటాకములు త్రవ్వించి, భూదానములుచేసి తమ పేర శాసనముల ప్రతిష్ఠించిరి. అట్టి వారలలో కొందరు కావ్యరచనల తమ పేర పెట్టించుకొని, ఆ విధముగా యశస్సు పొందదలచుట 'దుష్కర్మ' మనగాదు. కృతులుగొనుట, కృతులు తమ పేర వ్రాయించుకొనుట, తర తమ భేదములు గల యొక వ్యాపార సరళి. ఆశ్రితుడైన కవి రచించి ప్రభువు పేర కృతి యిచ్చి సంభావింపబడుట యొకటి; ఆశ్రయుని పేరనే కృతి రచించి తగిన సత్కారమును పొందుట మరి యొకటి. ఇటువంటి ఏర్పాట్లు లేవని చెప్పుట సాధ్యమా? నేడు మనము కళ్ళార చూచుట లేదా?

దుష్కరమైన రంగనాథ రామాయణ పరిష్కరణలో శ్రీ ప్రభాకర శాస్త్రిగారి కొరిగిన సత్కారమెట్టిది? రెడ్డిగారి అనుబంధ పీఠికలో పింగళివారితో మల్లంపల్లి వారితో పాటు వీరి కృషి స్మరింపబడుచే, ఆంధ్ర విశ్వవిద్యాలయము వారిచే నియమింపబడి చాకిరీ చేసిన గన్నవరపువారి కది కూడ దక్కలేదు. శ్రీ రెడ్డి గారు రచయిత లగుదురుగాక! ఆంధ్ర విశ్వవిద్యాలయ పరిషత్తుకు ఉపాధ్యక్షు లౌదురుగాక! ఆంగ్ల విమర్శనా పద్ధతులకు గల నిర్దుష్టతను ఆచరణలోని కనువదించలేని విద్వాంసులుగానే మిగిలి పోయిరి! గ్రంథ పరిష్కరణకు తగిన సదుపాయములు కల్పించలేకపోగా, మీదు మిక్కిలి శాస్త్రిగారిచేత ఆంధ్ర విశ్వవిద్యాలయ పరంగా ప్రతి ఫల శూన్యమైన యూడిగము చేయించుకొని, పీఠికలోను శాస్త్రిగారిపై నిగూఢంగా నారసాలు వదలి ఆ పండిత ప్రకాండుని చేత విపులమైన, విమర్శాత్మకమైన పీఠిక ఈ గొప్ప రచనకు లేకుండా చేయడమే కట్టమంచి వారి పర్యవేక్షణ క్రింద జరిగిన గ్రంథ ప్రచురణలో మిగిలినది! చాప చినిగి చదరైనట్లున్నదీ ప్రయత్న పర్యవసానము.

—o—

# లేఖ

[వేటూరివారు తమ మిత్రులగు శ్రీ చల్లా సూర్యనారాయణశాస్త్రి గారికి 1916 మార్చి నెలలో వ్రాసిన లేఖ యిది. ఛందస్సులో సాగినది. కార్డు కుడి చివరన కొంత చినిగినది. సేకరించి పంపినవారు డా॥ చల్లా రామచంద్రశాస్త్రిగారు – సం ॥]

చేరెమీ యుత్తరము బైలుదేరినాడ
కల్గె విఘ్న మొక్కటి. మూడునాల్గునాళ్ళ
దాకను ప్రయాణమగు వీలులేకపోయె
ఉండి తీరుదు మీయొద్ద పండుగునకు;

ముందొవెనుకనో సందేహమందవలదు
పరుగువారుచున్నది చూవె భావమెల్ల
నక్కడకె; ఇంకనేమి వ్రాయ(వలయు)నది?
ముందు రా రాక కుత్తరమం (దుకొనుడు);

అప్రయత్నముగా నిట్టు లతకరించె
(గా)! నియతితోడ వ్రాయు సంగతులు (కావు)
చిత్తగింపుడు-వలదు. మీ యుత్త (రమును)

వే॥ ప్రభాకరము.

# యోగవిషయము

## ఉపన్యాసము

—వేటూరి ప్రభాకరశాస్త్రి

[6-8-47 నాడు ప్రార్థనానంతరము గురుదేవు లొసగిన ఉపన్యాసమిది. ఈ ఉపన్యాస పాఠాన్ని సేకరించి దయతో మాకు అందజేసినవారు యోగమిత్రులు శ్రీ కొత్త వేంకటేశ్వరరావు గారు. వారికి మా కృతజ్ఞతలు— సం॥]

6-8-47 ఉదయము గుంటూరునుండి శ్రీ ఉన్నవ లక్ష్మినారాయణగారి వద్దనుండి శ్రీ గురుదేవుల కొక జాబు వచ్చినది. దానిలో రాబోవు స్వాతంత్ర్య దినోత్సవమునాడు వారందరూ ప్రార్థన జరుపుదురనియు, మీకూ పీలున్నచో నానాటికచటికి రావలసినదనియు. M. N. గారి కుమారుడు కూడా అపుడు ఉండినారు. వారుశ్రీ గురుదేవుల నిట్లడిగినారు. "ఏమండీ మీరు తీరిక గల్గించుకొని ఆ gathering నకు వచ్చెదరా"?

శ్రీవారి సమాధానము :- నేను కటిక్కని యిప్పుడే చెప్పటానికి సాధ్యముకాదు. యోచనచేసి చెబుతాను. గుంటూరులో ఇప్పుడేమి చేస్తారు?

మై. న. కుమారులు:-Independence course చేయదలచుకొన్నారు.

శ్రీ గురుదేవులు :- అసలు మనమొక లక్ష్యము సిద్ధించువఱకూ, ఆ లక్ష్యసిద్ధికై ప్రయత్నము చేయవలసినదే. లక్ష్యము సిద్ధించిన దానిని స్థిరముగా ననుభవించుటకై ప్రయత్నము చేయవలయును. అసలలాంటి కోర్కున్నదా?

మై. న. కుమారులు :- Masters Curses లోనే అటువంటిది ఉన్నదికదా!

శ్రీవారు :- Political view ప్రకారము Independence వస్తున్నది. యోగమార్గము ప్రకారము Independence నకు వేరు అర్థమున్నది. అది యింకా మనకు లభింపలేదు.

మై. న. కుమారులు :- మనమంతా పోయినా మ న త ర్వా త వా ం డ్ల యి నా స్థిరముగా నిలవడమునకు మార్గము చూపుటకు వీలఁటుందికదా! శ్రీవారు, ఒక్కరు నిలిచి సర్వము నిర్వహిస్తారనేట కదా చెప్పినది.

శ్రీవారు :- తప్పు! అలా అనుకోవడం చాలా తప్పు.

మై. న. కు. :- శ్రీ CVVవారువారి శిష్యులలో ఒక్కడే నిలుస్తాడనీ, అందఱూ పోతారని అన్నారుట కదా!

శ్రీవారు :- మాస్టరుగారు మొట్టమొదట డిసైపుల్సును ఇనిషియేట్ చేసినప్పుడు వారు అందఱు stand అవుతారనే కాని, పోతారని కాదు చేర్చింది. ఒకనాడు మేమందఱము అదుగో ఇదుగో పర్ఫెక్షన్ అని అనుకొంటూ ఏదో ఉబలాటపడుతూ ఉండగా సచ్చిదానంద స్వాములవారు శ్రీ మాస్టరుగారి దగ్గఱ

నుండి వచ్చి ఇట్లనిరి. "ఒరే మీరేదో అనుకొంటు న్నారు. తాను చేర్చిన డిసైపుల్స్‌లో నూటికి పదో వంతైనా పర్ఫెక్షన్ వేళకు నిలుస్తారా? నిలువవలె గదా అంటున్నారురా: ఇంకెంత కాలం గడవవలెనో! ఎన్నిమార్పులు జరగవలెనో!" అనిరి. అప్పుడు నేనెంతో కలవరపడితిని. ఆనాడో మర్నాడో శ్రీవారు ఉపన్యాసములో ఇట్లు చెప్పిరి.

'ఇంతవఱకూ నేను మీకేమి జబ్బుచేసినా మందు పుచ్చుకోవద్దనీ, నాకు టెల్లిగ్రామో, జాబో వ్రాయవలసి నదనీ తెలిపితిని. ఇక నేనట్లు మీకు ట్రీట్మెంటు చేయ వీలుండదు. మీ మంచిచెడ్డలు మీరే అనుభవిస్తూ చక్క దిద్దుకోవలసిందే నే నిచ్చేదంతా ఇవ్వడం అయింది. నా మాటలన్నీ అవిశ్వాస్యములుగా అబద్ధములుగా కూడా మీకు తోచే రోజులు వస్తవి. మందులే పుచ్చు కొంటారో మాకులే పుచ్చుకుంటారో ఏమి చేస్తారో మీ మనోనిబ్బరము ప్రకారము చేయండి- ఏమయినా రాబోయే ఆపత్సముద్రమును దాటుటకు మీకు నామీద నిర్వికల్పప్రేమ భక్తివిశ్వాసములు నావగా ఉండును. మీ మనస్సు నాపై నిశ్చల విశ్వాసముతో ఉండగల్గు టకు నేడు కోర్సు ఇస్తున్నాను. ఇది చేయండి. రాబోయే చీకాకులలో నన్ను మీరు నిందించే స్థితి కూడా ఏర్పడవచ్చును మీరేమి చేసినా నావల్ల మీకు మేలే కలుగుతుంది కాని కీడు కలుగదు. నేను విశ్వా మిత్రుడను గాను దూర్వాసుడను గాను వర్తింపను. ఈ యోగమార్గంలో శపించడం అనేది ఉండనే ఉండదు. అంతా అనుగ్రహించడమే. ఈ యోగంలో Destructive quality పనిచేయదు.creative qualityయే పనిచేస్తుంది. ఈయోగంలోని వారంతా ఋశ్యశృంగులుగా ఉండవలెను గాని, దుర్వాసులుగాను విశ్వామిత్రులు గాను ఉండరాదు. ఇక మీద ఈ యోగంలో చేరినవారిలో ఎవరో కొందఱు Perfection కాలందాకా కంటిన్యూ కాలేకపోవడం మరణించడం సంభవిస్తుంది. వారెవరెవరో నేను చెప్పలేను, అది నాకే తెలియ నియ్యలేదు. అలిస్టు కావలెనని MTAను అడిగినాను." అలిస్టు ఇయ్యను, నీవు దుఃఖ పడుదువు. వారిని నీ విపుడు నిలుపగల్గిన స్థితి ఉంటే తెలియగోరవచ్చును. అది ఇప్పుడు అసాధ్యము. కాన నీవు తెలిసికోగోరవద్దు. అని బదులు వచ్చినది.' అని చెప్పిరి.

తర్వాత జరిగిన సందర్భములను బట్టి చూడగా ఆలాగు శరీరం విడిచిన వారిలో ముఖ్యులు వారే అయినారు. ఇంకెందఱో అయినారు. వారన్నట్టుగానే అనేకులభావాలు అనేక విధాలుగా మారను మారినవి. వారి శిష్యులలో ఒకరే నిలుస్తారనీ, తక్కిన వారం దఱూ శరీరం విడుస్తారని వారు తలచినారని కాని అట్లు చెప్పిరని గాని- అనుకొనేవాళ్ళు విషయమేమీ ఎఱుగని అసందర్భవాదులు.

రెన్నాళ్ళలో తాను ఫిజికల్ విడవడం జరుగుతుంద నగా రాత్రి 10 గంటలవేళ వో॥ నరసింహం గారిని పిలిపించి శ్రీవారు ఇట్లు చెప్పిరట. "నరసింహం!ఆరం భంలో ఈ యోగసిద్ధి Sixteen లో జరుగుతుంది. నీవొక్కడవు' అని. దీనిబట్టి ఈ యోగసిద్ధి పదు నాఱుగురు శిష్యులకు కలిగిన తర్వాతనే లోకానికి వెల్లడి అవుతుందని తెలుస్తున్నది మరీ ఇంకొక సందర్భంలో వారు అన్నది. 'నేను ఇన్‌సియేషన్ చేసిన శిష్యులలో ఒక్కడైనా కడతేరితే లోకమంతా కడతేరినట్లే. ఆలాగు ఒక్కడైనా కడతేరే దెప్పుడా అని చూస్తు న్నాను. నేనిక ఈ యోగసిద్ధి నంతనూ మీ ద్వారానే లోకానికి వెల్లడింపవలసియున్నాను గాని నేనుగా చేసే దేమీ ఉండదు. నే చేసేదంతా మీ ద్వారానే' అన్నారు. ఈ మాటకు అందఱు చచ్చిపోతారు ఒక్కడు నిలు స్తాడు అని కాదు అర్థము. శ్రీస్వాములవారితో పదింట ఒకపాలైనా నిలుస్తారా? నిలువవలె గదా అని అను తాపపడ్డ సందర్భం అందఱూ జీవించియున్న కాలం. అది 1921 అని జ్ఞాపకం. దానికి నాకిటీవల శాస్త్రీయ మయిన సమన్వయము తోచి ఆశ్చర్యము గొల్పినది. అదేమిటంటే ఒకటి పదింటిదాకా రేడియేట్ చేయ గలదు. సూఱు వేయింటిదాకా రేడియేట్ చేయగలదు.

వేయి సర్కంఫరెన్సు అయితే దాని సెంటరు నూటు- వెయ్యి సర్కంపరెన్సుగా ఫారం చేయడానికి సెంటరులో నూటు ఉండి తీరవలెను. మాస్టరుగారి శిష్యులు ఇప్పుడు కొందఱు శరీరం విడిచినా మళ్ళీ శరీరంతో అందఱూ నిలువగల్గుతారంటే శరీరంలో పదింట ఒకపాలు ఉంటేనే నిలువగల్గుతారు గదా! ఫస్టున Stand అయ్యేవారు 16 గురు అంటే ఆ తర్వాతవారూ మఱికొంద ఱుంటారన్న మాటే! ఏమయినా నూట్గురో, డభ్భై అయిదుగురో అయినా పర్ఫెక్షన్ నాటికి డిసైపుల్సు ఉండితీరాలి. వారు లోకము నంతను నిలువరింపగలగాలి.

అసలు ఇండిపెండెన్సుకు అర్థము - "ఇన్, డీప్, ఎండ్, ఆన్, సీ" అనగా లోపలికి లోపలికి చూచుకొంటూ ఫోయి బాటమ్‌లో ఈశ్వరుని గుర్తించడము.

ఆ స్థితిని పొందడమునకు గాను మన దృష్టిని అంతనూ సెంటరుకు ఫోకస్ చేసుకొంటూ పోవలయునే కాని అక్కడా ఇక్కడా gathering లేమిటి. సెంటరు ఫారము అయిన తర్వాత విశ్వమంతా stand అయినట్లే. అప్పుడు అనేక వ్యవహారములకు అనేక సెంటర్లు ఫారం కావలసిఉన్నవి. బాపట్లలోనూ గుంటూరులోనూ, రేపల్లెలోనూ మీటవుదామని సత్యనారాయణ ప్రభృతులు జాబు వ్రాస్తే నేను రానని సెంటరుకే వెడతానని బదులు వ్రాస్తిని. సెంటరు అయిన కుంభకోణము మీదికి దృష్టిని కేంద్రీకరింప జేయకుండా ఇదేమిటి. ఏ ఒకడయినా సర్కంఫరెన్సు నుండి సెంటరును బోర్ చేసుకుంటూ పోయి చూడగల్గితే ఇంకా తనతోపాటు ముగ్గుర్ని కూడా చేర్చుకొని నలుగురయి సెంటరును ఫిక్సు చేయగల్గుతారు. ఆనలుగురు నాల్గు నాలుగులను 16 గురను సెంటరుకు చేర్చుకోవడంలో నాలుగుచట్లూ కుండలినికి ఫారమయి ఫోర్తు డైమెన్షన్ వర్కు సాగి శిష్యులందఱు, తర్వాత లోకమంతా, ఉద్ధారం పొందడం జరుగుతుందనుకొంటాను

దీని కించుక వివరణము :- సృష్టి, స్థితి, సంహారములు; భూత, వర్తమాన, భవిష్యత్తులు; ధర్మార్థ కామములు; ధాతువర్గ వృక్షవర్గ జంతువర్గములు: అడ్డం, దిగటం, నిలువు అనే మూడు డైమెన్షన్‌లు దాటి నాల్గవ డైమెన్షన్ నిత్యత, అనంతత, మోక్షము, మానవవర్గము, సర్వత అనేవి పరిపూర్తి చెంది ప్రణవ స్వరూపమయిన అకార ఉకార మకారములు సి వి.వి అయి ఇంకో అర్థమాత్రకాలము ఇంకో డిసైపిల్ నామాక్షరము కలియడమే ఫోర్తు డైమెన్షన్ వర్కు పూర్తి కావడము. ఇప్పుడు ఫోర్తు డైమెన్షన్ వర్కు జరుగుతూనే ఉన్నది గానిఅది ఇంకా వ్యక్తత పొందలేదు.

అసలు Motherనే మా యావరణ మావరించిందంటే మనమాట సంగతేమిటి? ఆమెగారు మద్రాసులో ఉందామనుకోవడమేమిటి? ఈ భావంతో ఉంటే ఆమెగారికి శాంతి కల్గునా? P. N. ఇంటికి పోయేటప్పటికే ఆయనకామెతో మాట్లాడుటకు సాధ్యముకాకపోయినది. నారాయణ అయ్యర్ ఇంటికి పోతే ఆయనకు జబ్బు. వీటన్నింటితో నామెగారక్కడ కొన్ని గంటలకంటే ఉండలేక కుంభకోణమునకు వెళ్ళేట్లు చేయగల్గిన శక్తి ఎవరిది? మాస్టరు శక్తి కదా! అట్టి శక్తిని గుర్తించకుండా. సరిగా దాని ననువర్తించక ఆ కుర్రవాణ్ణి (భృక్తను) హాస్పిటలులో చేర్చడమేమిటి? యోగమేమైపోయినట్టు? ఆమెగారే షేక్ అయితే ఇతరుల మాటలు చెప్పడమెందుకూ!

సెంటరును, తన్ను సరిగా రియలైజు చేసుకోవడమునకు సరియగు స్థితిలో నుండడము కోసమే కొన్ని కొన్ని విషయాలలో కొందఱి కొందఱినిని గురించి తొందరపడింది. సమయము వచ్చినప్పుడు అదే అర్థమవుతుంది.

మదర్ పుట్టిన స్థలం మదరాసు పెళ్ళి జరిగిన దీవూళ్ళో ఈ యింటిలో; కాపురము చేసినది కుంభకోణములో; కుంభకోణమును సెంటరుగా ఒక సర్కిల్‌ను గీస్తే ఈ వూరూ మదరాసూ సరిగా 150 మైళ్ళ

దూరములో నున్నవి. నన్ను నేకులు బాపట్ల రమ్మన్నా రేపల్లె రమ్మన్నా నేనెక్కడికి పోకుండా- కుంభకోణమునకు పోతే పోవలెను. లేదా నేనున్నచోటనే ఉండి ఏదైనా పొందవలె ననే నమ్మకముతో నున్నవాడిని. ఈ మూడుచోట్లా ఆమె పుట్టిన, పెళ్ళి చేసుకొన్న, కాపురము చేసుకొన్న చోట్లు కాబట్టి యీ అవిట్టమునకు ఒక పూట మదరాసులో రెండోపూట ఇక్కడా ఉండి నాను. వచ్చే అవిట్టమునకు కుంభకోణమునకు వెళ్ళు తాను. ఏదైనా! ఎవరైనా పర్ఫెక్షను పొందినవాళ్ళను చూడడమనేది మొట్టమొదట కుంభకోణములోనే అని నేననుకొంటున్నాను.

అందుకే మాస్టరుగారు కుంభకోణమునుగూర్చి ఒక వైపు మలస్థానములు ఇంకోవైపు మూత్రస్థానము ఉన్న ఒక లోలెవల్‌లో కుంభకోణంలో బ్రహ్మము జోస్టు ఫాన్ రిపేరు చేస్తూ కూర్చున్నదంటే దీన్ని ఎవరయినా నమ్ముతారా" అని నరసింహం గారితో అ<రి. దాన్ని శ్రీ నరసింహం గారొకప్పుడు చెప్పగా తోడ్తో నాకు వింత అర్థం గోచరించినది. దాని నప్పుడే వెల్లడించితిని. మీ దగ్గఱ కూడా అది ఇదివఱకే చెప్పి తిని. అది ఆశ్చర్యము గొల్పే విషయము కాదా?

అప్పటికి కాస్మొస్‌లో అనేకములగు మార్పులు కలిగి తీరుతవి. అంటే ఇదివఱకు బ్రిటిష్ వాళ్ళేవో కొన్నిలాస్‌ను ఏర్పఱచియున్నారు. రేపి డొమినియన్ అధికారము మన చేతికిరాగానే జవ్హర్‌లాల్ ప్రధానిగా మన కనుగుణములగు క్రొత్త శాసనముల నేర్పాటు చేయించపోతున్నాడు. అందరికీ సమానత్వం కల్గించు తాడు. అట్లా ఏ ఒక్కడు Stand అయినా వాడొ క్కడే ఆ పదమున ఊగులాడే వాడుగా ఉండడు. లోకము నంతనూ stand చేయించగల శక్తి కలవాడుగా ఉంటాడు. క్రొత్త శాసనము లెట్లా వస్తువ్నాయి? బ్రిటీషువా రూరకే మన కిస్తున్నారా? Independence ను మన స్వాతంత్ర్యేచ్ఛ అనే ప్రెషరున కాగలేక ఇస్తున్నారు. అట్లే ఈశ్వరుడు కూడా మన వత్తిడికి ఆగలేక మనకిన్ని శక్తులూ కలి గేటట్లు చేస్తాడు.

అధికార ప్రదానమీ 15 నాటికే గాని పూర్తిగా రాజ్యాంగపు అన్ని శక్తులూ మనకు హస్తగతమయ్యే టప్పటికి ఆరు మాసాలైనా పడుతుంది. అంతవఱకు మనమూ పాద్యమినుండి అమావాస్యదాకా డిసెండయి అక్కడినుండి ఒక్కొక్క అణువుగా రైస్ అయి పూర్ణనికి కొంత కొంతగా గుర్తిస్తూ 48 మార్చి నాటికి ఆయిల్ పిక్చరును గుర్తిచడమున కాధారమగు పాద ములనయినా గుర్తించి తీరుతామనే నమ్మకంతో ఉన్నాను. 47 ఆఖరు క్వార్టరు 48 ఫస్టు క్వార్టరులలో సీ రియలైజేషన్ అయి తీరవలెను.

stand అయినవాడూ మనమందఱమూ అయి మనకనుగుణముగా కాస్మిక్ లాస్‌ను తయారు చేసుకో వలెను. అంతవరకూ మనకిచ్చిన చీటీ ప్రకారము మనము పోతూ ఉండవలసినదే. మాస్టరుడిసైపిల్‌సులో 1/10 అయినా Stand అయితే- సెంటరు ఫిక్సయిన తర్వాత సర్కుంఫరెన్సులో ఎన్నో సెంటర్లు ఫారమవు తవి. అట్లా ఫారం అయ్యే సెంటర్లలో గుంటూరు కూడా ఒక సెంటరు కావచ్చును. ఆలా ఫారమయ్యే సెంటర్లన్నీ మళ్ళీ సర్కుంఫరెన్సులను ఫారము చేసు కొంటవి. సెంటరును రేడియేటు చేస్తుంది. అట్టి దాని కిది సహాయభూతము కావచ్చు.

ఆసలింతకూ సరకుండవలెను గదా! ఆ సరకుండే టట్లుగా తయ్యారయేటందుకు ప్రయత్నం చేయాలి గదా! ఆ ప్రయత్నంలో వుందాము — *

# Childhood Adventures - Custard Apple

Translation: VETURI ANJANEYULU Telugu Original: VETURI PRABHAKARA SASTRI

[Adventures of childhood is a novel theme which few of the contemporaries of Prabhakara sastri had adopted for writing simple poetry bringingout vividly the child psychology precociousness,the innocent strategems they adopt to escapethe attention of their elders, and the spirit of adventure that characterise their activities. The story about the custard apple (Seetaphal) brings out graphically some of these aspects.

There is another longish poetical work by him which bears the same title - "chinna nati cheshtalu" (Adventures of childhood) which was published in the from of a small booklet.

Here is an English rendering of the story that centres round the custard-apple—Tr.]

One custard apple for a pice
With mother's consent, we brothers
bought one apiece, and ate them.
"Mother ! I crave still for its sweetnees".

"Just a pice will do; the vender is selling
Mother ! please buy one more for me.
May be, the fruits will all he sold, sold and sold
Don't delay".

"The custard apple will lead to phlegm,
You will catch cold and fever,
I won't buy": so saying my mother
chided me: she did not buy it
and my desire was unfulfilled.

There was a not a pice in my hand.
Nothing could be done.
I could not suppress, the craving for its sweetnees.
I filled my two pockets with the seeds of the fruit
to play with them.

Seeds, seeds, and no pulp whatsoever.
There was disgust as to what for were the seeds.
Even so, sweetness of the fruit lingered in memory.
How to throw them away ; how to eat them either.

I broke a seed, thinking that the kennel might be sweet.
But it was neither 'badam', apricot nor prune
I took a bite, I spat it out
What a distaste; it was nauseating.

I got annoyed with the seeds.
Threw them helter - skelter.
Only one seed remained in hand
and it created an idea;

The sweet taste of the custard apple
of that day made the mouth water :
the disgust and anger disappeared,
and some other thought emerged.

I thought and thought
with the custard apple seed in hand
it occured to me that in a trice
the seed gave way and
a seedling sprouted out of it,

That the plant had become a tree,
that it flowered, bore fruit and
its ripe fruits I ate to my fill
and tempted my mother ;
"here it is; have it"

Then it self I took the seed
and as if my desire bore fruit,
I sowed it in a safe spot
in the backyard.

When I washed my face, when I washed my feet
when I gargled, it was all in the seed-bed
The sown spot had become
as dear to me as my life.

Verily the seed had sprouted;
I had fathered it.
I began tending the tender plant
like I would an infant.

Turning the earth, manuring
mixing the soil, watering the plant
and getting delight from
the plant that had began to grow.

May be two years were past,
The plant had grown;
put ont tender buds.
I was hopping around the house
hurrahing that it would bear fruit.

Many a flower had fallen ;
I was full of misgivings
that the fruit would not emerge.
At last a tiny fruit appeared
for me to nourish it daily with sweet water.

I fed the tree with goat - manure
and sweet water; I tore off
weedy creepers and threw them away
turned the earth without cutting the roots.
The tiny fruit began to grow well gradually.

The fruit was bigger then the one
that I ate at a cost of a pice.
I examined it daily whether it was
green or ripe; and announced
aloud that I would eat that fruit.

My mother saw it: "my son!
with your lucky had the custard apple tree
bore fruit; don't pluck it
it is green and unripe; let it grow
till it ripens"

"When it grows, its pulp - bound seed spaces
widen and become creammed; and
as it ripens, the fruit cracks
and after keeping it for a day
to make it soft; if it is eaten
the next day it would be wondrous sweet".

"Don't pluck the fruit without telling me
the fruit and your desire will
in the end be futile; the ripened
fruit will be delicious; all the brothers
can eat it then,"

Believing my mother I waited
for some days; it remained unripe
without getting split; I could not wait
any longer; boldly I gave it
a knife's thrust.

I told my mother that the fruit had split.
She believed that I told the truth;
"Probably it is ripe, you pluck it then"
she said : I plucked the unripe
fruit which was as hard as wood.

A green fruit, a knife cut;
it has not creviced; why have you
done like this; my son!
it is a useless fruit, I shall throw
it away" said my mother.
"It is my fruit, give it to me"
I said; fie she said and thrust me away.

Without my knowing, she had hidden
The fruit; for finding it I tried all
Possible ways; after searchings and
searching I found it thrust in the
rice bran basket

"Your hidding place has been found"
I said "What an obsession? How
did you find it? it may possibly
become soft because of heat;
don't open and look at it; you stupid !

So said my mother; she did not
realise my haste; she did not
buy the fruit for a pice then;
she does not allow me to eat my fruit,
Parents are a great nuisance to children.

I saw it the next day; it did not
soften; I waited for a half - day
and opened to find it the same;
I waited for some time and opend
it again; however much I waited
it remained the same,
What else is to be done?

I cut a part of the fruit to eat :
it was raw and sour with not an
iota of taste; I threw it away
with red - eyed anger.
My mother noticed calmly
my detestable deed.

"It would have ripened
you have spoiled it; how do you
get on in life if you are in
such haste?
fie; fie; how useless you have become;
you have only to cry
what else can you do"

In this way she got annoyed
and vexed with me; ashamed
I cried bitterly; it was only
my posession that I had wasted
was the pride that loomed large
before me.

Humiliation on one side
pride on the other
unbearable grief withal
that the fruit was spoilt,
these three strands of grief
made my agony and my
bearing unbearable.

That day my father had heard it all.
"useless fellow, you did the wrong thing"
Even before he completed his words,
with anger I said; "It is my plant,
my fruit, I do what I will".
"I have lost my fruit, the loss is only mine;
it is no one's concern," reved I amiss.
"So it is, you stupid; it is only
your tree; but you better know
that you sowed it in my ground".
"Being my son, you are mine;
even so, if any one claims
anything as his; to deserve it
he should have the ability
to safeguard it well; the one
who lacks that ability has no
buisiness to say that a thing is his".
In this manner my father admonished
me slowly and softly without
hurting me, I felt ashmed all
because of the accursed custard apple.
Thinking to atone for my mistake
by study, I opened my lessons at
the lamp light; being good at
Telugu poetry I recited Vemana's
poem many a time.
"Viswadabhirama, Oh vema; listen;
don't do anything in anger,
done in haste it turns into bitterness.
If an unripe fruit is made to fall
does it turnout to be a ripe one"?

"What are you reading? Is it Vemana's poem?
Your study is unavailing; you have
made it meaningless, if you are
intelligent, will you do as you have done?"
so saying my father spelt out the
meaning of the poem.

"I think there is one defect in the poem
father ! may I ask about it?" I said :
"Yes, go ahead" said he.

"For the saw that anything done in haste
will turnout to be bitter, the example
that 'a green fruit, will it become
ripe' is meet."

"What is the illustration for the
maxim 'don't do anything in anger'?
It is not in the poem - that is the defect.
Probably to correct me this poem
has come in today's lesson" I said.

"The disgust that you have spoiled
the custard apple has gone
because this question has occured to you :
May be you will earn renown as a scholar
My son ! study the classics well".

"Discover the merits and defects
in classics; like this even in studies
you may be hasty; always bear
in mind the episode of the custard apple.

My boy! with sound intellect prosper well in life"
"should you become a poet, compose
a poem on this episode; similarly
about the defect in Vemana's poem
that 'in anger one should not act'
support it by a suitable story".

How my father's blessings of that day
have borne fruit I cannot say :
but the custard apple tree that
I planted then has been yielding
many fruits even to this day.

# నాచన సోమనాథుని ఉత్తరహరివంశము-సవ్యాఖ్యానము

—వేటూరి ప్రభాకరశాస్త్రి

[వెనుకటి సంచిక తరువాయి]

సోముని ఉత్తర హరివంశమునకు శ్రీ ప్రభాకరులు తమ చివరి రోజులలో గచ్ఛదాఖ్యవ్యాఖ్య రచించుట కారంభించిరి. నాలుగాశ్వాసములకు వ్రాసిరి. పూర్తికాక మునుపే తనువు చాలించిరి. అదియువారు సరిచూచుకొని అచ్చుకి సిద్ధము చేసిన ప్రతికాదు. అయినా ప్రామాణికమైన రచన యగుట చేత దానిని ఉన్నదున్నట్లే ప్రకటించవలెనని సంకల్పించితిమి. దానిని చదివి జీర్ణించుకొని అ అంశములనే జోడించుకొని కూర్చిన మరొకరి రచనతో చేర్చి ఆ వ్యాఖ్యను ఆవిష్కరించుట మాకు సమ్మతము కాలేదు. అందుకే ఈ నిర్ణయమిట్లు తీసికొంటిమి. ఎచ్చటనేని చేర్చ గలగిన విషయమున్నచో దానిని స్పష్టముగా తొట్టె బ్రాకెట్లలో [—] సూచింపవలెనని తలచితిమి.

ఇందు శ్రీ ప్రభాకరుల రచన యథాతథముగ ప్రకటింపబడినది. వారి వ్యాఖ్య లేని తావున గాని, ఉన్న తావున గాని పండితు లితరులు చేయి చేసుకొన్నప్పుడు ఆ రచన యొక్క ఆవిష్కార మెట్లుండునో సూచించుటకును ఇందు రెండు మూడు పద్యములకు యత్నమున్నది· [బ్రాకెట్లలోని విషయము]. ఈ యత్న మావశ్యకము కాదనియే మా తలపు. ఆయినను అభిప్రాయ మెరుగుటకై ఈ సంచికలో వాటి నిట్లు ముద్రించితిమి! పండితాభిప్రాయ మెరిగి ముద్రణమున ఉచితమగు విధానము ననుసరించగలము. —సం॥]

వ॥ దేవా! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

క॥ హరివంశ ప్రథమ కథాం
తరమునఁ గల వింత లెల్లఁ దప్పక మదిలోఁ
దిరమయ్యెఁ గదా మీఁదట
నరవర! యేకథ లొకో వినం బ్రియ మనుడున్. 3

వ్యా॥ హరివంశ ప్రథమ కథ = హరివంశ ప్రథమ భాగము.

[నరవర = ఓ రాజా!, హరివంశ....రమునన్ హరివంశ = హరివంశమను పురాణము నందలి; ప్రథమకథా = పూర్వభాగము యొక్క; అంతరమునన్ = మధ్య; కలవింతలు = కల చోద్యములు; ఎల్లన్ = అన్నియును తప్పక; మదిలోన్ = మనస్సు నందు; తిరము = స్థిరము; అయ్యెన్ కదా = అయ్యెను గదా; మీఁదటన్ = అటు తరువాత, వినన్ = వినుటకు; ఏ కథ లొకో = ఏ కథలో కదా; ప్రియము = ఇష్టము; అనుడున్ = అనఁగా.

తా॥ ఓ జనమేజయ మహారాజా! హరివంశ పూర్వభాగమునందుఁ గల చోద్యము లన్నియు నీవు వింటివికదా! ఇకఁపై నే కథలను వినఁదలఁతువు?]

కం॥ జనమేజయుఁ డిట్లను న
మ్మునితో; బలదేవులావు మును విని మఱియుం
దనియదు మది; ముద మొదవఁగ
వినఁ గోరెడుఁ; జెప్పవే వివేకనిధానా! 4

వ్యా॥ 'తనియదు, వినఁగోరెడున్' అను రెండు క్రియలకును కర్త మది = మనస్సు.

[జనమేజయుఁడు = జనమేజయమహారాజు; ఆ మునితో = ఆ వైశంపాయన మహర్షితో; ఇట్లు = ఈ విధమున; అనున్ = పలుకును-వివేకనిధానా! = వివేకమునకు నెలవయినవాఁడా!; మును = మునుపు; బలదేవులావు = బలరాముని యొక్క పరాక్రమమును గూర్చి, విని, మఱియున్ = ఇంకను; మది = నా మనస్సు; తనియదు = తృప్తి చెందదు; ముదము = సంతోషము; ఒదవఁగన్ = కలుగునట్లుగా; వినన్ = వినుటకు; కోరెడున్ = కోరుచున్నది (మది కర్త); చెప్పవే = చెప్పుము.

తా॥ అందులకు జనమేజయుఁడు వైశంపాయనమునితో నిట్లు పలికెను. 'స్వామీ! పూర్వము బలరాముని పరాక్రమమును గూర్చి వినియు నా మనస్సు తృప్తిని జెందలేదు. ఆ విషయమును గూర్చి యింకను నా మనస్సు విన నిష్టపడుచున్నది దయచేసి చెప్పుము.

విశే॥ చెప్పుము + ఏ—చెప్పవే.

సూ:- ప్రార్థనాదులం దేదాదు లనుప్రయుక్తంబు లగు. ఏదాదు లనుప్రయుక్తంబు లగునపుడు ముజ్జునకు వుజీ; రుజీయగు.]

కం॥ ఘనబలుఁ; డుదగ్రతేజుం
డనతుఁ[1] డనంతుఁ డనవిందు మాదిమకథలం (డనఘు[1])
దనుటయు వైశంపాయన
మునిపతి భూపాలచంద్రమున కిట్లనియెన్. 5

వ్యా॥ అనతుఁడు = నతుఁడు గానివాఁడు. ఒంగనివాఁడు.

[ఆదిమ కథలందున్ = పూర్వకథలయందు; అనంతుఁడు = ఆదిశేషుని యవతారమయిన బలరాముఁడు; ఘనబలుఁడు = గొప్పబలము కలవాఁడు; ఉదగ్రతేజుఁడు = భయంకరమైన తేజస్సు కలవాఁడు; అనతుఁడు = ఒంగనివాఁడు; అనన్; విందుము = వినుచున్నాము; అనుటయున్ = అని పలుకఁగా, వైశంపాయన మునిపతి = వైశంపాయన మహర్షి; భూపాలచంద్రమునకున్ = రాజశ్రేష్ఠుఁడగు జనమేజయునకు; ఇట్లు = ఈ విధమున; అనియెన్ = పలికెను.

తా॥ 'ఆదిశేషుని యవతారమయిన బలరాముఁడు గొప్ప పరాక్రమము కలవాఁడనియు, భయంకరమయిన తేజస్సు గలవాఁడనియు, దేనికిని లొంగనివాఁ డనియు నాదిమకథలందు విందుము.' అనఁగా జనమేజయునితో వైశంపాయనముని యిట్లు పలికెను.

విశే॥ ఇందలి రెండవ పాదమున 'అనతుఁ' డనుట 'కనఘుఁ' డని యొక పాఠాంతరముకలదు (అనఘుఁడు = పాపములు లేనివాఁడు). 'అనతుఁ డనంతుఁ డన విందుము' అనుచో సోముని శబ్దాలంకార ప్రియత తెల్లమగుచున్నది.]

శా॥ పాతాళాధిపుఁడైన శేషుఁడె ప్రలంబఘ్నుండు, నారాయణ
ప్రీతింబుట్టిన శంకరుం డని జనుల్ పేర్కొన్నచో నంధకో
ద్భూత స్నేహముఁ గామపాలతయుఁ దప్పుం, దప్పుగా కేమి వి
ఖ్యాతిం బొందఁడె పాండురాంగ మహిమన్ హాలాహల స్వీకృతిన్.     6

వ్యా॥ శ్రీమన్నారాయణుని మీఁది ప్రీతిచే శ్రీ పరమశివుఁడే శేషుఁడై యవతరించి యా నారాయణునికి శయ్యాభావము దాల్చెననియు, నాశేషుఁడే మరల బలరాముఁడై యవతరించి సోదరతచే శ్రీకృష్ణమూర్తి నుపచరించెననియు జనులు పేర్కొందురేని; అట్లు పేర్కొనుటకు, అంధకస్నేహము, కామపాలత్వము, బాధకము లగును. ఈ రెండు బాధకము లయిననేమి పాండురాంగమహిమ. హాలాహలస్వీకృతి యన్నవి రెండు (సమానధర్మములు) సాధకములున్నవి గావా? అంధకోద్భూత స్నేహము - అంధకాసురునం దుద్భూతమైన స్నేహము, అంధకుల (యాదవులలో నొకతెగవారు, వారి కంధకుఁడు మూలపురుషుఁడు) యెడ నుద్భూతమైన స్నేహము నని రెండర్థములు శివుఁడే బలరాముఁ డనుట కీ యంధకోద్భూత స్నేహము (అంధకాసురునెడ నుద్భూతమైన స్నేహముగలవాఁడను నర్థముచొప్పున బాధకము. అట్లే కామపాలతయును. శివుఁడు కామధ్వంసిగాన కాముని పాలించు వాఁడు అను నర్థము చొప్పున బాధకము ఇక్కడ శ్లేషచేఁ బయి రెండు పదములు శివ బలరాముల యైక్యము చెఱచినవి. బలరామునకు కామపాలుఁడని పేరు. "కామపాలో హలాయుధః" అమరము [స్వ 23] [కామం స్మరం పాలయతి ఆత్మజత్వా త్కామపాలః, కొమారుఁడగుట వలన మన్మథునిఁ బాలించువాఁడు] అని వ్యుత్పత్తి. జన్మము మారినప్పు డెవ్వనికిఁగాని పోలికలు కొన్ని సరిపోలునుగాని అన్నియును సరిపోలవనుట లోకప్రసిద్ధము. ఆ చొప్పున శివుని ధర్మములలో అంధకస్నేహ కామపాలతలు తప్పినఁదప్పినవి గాని పాండురాంగమహిమ, హాలాహలస్వీకృతి యను ధర్మములు పొసఁగియున్నవి పాండురాంగ మహిమన్ = తెల్లనిమేని మహత్త్వముచే (శివబలరాము లిద్దరును దెల్లని మేనువారేకాన) పొసగినది. హాలాహల స్వీకృతిన్ = విషము నారగించుటచే (హాలాహలములను = మద్యమును, నాఁగటిని స్వీకరించుటచే) [శివబలరామ

లిద్దరికిని] పొసఁగినదిగదా! ఇక్కడ శ్లేషచే నొకపదమే శివబలరాముల కైక్యము కూర్చినది. సంస్కృత మూలమున శేషుఁడే బలరాముఁడయ్యెనని కలదుగాని వారిర్వురు శంకరావతారపురుషు లని స్పష్టముగా లేదు.

"అనంతం యం విదుర్నాగ మాదిదేవం మహౌజసమ్" అని మాత్రముకలదు. మహాదేవపదము శివపరముగా నిఘంటువులం దున్నది. బలరాముఁడు విష్ణ్వవతారమని యెల్లపురాణములును; సంస్కృతమూల శ్లోకము లీక్రిందివి యిక్కడ జూడఁదగినవి.

'అనంతం యం విదుర్నాగ
మాదిదేవం మహౌజసమ్
పురాణే నాగరాజోసౌ
కథ్యతే ధరణీధరః
శేషస్తేజోనిధిః శ్రీమాన్
అకంప్యః పురుషోత్తమః'

పయి పద్యకల్పనము వట్టి కవితాకల్పనమే కాఁబోలును. దానికి 'అంధకస్నేహ, కామ పాల, హాలాహలస్వీకృతి' పదములు స్ఫోరకము కాఁబోలును ఇం దలంకారము [శ్లేషానుప్రాణిత న్యూనాభేద రూపకము] ఇందును కవి హరిహరుల సామరస్యమును ప్రతిష్ఠాపింపఁ దలఁపుగొన్నాఁడు.

[పాతాళఆధిపుఁడు = పాతాళలోకమున కధిపతి., ఐన శేషుఁడె := అగు నాదిశేషుండే; ప్రలంబఘ్నుండు = బలరాముఁడు (ప్రలంబుఁడను రాక్షసుని జంపినవాఁడు); నారాయణ ప్రీతిన్ = శ్రీమన్నారాయణునిమీఁది ప్రీతిచే; పుట్టిన శంకరుఁడు = పుట్టినటువంటి పరమశివుఁడు.; అని, జనుల్ = ప్రజలు; పేర్కొన్నచోన్ = పేరుకొనిన యెడల, అంధక ఉద్భూత స్నేహమున్ = (బలరామునికి) అంధకుల యెడ జనించిన స్నేహభావమును (శంకరుఁ డంధకాసురవైరి యగుటచేతను); కామపాలతయున్ = మన్మథుని పాలించుటయును, అనఁగా మన్మథ జనకత్వమును (శంకరుఁడు కామధ్వంసియగుటచేతను) తప్పున్ = (శంకరుఁడే ప్రలంబఘ్నుం డాయెనని తలంచుపక్షమున అ తలంపు) తప్పిపోవును; తప్పున్ కాక ఏమి = తప్పిపోయిన నేమి? పాండుర అంగ మహిమన్ = తెల్లనయిన శరీరము యొక్క గొప్పదనమునను (శివబలరాము లిద్దఱును తెల్లని మేనికాంతి కలవారే కావున); హాలాహల స్వీకృతిన్ — హాలా = సారాయమును, హల = నాఁగటిని, స్వీకృతిన్ = స్వీకరించుట యందును (శంకరుఁడు హాలాహలమును, ప్రలంబఘ్నుండు హాలా + హలములను రెంటిని స్వీకరించినవారు కావున), (బలరాముఁడు) ప్రఖ్యాతిన్ = ప్రసిద్ధిని; పొందఁడె = పొందఁడా? (జనవాక్యమున కనుగుణమగు ప్రసిద్ధిని పొందినవాఁడు కాలేదా అని భావము)

తా॥ ఆదిశేషుని యవతారమే యగు బలరాముడు శ్రీమన్నారాయణుని మీఁది ప్రీతిచేఁ బుట్టిన యా పరమశివుఁ డగునని జనులు పేర్కొందురేని దానికి బలరాముని యంధకస్నేహమును, కామపాలతయు బాధకము లగుచున్నవి. అయినను నాతని పాండురాంగమహిమ (తెల్లనిశరీరము గలిగియుండుట), హాలాహల స్వీకృతి (మద్యమును, నాఁగటిని స్వీకరించుట) యనునవి యా పోలికకు సాధకములే యగుచున్నవి.

విశే॥ పరమశివుఁడు అంధకవైరి, కామధ్వంసి, పాండురాంగుఁడు, హాలాహలఁ భక్షకుఁడు. బలరాముఁడు శ్రీమన్నారాయణునిమీఁది ప్రీతిచేఁ బుట్టిన శంకరుఁ డనుచో శంకరుని గుణములలోని తొలి రెండును నాపోలికకు బాధకములగును. శంకరుఁడు అంధకవైరి. బలరాముఁడు యాదవులలో నొక తెగవారగు నంధకుల యెడ స్నేహభావము గలవాఁడు. శంకరుఁడు కామధ్వంసి. బలరాముఁడు కామపాలుఁడు (కామపాలో హలాయుధః అని అమరము) కాని శంకరుని తక్కిన రెండుగుణములను నా పోలికకు సాధకములుగనే యున్నవి. శంకరుఁడును బలరాముఁడును పాండురాంగులు. హాలాహలస్వీకృతి (శంకరుని పక్షమున హాలా హలమను కాలకూట విషముయొక్క స్వీకారము- బలరాముని పక్షమున హాలా = మద్యమును, హల = నాఁగేటిని స్వీకృతి = స్వీకరించుట) యిరువురికిని సమానమే. ఇచ్చట శ్లేషచే నౌపమ్యము సిద్ధించినది.

మూలమున నాదిశేషుఁడే బలరాముఁడయ్యెనని కలదు కాని వారిర్వురును శంకరావతారము లనుట పేర్కొనబడలేదు. మూలమునందలి యీ వాక్యములు చూడుఁడు.

'అనంతం యం విదుర్నాగ
మాదిదేవం మహౌజసమ్
పురాణే నాగరాజో సౌ
కథ్యతే ధరణీధరః
శేష స్తేజోనిధి శ్శ్రీమాన్
అకంప్యః పురుషోత్తమః'

హరి హరాద్వైతమును బ్రతిష్ఠాపింపఁదలఁచుటే మూలమునకు భిన్నమయిన యీ కల్పనమునకు హేతువుకాఁదగును. అంధక స్నేహ, కామపాల హాలాహల స్వీకృతి పదము లాకల్పనమునకుఁ దోడ్పడినవి.

ఇం దలంకారము శ్లేషానుప్రాణితన్యూనాభేదరూపకము.

వ॥ మఱియును

సీ॥ కడిమి జరాసంధ గంధ సింధురముఁ ద
    ద్బంధుమండలి తోన పాఱఁ ద్రోలె
బలిమి[1] నాగాయుత ప్రాణు[2] జగత్ప్రాణు		(బలియు[1]) (బాహు[2])
    తనయు గదా కేళి దర్పమడఁచె
వీఁకతోడ వరాటవీ ఖేలనమ్మున
    ధీరుఁ బ్రలంబ దైతేయుఁ జంపెఁ
దెగువ రాసభరూపు ధేనుకాసురుఁ బట్టి
    విన్నాణమున మేను విఱిచి వైచె
నగర పరిఖాపయః పూరణంబు సేయ
సీరముఖమునఁ గాళిందిఁ జీఱి[3] తెచ్చె		(జీరి[3])
మెఱసి మూఁడు లోకంబుల మేటి మగలు
రాయ సేర్తురె యాదవరాము తోడ,

వ్యా॥ ఈ పద్యమున గల పురాణ కథలను హరి వంశమునను, భాగవతమునను, విష్ణుపురాణ మునను, భారతమునను, జూడఁదగును. ఈ పురాణములందును గథలు గొంత భేదముతో నున్నవి. ఇందు హరివంశ కథా విధానమే గ్రహింపఁదగినది. బలరాముని వీర కృత్యములు వయః క్రమమునుబట్టి చూడఁగా నీసీసపద్యమున 4, 3, 2, 1 చరణములు 1, 2, 3, 4 చరణములుగా మార్చవలసిన వగును. కాని హరి వంశ మూలమున (చూ. విష్ణుపర్వ 120 అధ్యాయము) నీ క్రమమేకలదు. మూలమునఁ గథా సందర్భ వివృతి కలదుఁ గాని యిందది విడువఁబడినది. [చూ. పరిశిష్టము] జరాసంధగంధసింధురమున్ = జరాసంధుఁ డను మదపుటేనుఁగును, నాగాయుత ప్రాణున్ = పదివేలేనుఁగుల ప్రాణబలముగల వానిని, జగత్ప్రాణ తనయున్ = భీముని, వరాటవీఖేలనమ్మునన్ = మేలియరణ్యవిహారమున;విన్నాణమునన్ = కుస్తీ పట్టునేర్పుతో; కుస్తీపట్టు విన్నాణములు-వీని వివరణము పరిశిష్టమునఁ జూచునది [చూ. పరిశిష్టము]

ఈ పద్యమున సోమనాథుఁడు చరణముల మొదల సమానార్థకము లనఁదగిన పదములను 'కడిమి, బలిమి, వీఁక, తెగువ' లను జేర్చినాడు రెండవ చరణమున 'నాగాయుతబాహు' అని పాఠము కలదుకాని "నాగాయుతబల ప్రాణో భీమో భీమ పరాక్రమః" అని మూలముండుటచేతను'నాగాయుత ప్రాణు'నని కూడఁ బాఠ మగపడుటచేతను, 'జగత్ప్రాణ తనయు'నని తర్వాతఁ గూడఁ బ్రాణపదానుప్రాసము గాన వచ్చుట చేతను దానిఁ గైకొంటిని. 'నాగాయుతప్రాణు ననిలనందనుఁ బాడుదలవట్టి' (కర్ణపర్వ1అ-42 పద్యము).

---

పరిశిష్టము: (కథావివృతికి)

సంస్కృత హరివంశము 120 అధ్యాయము (అచ్చుప్రతి)

జనమేజయః॥

భూయఏవతు విప్రర్షే బలదేవస్య ధీమతః
మాహాత్మ్యం శ్రోతుమిచ్ఛామి శేషస్య ధరణీధృతః ॥1॥
ఆతీవ బలదేవంతం తేజోరాశి మునిర్జితమ్
కథయంతి మహాత్మానో యేపురాణవిదో జనాః ॥2॥
తస్యకర్మాణ్యహం విప్ర శ్రోతుమిచ్ఛామి తత్త్వతః
అనంతం యం విదుర్నాగ మాదిదేవం మహౌజసమ్ ॥3॥

వైశంపాయనః॥

పురాణే నాగరాజోసౌ
కథ్యతే ధరణీధరః
శేషస్తేజోనిధి శ్శ్రీమా
నకంప్యః పురుషోత్తమః ॥4॥

ఇది సర్వయతి సీసము. ఈ గ్రంథమున సర్వయతి సీసములు చాలఁ గలవు.

[కడిమిన్ = బలముతో; జరాసంధగంధ సింధురమున్ = జరాసంధుఁ డను మదపుటేనుగును; తత్ బంధు మండలితోన్ అ = ఆతని బంధువుల సమూహముతోఁ గూడనే; పొలఁద్రోలెన్ = తఱుమఁగొట్టెను. బలిమిన్ = బలముతో; నాగ అయుత ప్రాణున్ = పదివేల యేనుఁగుల ప్రాణబలముగల వానిని; జగత్ ప్రాణ తనయున్ = లోకమునకంతకును ప్రాణమైన వాఁడగు వాయుదేవునికుమారుని - భీముని; గదాకేలిన్ = గదా యుద్ధమునందు; దర్పము = గర్వమును; అడఁచెన్ = పోఁగొట్టెను. వీఁకతోడన్ = పూనికతో; వర అటవీ ఖేల

---

యోగాచార్యో మహావీర్యో
వేదమంత్ర ముఖోబలీ
జరాసంధం గదాయుద్ధే
జితవాన్యో నచావధీత్ ॥5॥

బహవశ్చైవ రాజానః పృథివ్యాం పృథివీపతే
అన్వయుర్మాగధం సర్వే తేచాపి విజితారణే ॥6॥

నాగాయుత బలప్రాణో భీమో భీమ పరాక్రమః
అసకృద్బలదేవేన బాహుయుద్ధే వినిర్జితః ॥7॥

దుర్యోధనస్య కన్యాంతు హరమాణో న్యగృహ్యత
సాంబో జాంబవతీపుత్రో నగరే నాగసాహ్వయే ॥8॥

రాజభిః సర్వతో యుద్ధో హరమణో బలాత్కిల
తముపశ్రుత్య సంరుద్ధ మాజగామ హలాయుధః ॥9॥

రామ స్తస్యతు మోక్షార్థ మాగతోనాలభచ్ఛతమ్
తతశ్చుక్రోధ బలవా నద్భుతం చాకరోన్మహత్ ॥10॥

అనివార్య మభేద్యంచ దివ్య మప్రతిమం బలీ
లాంగలాస్త్రం సముద్యమ్య బ్రహ్మదండాభి మంత్రితమ్ ॥11॥

ప్రాకారవప్రే విన్యస్య పురస్య సమహాద్యుతిః
ప్రక్షేప్తుమైచ్ఛ ద్గంగాయాం నగరం కౌరవస్య తత్ ॥12॥

తదాఘూర్ణిత మాలక్ష్య పురందుర్యోధనో నృపః
సాంబం నిర్యాతయామాస సభార్యం తస్యధీమతః ॥13॥

దదౌశిష్యం తదాత్మానం రామస్య సుమహాత్మనః
గదాయుద్ధే కురుపతిం శిష్యం జగ్రాహ తం చ సః ॥14॥

తతఃప్రభృతి రాజేంద్ర పుర మేత ద్విఘూర్ణితమ్
ఆవర్జితమివా భాతి గంగా మభిముఖం నృప ॥15॥

నమ్మనన్ = శ్రేష్ఠమయిన యరణ్యక్రీడయందు; ధీరున్ = ధైర్యశాలియగు; ప్రలంబ దైతేయున్ = ప్రలంబుఁ డను రాక్షసుని; చంపెన్ = చంపెను; తెగువన్ = సాహసముతో, రాసభ రూపున్ = గాడిదరూపు దాల్చినట్టి; ధేనుకా అసురున్ = వృషభాసురుని; పట్టి = పట్టుకొని; విన్నాణమునన్ = కుస్తీపట్టు నేర్పుతో; మేను = శరీరమును; విఱిచి వైచెన్ = విఱిచివేసెను; నగర...ణంబు-నగర = నగరమునందలి; పరిఖా = అగడ్తయందు; పయఃపూరణంబు = నీటిని నింపుట, చేయన్ = చేయుటకు; సీరముఖమునన్ = నాఁగటిమొనచే కాళిందిన్ = యమునానదిని, చీఱి = చీల్చి; తెచ్చెన్: మెఱసి = ప్రకాశించి; మూఁడులోకముల = ముల్లోక ములయందలి; మేటిమగలు = గొప్పవీరులు; యాదవ రాముతోడన్ = బలరామునితో, రాయన్ నేర్తురే = ఎదుర్కొనఁగలరా?

తా॥ బలరాముఁడు జరాసంధుఁడను మదపుటేనుఁగు నాతని బంధుసమూహముతోఁ గూడఁ బాఱ ద్రోలెను. గదాయుద్ధమున భీమసేనుని దర్పమడఁచెను. ప్రలంబదైతేయునిఁ జంపెను. రాసభరూపముఁ దాల్చి వచ్చిన వృషభాసురుని మేను విఱిచివైచెను.నగరములోని యగడ్తను నింపుటకై యమునానదిని దననాఁగటిమొనచే జీఱి తెచ్చెను.

విశే॥ సీసపద్యము రెండవపాదమున, బలియు, నాగాయుతబాహు అని పాఠాంతరములు. తక్కిన మూడు పాదములయందును కడిమి, పీఁకతోడన్, తెగువన్ అనుపదము లుండుటచే నీపాదము నను దత్సమానార్థకమయిన 'బలిమి' పదము ప్రయోగించి యుండుట సంభావ్యము. "బలియు" పాఠము

---

ఇద మత్యద్భుతం కర్మ రామస్య ప్రథితం భువి
ఖండీరే కథ్యతే రాజన్ యత్కృతం శౌరిణా పురా ॥16॥
ప్రలంబం ముష్టి నై కేన యజ్ఞగాన హలాయుధః
ధేనుకంచ మహాకాయం చిక్షేపనగ మూర్ధని ॥17॥
సగతాసుః సపాతోర్వ్యాం- దైత్యో గర్దభరూపధృత్ ॥18॥
లవణజలగమాం మహానదీ ద్రుతజలవేగతరంగగామినీ
నగరమభిముఖీ యదాకృతా హల విధృతా యమునా యమస్వసా ॥19॥
బలదేవస్య మాహాత్మ్య మేతత్తే కథితం మయా
అనంత స్యాప్రమేయస్య శేషస్య సుమహాత్మనః ॥20॥
ఇతి పురుష వరస్య సీరిణో బహు విధముత్తమ మన్యదేవచ
యదకథిత మిహాద్యకర్మతే తదుపలభస్వ పురాణ విస్తరాత్ ॥21॥

ఇతి విష్ణుపర్వణి బలదేవ మాహాత్మ్యకథనే వింశత్యధిక శతతమోధ్యాయః.

కంటెను 'బలిమి' పాఠము యుక్తతరము. అట్లే నాగాయుత బాహు (=పదివేల యేనుఁగుల బాహుబలము గలవానిని) అను పాఠముకంటె 'నాగాయుతప్రాణు' అనుపాఠము శ్రేష్ఠము. "నాగాయుతప్రాణు- జగత్ప్రాణు తనయు" నని తరువాతఁ గూడ సోముని రచనకు సహజమయిన "ప్రాణ" పదాను ప్రాసము గానవచ్చుచున్నది.

---

## పరిశిష్టము (విన్నాణములకు)

శివతత్త్వ రత్నాకరమున అష్టమకల్లోలము తృతీయ తరంగమున విన్నాణముల (విజ్ఞానముల) నిర్వచన మిట్లున్నది.

ఉక్తాని స్థాన కాన్యేవం విజ్ఞానాని ప్రచక్ష్మహే
స్వరూపేణ తథానామ్నా విస్తరేణ యథాగమమ్॥
అర్ధాఙ్గి స్థానకస్థేన మల్లేన స్థూలవర్మణా
పీడనా ముఖదేశస్య విజ్ఞానం స్యాత్తదేవ హి॥
స్థిరా దర్ధాఙకేస్థానే పాదస్యాకర్షణం బహిః
బహిః పణమితి జ్ఞేయం విజ్ఞానం పాదమోటనమ్॥
తస్యైవ పరివృత్తస్య మోటనే జాగునీ భవేత్
జంఘాభ్యాంచ భుజాక్రాంతౌ తాభ్యాం శిరసి పీడితే॥
పురః కచ్ఛా సమాకృష్టా గుడాలం ప్రాణఘాతనమ్
గ్రీవాయాశ్చైవ భుజయోః పాదేనాక్రమణే సతి॥
అన్యజాన్వవబన్ధేన కుర్యాదుత్తర డోక్కరమ్
శిరస్థితేన మల్లేన విక్షేపా యోద్ధతం పదమ్॥
గృహీత్వా సక్థియుగ్మేన కక్షం నిష్పీడ్య పార్ష్ణినా
ఉత్తానజానుదేశస్య కటియన్త్రేణ పీడనమ్॥
పట్టిసం నామ విజ్ఞానం జానుసంధి ప్రభంజనమ్
అనేనైవ ప్రకారేణ బాహుసంధి ప్రపీడనమ్॥
ఛడకీనామ విజ్ఞానం శాస్త్రవిద్భిః ప్రకీర్తితమ్
ఆదౌ విధాయ తద్బాహ్వోః పూర్వవత్పీడన యది॥
విజ్ఞానమర్థఛడకీ బాహుసంధి ప్రభంజనీ
మన్యాం కక్షే వినిక్షిప్య భుజేనైకేన సంయుతా॥
గలంప్రకోష్ఠేనాపీడ్య తత్కరేణ కరాన్తరమ్
సన్థౌ ప్రగుహ్య జఠరం సక్థిభ్యాం పరిపీడయేత్॥
హస్తడోక్కరకంనామ విజ్ఞానం జీవఘాతనమ్
అర్ధాంగ స్థానకే స్థిత్వా బాహుభ్యాం మధ్యమున్నయేత్॥
పార్శ్వే సంపీడయేత్ కంఠం కర్షన్నూరూ ప్రజంఘయా
ధనుర్యష్టీతి విజ్ఞేయం విజ్ఞానం మధ్యభంజనమ్॥

మూలమునఁ గూడ "నాగాయుత బల ప్రాణో భీమో భీమ పరాక్రమః' అని కలదు. 'నాగాయుతప్రాణు ననిల నందనుఁ బాడుదలపట్టి' (కర్ణపర్వము1 ఆ-42 ప.)

ఇది సర్వయతిసీసము

---

శరీరస్థాన విజ్ఞానా న్యమూన్యేకాదశైవ తు
స్థానే కరవలే స్థితా వ క్త్రేక్షిప్త్వా నిజోదరమ్॥
వోగ్గమూ భవటం నామ్నా విజ్ఞానంశ్వాసవోధనమ్
ఉరసాపీడనం తద్వద్విజ్ఞానం ముఖపట్టకమ్॥
హస్తద్వయేన వక్త్రస్య పిధానం ముసికాహ్వయమ్
స్థిత్వా కరవలే స్థానే మణిబంధస్య మోటనమ్॥
క్రియతేయత్తు తత్ప్రోక్తం ముద్రాకిం కరభంజకమ్
బాహుభ్యాం మధ్యమాక్రమ్య జంఘా మాక్రమ్య జంఘయా
బాహుసంధి విభంగార్థం భజేచ్చరణపట్టసమ్
కరస్య జానుసంధౌచ కరం నిక్షిప్య కంచన॥
జంఘాభ్యా మూరు మాక్రమ్య విదధ్యాల్లోలపాదకమ్
జఠరస్థానకే స్థిత్వా బాహోర్యత్ర చ పీడనమ్॥
సందంశాకృతి బాహుభ్యాం సందంశం నామ యద్భవేత్
జంఘాం విధాయ మన్యాయాం జానుసంధినిపీడితామ్॥
చూడాం వా పూర్వకచ్ఛాంవా కర్షన్ డోక్కర మాచరేత్
ఊరూభ్యాం పాదమాక్రమ్య పాదౌ నిక్షిప్య కక్షయోః॥
ఆవిధ్య బాహునా జంఘే కుర్యాజ్జవల శంఖకమ్
సారో జవల శంఖస్య పాదస్యైకస్య పీడనాత్॥
ఏవం వక్షఃపట్టనామ విజ్ఞానం పదభంజనమ్
సర్వాంగం పీడయేద్యత్ర మధ్యమాక్రమ్య పృష్ఠతః॥
సుమరిర్నామవిజ్ఞానం సంకోచా దంగ సాధనమ్
ఊరూభ్యాం మధ్యమాక్రమ్య మన్యాం కక్షాంతరే క్షిపేత్॥
జ్ఞేయం గుండగులీనామ విజ్ఞానం కంఠమోటనమ్
పృష్ఠస్థానక మాస్థాయ బాహూకక్షాన్త నిర్గతౌ॥
మన్యాయాం సంగతంకృత్వా కరశాఖానిబంధనాత్
తాభ్యాం సంపీడయేన్మన్యాం కుర్వంశ్చాధో ముఖఃశిరః॥
ఊరూభ్యాం మధ్యమాక్రమ్య యుంజ్యా ద్గరుడపక్షకమ్
పృష్ఠస్థః ప్రతిమల్లస్య పృష్ఠ పృష్ఠే భుజం బలాత్॥

ఇందుఁ బ్రస్తావింపఁబడిన పురాణకథలు హరివంశమునను, భాగవతమునను, విష్ణుపురాణమునను, భాగతమునను గలవు, కాని కథలు కొంత కొంత భిన్నములుగా నున్నవి. హరివంశమునఁ గల క్రమము ననుసరించి యిందలి కథలు ప్రస్తావింపఁబడినవి. అందుఁగల కథాసందర్భ వివృతి యిటఁ బరిహరింపఁబడినది.]

(సశేషము)

---

ఆకృష్య వర్తయన్ కుర్యాద్విజ్ఞానం వేపణీం బుధః
జానుసన్ధౌ క్షిపన్ జంఘాం పతిత స్యాప్యవాంగ్ముఖమ్॥
ఉరసా పీడయేత్పాదం తదంగచలనం భవేత్
మన్యాం వక్షోఽన్తరే కుర్వన్ బాహుం గరుడపక్షవత్॥
మధ్యపీడనయోగేన భవేన్మకుటబంధనమ్
ఏక ద్వి త్ర్యంగులం ముక్త్వా కరశాఖాచతుష్టయమ్॥
భర్జ్యతేం గుష్ఠ వర్జం తద్విజ్ఞానం చతురంగులమ్।
బాహునా బాహుమావిధ్య ధృతం వాన్యేన ముద్రకమ్॥
మోట్యతే మణిబంధోయత్తద్ విజ్ఞానం తథాభిధమ్
హస్తౌపాదౌ చ శీర్షంచ పద్భ్యామావేష్ట్య పీడనాత్॥
విజ్ఞానం తత్సమాఖ్యాతం డోక్కరం సుకుడుంబకమ్
విజ్ఞానా న్యేవ ముక్తాని బంధమోచన కారణమ్॥

# చాటుపద్య-మణిమంజరి

(సంకలనం)

—వేటూరి ప్రభాకరశాస్త్రి

## సుభద్రార్జున సంవాదము

వినుమా ఫల్గున కృష్ణదేవుఁ డనుపన్ వేవేగ నే వచ్చితిన్
ఘనుఁడా మాధవునాజ్ఞ మీఱఁ దగునా గంధర్వుఁడే చుట్టమా
కినుకన్మాని యుపేంద్రుఁ గూడి మనుమా క్షీరోదకన్యాయమై
నను మన్నింపుమ మాను వైర ముడుగన్ నాప్రాణనాథార్జునా!

ఓ గంధేభసమాన యాన! యభయం బొప్పారగా నిచ్చితి
న్నాగంగాధరు నంతవానికయిన న్నిం దింతురే యార్తునిన్
యీ గంధింపులకెంతలేదు తరుణీ యిత్యాదికున్ మెత్తురే
యీ గంధర్వుని నీను భీరసము లింకేలే సుభద్రాసతీ!

గయునింగాచి పగందుకొంటి వహహా కంసాసురారాతితో
భయమున్ భక్తియు కల్మి చెల్మి యల మున్ పాటించు చిత్తంబునన్
ప్రియభావుం డతిధార్మికుండు సమరాభీలుండు వెన్నుండకా
నియతొప్పం గయు నొప్పగించు మిపుడేనిం బ్రాణానాధార్జునా!

ప్రాణప్రాణము ధాత దైవము పరబ్రహ్మంబు పద్మాక్షుడే
జాణత్వంబులు మాని చూచుకొను మా సర్వజ్ఞ చూడామణీ
క్షోణిన్నింతన రాదుగా హరి కృపా చూపట్టు నేపట్టునన్
నాణెంబైనను నీతలంపుల తగన్ నాతీ! సుభద్రాసతీ!

ప్రాణప్రాంతుని యిత్తురే తన తను ప్రాణంబుపై వచ్చినన్
క్షోణీశుల్ శిబి దంతరామ నహుషుల్ ఘోషింతురే పోరికిన్
ప్రాణస్నేహము బాంధవంబు గలుగన్ పాటించు చిత్తంబునన్
రాణన్ జాణతనంబుగాదు హరికిన్ నాప్రాణనాథార్జునా!

స్థిరతేజుండు దయాళుడై మనలమున్ దీవింపనౌగాకనన్
కరుణాపూర్ణుడు చక్రిగాకగలడే కంజాత పత్రేక్షణా
నెరవాదెవ్వరు శౌరితో నెదురె నేనెంతెంతయున్ సత్యమే
నరుడేపట్లను నోడినన్ విజయుడే నాతీ! సుభద్రాసతీ!

కలివా దైవము బాసి వొక్కరునికై కన్నెర్ర గైకొంటివా
కలికి ల్మానుము గొల్ల చెల్లదకటా గాండీవికిన్ న్యాయమా
బలవద్వైరము చక్రిన్ నరునకున్ బ్రహ్మాండముల్ తాళునే
నలినాక్షుండు మహానుభావుడుగదా నాప్రాణనాథార్జునా!



# కృష్ణలీల

—వేటూరి సుందరశాస్త్రిగారి కృతులు

[ప్రభాకరుల పితృపాదులు సుందరశాస్త్రిగారు ఇట్టి గీతా లనేకం రచించినారు. కందార్థాలూ, దరువులూ, సంవాదాలూ మొదలైనవే కాక బంధచిత్ర కవిత్వమూ చెప్పినారు. ఈ లఘు కృతులే కాక వీరి రచనలలో పేర్కొనదగినవి కదళీమహాత్మ్యము (కావ్యము), కాలకంఠ సీసపద్యావళి (శతకము) అముద్రితములు. క్రమమున వాటిని కూడా పరిష్కరించి ప్రకటింపగలము - సం॥]

నీతానయు చేతా బ్రతుకమే, యశోదమ్మా!
సీతానయు చేతా బ్రతుకమే॥
నీతనయు చేతా లతి
ఘాతూకము కాపూరము
లేతీరూన జేతూమమ్మ
వ్రాతాఫల మేతీరానా॥ ॥సీతానయుచేతా॥

నిన్నా నాదు చిన్నా కోడ
లన్నా పిన్న కన్నే పున్నె
మున్నాదాని విన్నానంచు
భన్నాసరము మెడనూవేసి
నిన్నే నమ్మియున్నా నానెనే-దాని
చన్నూబట్టి కంగాలించు
కెన్నో జేసెనే యా వాడా మా
యన్నా గారన్నీ జూచెనే - రోసమూ చేతగ
దన్నావాని వెన్నూదన్ని
పొన్నామాను మీదా డాగి
యెన్నో వగలు జేసినాడు॥ ॥సీ తానయుచేతా॥

చూడా పనివాడీతాడు
యాడావాని కీడూవేదు
కోడేదూడ తోకానాధు

కోడాల్దాని జడకూ గట్టి
యూడాదీసి తాడూ తోడుతా - యా
దూడానేయ పీడీవడి - గంతూ లేయగా నా
చేడీయాకు మూడీరాక
వేడూకోనగా - నా
తోడా నిపుడె కూడూటాకు
నోడాబడ నూడాదీతు
వేడారంచు నాడీ పరు
గిడే వాడు మారాడాక
కోడేగాం|దతో గూడూక॥ ॥నీ తానయుచేతా॥

ఉట్టీ పాలచట్టీ తూటు
గొట్టీ నోరు బట్టీ |గాగు
నట్టీవేళ్ళ నాదూపట్టి
జుట్టూబట్టి కొట్టాబోగ
వట్టూ కొట్టాకు మానెనే - నావంటీ కు|ర
బుట్టూ నీవిట్టూ రమ్మానెనే - ఈలాటి సుతు
నెట్టూగంటి వోయమ్మా - మా
గుట్టూ పోగొట్టీ చను
బట్టీ మోవి నట్టే గరచి
గొట్టే నచ్చోట పూల॥ ॥నీ తానయుచేతా॥

ధరణి వేటూరి జోగి - తనయు సుందరా కవివర
వరహృత్సరసీరుహము - వదలజాలక |వేత
తరుణీ మానధనము - లెల్లా చూరాగొని
ధరణి పరిపూర్ణుడాయెను - బీదాలకెల్ల
కోరికల దీరా|బోచెను - భవబంధాముల
బారా|దోలి చేరాదీసెను
దారూ కాదాశికా
పూరా పరిపాలుడై
మీరి నాగేశ్వరేశు
జేరి మము |బోచునట్టి॥ ॥నీ తానయుచేతా॥

కథానిక:-

# తక్రానందస్వామి

—గౌతముడు

[గౌతముడు అనే కలంపేరుతో వేటూరివారు (అక్టోబరు, 1930) ఆనందవాహిని మాసపత్రికలో ప్రచురించిన కథానిక ఇది. ఆరోగ్యవిషయం ఇందు ప్రధానమైన ఇతివృత్తం. తక్రానందస్వామి ప్రధానపాత్ర. భాష ప్రామాణికమైన వ్యావహారికం—సం॥]

ఈనడుమ కొంతకాలంనుండి పత్రికలకేమి, ఉపన్యాసాలకేమి, ఆహార సమస్య ప్రధాన చర్చావిషయముగా ఉంటోంది. ప్రకృతి వైద్యులు, వికృతి వైద్యులు, హైకోర్టు జడ్జీలు. సన్న్యాసి స్వాములు ఇంకెందరెందరో ఈ విషయాన్ని చర్చిస్తున్నారు తమతమ జీవిత కాలానుభవములలో, బాల్యమునుండి ఇలువాడికగా జరుపుకొంటూ ఉన్న ఆహారవిధానమును మార్చి కొత్తకొత్త ఆహార విధానములను గూర్చి పరిశోధనలు సాగించి, కొన్ని రోజులో కొన్ని నెలలో లేక ఒకటి రెండేళ్ళో ఆ కొత్తవిధానము తమకు సరిపడ్డట్లు కనుపట్టగానే దాన్నిగూర్చి పత్రికలలోను ఉపన్యాసాలలోను, పలువురు ప్రచండ ప్రబోధము సాగిస్తున్నారు. అందు కొందరు తమకు సరిపడ్డ ఆహార విధానమే సర్వ మానవవర్గముకూ సరిపడదగ్గ ఆహారాద్వైత విధానమని నమ్ముతూ ఇతరులకు ఉపదేశాలు సాగిస్తున్నారు. ఇట్లా బోధించేవారి విధానాలు అన్నీ వొక్క పద్ధతిమీదనే ఉంటే చిక్కులేదు గాని అవి కొన్ని పరస్పర విరుద్ధములుగా విపరీతములుగా కూడా ఉంటున్నై. ఇందులో విశ్వసించ దగినవేవో అవి యెంతవరకువిశ్వసించ దగ్గవో,నిశ్చయించడం కష్టంగా ఉంది,

లవణానంద స్వాములవారు మద్రాసు దయచేసి ఉప్పునీరు సర్వవ్యాధి నివారణము, అఖండారోగ్య ప్రదాయకము,అదే ఔషధాద్వైత సిద్ధాంతమున బీచిలో ఉపన్యాసాలు కురిపించినారు కాని దాన్ని విశ్వసిలచ డానికి వీలులేకుండా విద్వాంసులైన హైకోర్టుజడ్జి వేపా రామేశంగారు, ఆ కాలంలోనే ఉప్పులేని ఆహారం మహారోగ్య ప్రదమని, ఉప్పు తినడంచేతనే అనేకనారోగ్యాలు పెరుగుతున్నవి అని ఒకప్రక్క మహోపన్యాసా లియ్యసాగించారు. స్వార్థమువిడిచి దేశక్షేమానికై తంటాలుపడుతూ ఉపన్యాసాలిస్తూ ఉన్న స్వాములవారిని కాదందామా! మహాపరిశోధకులయిన జడ్జీగారిని కాదందామా! ఏది అవలంబించేది అనే చిత్తపు ఊగిసలాటలో ఇటూ అటూ కొట్టు ంటూ ఉండవలసిన వాళ్ళమైనాం మాబోట్లం. ఈ ఇద్దరేకాదు ఇంకాఎందరెందరో ఆహారపథకాలుప్రకటిస్తున్నారు,అవి చూస్తే గుండె గుభేలుమంటుంది. ప్రశస్తమైనవని వారు ప్రకటించిన వస్తువులను ఆయా పద్ధతులమీద ఆరగించ సాగిస్తే రెండుపూటలకే మంచమెక్కవలసిందే నాబోటి గాడు. ఆదేమంటే ఆవస్తువులు తిని అనారోగ్యపడ్డ నాబోంట్ల అనుభవాన్ని కాదని అనే అధికారం ఇతర్లకెవరి కుంది?

సరే నీకెందుకీ గోల! కష్టపడి పరిశోధనలు జరిపి డక్కామొక్కీలు తిని వారు వారు ఆయా పద్ధతులను

సరియైనవని కనుక్కున్నారు. వారునమ్మిన, వారిఅనుభవానికి వచ్చిన, పద్ధతులను లోకానికి తెల్పుతున్నారు. 'నీకిష్టమైతే నీకు నమ్మకము ఉంటే వాటిలో ఒక్కొక్కదాన్నే అనుసరించి నీపరిశోధనమునకు తాళినదేదో నీవూ అవలంబించేది. అంత ధైర్యము లేకపోతే నీతల్లిదండ్రుల నాటినుండి అలవాటై వస్తున్నది, చిన్ననాటినుండి నీకు సరిపడుతున్నదీ ఏ ఆహారమో దానితోనే కాలంగడిపేది, అని యెవరైనా నన్నాక్షేపించవచ్చును కాని, నాక్షోభ వాక్యకేం తెలుస్తుంది. కందిపప్పు ఒకనెల సరిపడితే మరునెల పెసరపప్పు సరిపడుతుంది. బెజవాడలో ఉన్నప్పుడు సరిపడే వస్తువులు చెన్నపట్నంలో సరిపడవు. చెన్నపట్నంలో ఉన్నప్పుడు సరిపడే వస్తువులు బెజవాడలో సరిపడవు. ఏ వయస్సులో ఏకాలంలో ఏదేశంలో ఏ వస్తువు తింటే నావొంటికి సరిపడుతుందో నాకు తెలియదు. మామూలు తిండిలోనే అనేక మార్పులు చేస్తూచూస్తూ ఉంటాను. ఈ పరిశీలనలవల్ల తంటాలే యెక్కువవుతున్నై గాని ఆహార విషయంలో రాదారిబాట నాకు దొరకలేదు. తినబడే వస్తు తత్త్వమూ తెలియదు. తినే శరీర తత్త్వమూ తెలియదు. తెలియని శరీరంలో తెలియని ఆహార వస్తువులను పడవేసి, తెలియని వికారములను అనుభవిస్తు 'గుడ్డియెద్దు చేనబడ్డట్టు' కొట్టుకాడడంగా వుందిగాని నిరపాయమయిన ఆహారమార్గమిదీ అని నాకేమీ ఇప్పటికీ తెలియకుండా ఉంది. అజీర్ణమనీ, జ్వరమనీ, తలనొప్పిఆనీ, ఏవేవో అనారోగ్యాలు అప్పుడప్పుడు నన్ను బాధిస్తునే ఉన్నై- ఓవైద్యుడిదగ్గిరకి వెడితే ఓమాట, ఇంకో వైద్యుడిదగ్గరకు వెడితే ఇంకోమాట. ఒకరో దానికి మందియ్యాలంటే ఇంకోరు ఇంకోదానికి మందియ్యాలనడం! చివరకు ఆదీ ఇదీ కాకుండా ఇంకోవిధంగా జబ్బుతేలడం! ఎట్టకేలకు ఈశ్వరానుగ్రహంచేత (అంతే అనాలి!) జబ్బు తగ్గడం. అనవసరపు మందుల వాడికలవల్ల కొత్తవికారా లేర్పడడం చివరకేదో స్వంతపు కూరగాయ వైద్యాలవల్ల వాటిని నివారించుకోవడ్ం. ఇటువంటి చీకాకులతో మళ్ళీ వైద్యుడిదగ్గిరకువెళ్ళి ఏవేవో మందులు పుచ్చుకొంటూ డబ్బు వదలించుకొంటూ జబ్బు మెదలించుకొంటూ ఉండే నాకు చీకు చింతలేని నిర్దోషమైన ఆహార విధానం ఏదైనా దొరికితే బొననని, ఆశపడడం అట్టి దెవరైనా బోధించేవారు వచ్చినారంటే వారి సదుపదేశాలని వినవలెనని కుతూహలం కలగడం, యుక్తమేకదా!

కాని నేనుమాత్రం ఈ విషయంలో సంపూర్ణంగా వివేకం కోల్పోలేదు. లవణానంస్వామివచ్చి ఉపన్యాసాలిచ్చేరోజులలో నేనెప్పుడూ ఆయన బోధల వినబోలేదు. ఉప్పునీళ్ళుత్రాగుతూ అవస్థ పడడంకంటె కొంత జబ్బున్నా నోటికి రుచికరమయిన ఆహార పదార్థాలతో కాలం గడపడమే మంచిదని ఆ మందుకంటె జబ్బే నయమనీ, నేననుకొన్నాను. ఉప్పులేని చప్పిడి తిండిని గురించి కూడా అట్లే తలచుకొని దాని గుణాగుణాల్ని గుర్తించడానికైనా నేను యత్నించలేదు. ఇతరులు బోధించే ఆహార విధానాలతో "ఆత్మన స్తృప్తిరేవచ" అనే వాక్యాన్ని కూడా జోడించి చూస్తూ ఉండడమే కాని సంపూర్ణంగా నా అభిరుచులను చంపుకోవడం నా కిష్టముకాదు. ఆత్మాభిరుచికి కొంత విలువ ఉంటుందని నమ్మకము.

వెనుకంటికి పదేళ్ళకిందట గాంధిమహాత్ముని శిష్యుడొకడు అన్నం కూరగాయలు, మానివేసి, మహాత్ముని వలె వేరుశనగపప్పు బెల్లంమజ్జిగ ఆహారిస్తూ వచ్చుచుండెను. పది పన్నెండు రోజులు గడచినై. ఒకనాడు రాత్రి వేరుశనగప్పు బెల్లం,తిని పడకవేశాడు పంతులు. రాత్రి రెండుగంటలకు ఉభయద్వారాలు విడివడ్డై. ఆకాశ విమానాలమీద దొర్లుతున్నా నంటాడు. కళ్ళు తిరుగుతున్నై అంటాడు. నలుగురం పట్టుకొని మంచాన ఆదిమి పట్టి రాత్రి గడిపినాము.తర్వాత వారంరోజులకు గాబోలు పంతులు బాగుపడ్డది. గంధిగారి శరీరతత్వమెట్టిదో తమశరీర తత్త్వమెట్టిదో ఆయన ఆపప్పు ఎంతమోతాదు తినేవాడో మొదలయిన విషయాలేవీ గమనించకుండా,తన అభిరుచిని గుర్తించకుండా వేరు

శనగ పప్పుతిని అపంతులంత అవస్థపడ్డాడు. ఇటువంటి అనుభవాలు చాలాచూచే నేను, ఆహారవిషయంలో నా అభిరుచులకు కూడా విలువ ఉంచసాగించా.

* * *

వైశాఖపూర్ణిమ, సాయంకాలం మద్రాసు తిరువల్లి క్కేణి బీచి శిలకు ఘట్టంలో "తక్రానందస్వామి'గారు ఆహార విధానాన్ని గూర్చి తమఅపూర్వ పరిశోధనలను వెల్లడిస్తారని, వీరు కనిపెట్టిన ఆహార విధానం సర్వజన సమ్మతమై ఉన్నదని, కర్చు తక్కువ అనీ, సర్వ వ్యాధులను పోకడస్తుందనీ, పేపర్లలో ప్రకటనలను చూచి, 'తక్రానందస్వామి' అనే పేరునుబట్టి ఆ విధాన మేదో మజ్జిగతో సంబంధించి ఉంటుందని అనుమా నించదగి ఉండడంచేత, నాకు మజ్జిగ అత్యంత ప్రియమైనది కావడంచేత, కానీ చూతామని బీచికి వెళ్ళాను.

ఎత్తైన బల్లమీద కడవెడు మజ్జిగ, ఒకలోటా, ఉన్నది. తక్రానందస్వామిగారు నడుమనడుమ గ్రుక్కెడు గ్రుక్కెడు తేటనీరు మజ్జిగను ఆరగిస్తూ దాని మహిమనుగూర్చి ఉపన్యసిస్తున్నారు.

తక్రానందస్వామిగారి వయస్సు ఇంచుచుమించుగా ముప్పదియైదు నలువది యేండ్లుండును. రవీంద్రనాథ ఠకూరుగారువలె ఆయన సానిటోజన్ మొదలయిన విలువగల వైదేశి కాహారములు తీసికోని వాడయినను, ముఖచ్ఛాయ, మిసిమి ఠాగూరును బోలియుండెను. మంచి మంచి కేశవర్థక తైలములు తడవి సంరక్షింవ బడ కున్నను స్వాములవారి గడ్డమీసములు, ఠగూరు గారి గడ్డము మీసముల మీఱియున్నవిగాని అంటొక్క వెండ్రుకైన నరయలేదు. అరవిందఘోషమహర్షివలె ధూమపానాద్యుత్తేజక పదార్థసేవ లేకున్నను, స్వాముల వారి చూడ్కులు మంచి తేజస్వంతములుగా నున్నవి. లవణానందస్వామి శరీరారోగ్యము గంధిమహాత్ముని మనోబలము, ఆయనయందు వ్యక్తమవుచుండెను.

అయన స్వరూపము ప్రేక్షకుల చిత్తముల నాకర్షించు నదిగా నుండెను. అంతకంటె, ఆ వేసవికాలమున అయన దగ్గర కడవలో నింపబడియున్న నీరుమజ్జిగ మరియు జనాకర్షముగా నుండెను.

* * *

సహోదరులారా! పసితనమునందే నేనీ ఆహారా ద్వైత విధానమును భగవదనుగ్రహమువల్ల గుర్తింప గలిగినాను. మాతల్లిదండ్రులు, బహుసంపన్నులు. పాలుమీగడలతో పెరుగుతో, ఇంకా ఇతర మధుర పదార్థములతో నాకు ఆహారము పెట్టేవారు.అవి నాకు ఏమాత్రము సరిపడేవిగావు పండ్రెండేళ్ళ యీడువరకు అనుచితాహారమువలని అనారోగ్యముతోనే నేను బాధ పడుచుంటిని. మఱియునాకు గృహస్థ ధర్మముమీద, రాగభోగాదులమీద ఆ వయస్సుననే విరక్తి మితిమీఱి ఏర్పడెను శరీరానారోగ్యము తీవ్రముగా ఉండెను. ఒక వేసగికాలమున త్రోవనేగుచు దప్పివాని నేనొక చలిపందిరిలో నీరుమజ్జిగ పానీయమును ద్రాగితిని. ఆనాడు నాయారోగ్యమెంతో అనుకూలముగానుండెను. దినదినమున నే నాచలిపందిరి కేగి నీరుమజ్జిగ త్రాగు చుంటిని. వారము రోజులకే నా యనారోగ్యమెల్ల తొలగెను. ఒక నెలకే నే నితరాహారపదార్థముల నన్నింటిని వర్జించి నీరు మజ్జిగ మాత్రమే యాహార ముగా గైకొన గల్గితిని. అప్పటినుండియు నాయా రోగ్యము చెక్కు చెదరకుండెను

గోగర్భము, భూగర్భము, అతి పవిత్రమయినవి.

గోగర్భమునుండి లభించిన క్షీరము మిక్కిలి పవిత్రమయినవి. కాని అందుమీగడ కొంత యనారోగ్య జనకము. కావున అది వర్జింపదగినది. ఆవుపాలను చక్కగాకాచి, తోడు పెట్టి భూగర్భమందలి ఊటనూతి మంచినీరుపోసి చిలికి మజ్జిగచేసి, వెన్నను తొలగించి, నీరుమజ్జిగగా చేయునది. ఒక పూట పులియనిచ్చునది. ఇంగువ, జీలకర్ర, ఉప్పు, శొంఠిపొడి. కరివేపాకు

పీనినిగూడ కొంచెము చేర్చునది. ఈలా తయారుచేసిన పానీయము మిక్కిలి యారోగ్యప్రదమైనది. ఇతరాహారములేమియు గైకొన నక్కరలేదు. నేను ముప్పది యేండ్లుగా నీపానీయముతోనే చెక్కుచెదరని యారోగ్యముగలిగి మంచి మనశ్శక్తి గలిగి జీవించుచున్నాను. (అని యాయన లోటా నీరుమజ్జిగ త్రాగెను.) సోదరులారా! మీరును రుచిచూడవచ్చును. ఇదిగో త్రాగి చూడుడు, అనుచుండగా ఒక్క పెట్టున నలుగురైదుగురు చేరబోయి, ఆపానీయము నారగించిరి. వేసవికాలము, వైశాఖపూర్ణిమ. అప్పడు ఆపానీయమెవ్వరికి ప్రియముకాకుండును తోడనే గొల్లుమని ముప్పది నలువది మంది రేగి ఆ కడవమీదికి దూకిరి. ఆపానీయమును వారు త్రాగ గల్గిరో లేదోకాని, ఆకడవ పెంకులు, దూరానకూర్చున్న నామీదికి వచ్చి పడినవి. అల్లకల్లోల మెక్కువైనది.

నామనసు కోనూ చీకాకెక్కువైంది. చెన్నపట్నంలో తగినంత ధనసంపత్తి లేకపోతే మంచియిల్లు, మంచి భోజనం దొరకదు. సన్నకారు సంపారులకు మురికి గొంది కొంపలు. మురికినెయ్యి (ఇటీవల నెయ్యే దొరకడంలేదు. మారువా అనే వేరుసెనగ నెయ్యే.) నిస్సారపు మరబియ్యం ఇటువంటి పనికిమాలిన తిప్పతిని అడుగడుక్కూ అనారోగ్యపడడంకంటె శుభ్రంగా అవన్నీ మానివేసి, తేటమజ్జిగతోనే జీవయాత్ర గడప సాధ్యమైతే ఇదే ఆరోగ్య ప్రదమైతే ఇంతకంటె సుఖోపాయం ఇంకేముంటుంది? వట్టినీటిమజ్జిగకు జీవనాధారమైన శక్తినిచ్చే సామర్థ్యంకలదా? నాలుగు రోజులు తాగేటప్పటికి, జలుబో జ్వరమో సాగించి ఉన్న గోడుకూడా ఊడ్చిపెట్టుకు పోతుందేమో! ఈ చింతరేగి ఏమిచేయడానికి తోచదయ్యేను.

సభ చెదరిపోయింది. వ్యాకుల మనస్సుతో నేను చల్లదనంకోసం సముద్రతరంగాల దరికి వెళ్ళితిని. అప్పుడే సముద్రగర్భమునుండి పూర్ణచంద్రబింబము పొడముతున్నది. ఆదృశ్యము నేత్రానందమై శరీరము మరపిస్తున్నది. హృదయ సముద్రములో యోచనలు శిలాపాతములవలె లోతులోతుకు పోతున్నై. ఇంచుక నిమీలిత నేత్రుడయితిని. బయటజూచిన సముద్రము చంద్రోదయము నాలోనే కానవచ్చెను. చంద్రబింబములోనుండి యొక దివ్యజ్యోతి నాయోచించుచున్న విషయములకు బదులుపదేశించు చున్నట్లుగా నాకీ క్రింది విషయములు గోచరింప దొడగెను:-

ఓయీ! అద్వైతము సిద్ధాంతమయినను అది సృష్టిలో ప్రత్యక్షముకాలేదు. జాతిభేదములు, మతభేదములు, దేశభేదములు, కాలభేదములు, శరీరభేదములు, వస్తుభేదములు, వాని గుణభేదములు, ఇత్యాదిభేదములు ప్రకృతి కల్పితములు. ఈ ప్రకృతిని జయించిన పురుషుడుగాని యీభేదముల కతీతుడు కాజాలడు. నీకిప్పుడు చీకాకు గొల్పుచున్న యాహార విషయమునే చూచుకొనుము. నీకు బాల్యమున సరిపడిన యాహారము యౌవనమున సరిపడదు. ఆది వార్థకమున సరిపడదు. ఒక ఋతువులో సరిపడిన యాహార మింకొక ఋతువులో సరిపడదు. ఒక జాతికి సరిపడిన యాహారమింకొక జాతికి సరిపడదు. బ్రాహ్మణుని యాహారము శూద్రునికి, శూద్రుని యాహారము బ్రాహ్మణునికి సరిపడదు. ఒక దేశపు ఆహారమింకొక దేశముకు సరిపడదు. గోధుమరొట్టెలు మధుర భక్ష్యములు ఆహారించు మహారాష్ట్రులకు కారము ప్రధానముగాగల యాంధ్రభోజనము సరిపడదు. ఆంధ్రుల కామధుర భోజనము సరిపడదు. కృష్ణా, గుంటూరు, జిల్లాల తెలుగువా రారగించు గడ్డపెరుగును తంజావూర్ జిల్లా యరవవా రారగించిరేని మర్నాడే యామ జ్వరముతో మంచము పట్టుదురు. అరవవారి లొడలొడచారు ఆంధ్రులకు ఆపోవదు. బళ్ళారి జిల్లావారి జొన్నరొట్టెలను గోదావరి జిల్లావా రరిగించుకోజాలరు. ఆయాదేశముల శీతోష్ణస్థితులనుబట్టి అక్కడక్కడి ప్రజల పనిపాటులనుబట్టి యాహారభేదము లీశ్వరతంత్రమువలన నేర్పడినవి. ఇతర భేదములెల్ల నట్టె యుండగా ఒక్క యాహార భేదముమాత్ర మెట్లు తొలగిపోగలదు? రాగ

ద్వేష దూరుడై లోకవాసనల నడచుకొన్న విరాగి ఉప్పులేని చప్పిడితిండి తిని జీవితయాత్ర గడపగల్గును గాక! రాజభోగలాలసులై మహోన్నతోద్యోగములలో మెలగుచు నిరంతర మనఃపరిశ్రమను జరుపు లౌకికులు చప్పిడికూడు తిని శరీరశక్తిని సంరక్షించుకోజాలుదురా? ఇంతకును లోకప్రవృత్తి యల్పజ్ఞులయిన మానవ మాత్రుల చేతులలోనే ఉన్నదన్న యహంకారావేశమీ యవకతవకల కెక్కువ కారణమగుచున్నది. నిత్య సత్యమయిన యీశ్వర తత్త్వమొక్కటి సర్వత్ర స్వయంగుప్తమైయుండి ఈలోక తంత్రమునెల్ల నేవో పరమ ప్రయోజనము నుద్దేశించి, జీవులద్వారా జరపించుచున్నదన్న యెరుక లేకపోవడముచేత పై యహంకార మావేశించుచున్నది. ప్రతిమానవునిలోను గుప్తమై అవ్యక్తమై ఈశ్వరాంశమగు చైతన్యము జ్వలించుచున్నదిగాన సత్యజ్ఞానానందాభి రతుడై మానవు డంతరాత్మ రానాధించుచు తదుద్బోధముల గమనించుచు జీవితయాత్ర గడుపుకోదగును. తక్రా నందస్వామికి తక్రము ప్రియమై యాయన జీవిత యాత్ర కది చాలిన యాహారమై యుండుట యుక్తమే కాని యెల్లవరకు నది యట్లు సరిపడుననుట సరిగాదు. ఈ జన్మపు అభిరుచులకు పూర్వజన్మవాసనలు కారణ మవుచుండును. తక్రానందస్వామి తక్ర మాత్రాహారు డగుటకు పూర్వజన్మ సంస్కారము కారణము. అది వినుము:-

తక్రానందస్వామి పూర్వజన్మమున ఆంధ్రదేశమున నొక మహారాజై వెలసి ఉండెను. అతడు మహాభోగి. మహాత్యాగి. మహావిద్వాంసుడు. అఖండైశ్వర్య మనుభ వించువాడు. ఆతడు అనురూప, పరమసాధ్వి, అయిన సహధర్మచారిణి దుర్మరణము పాలగుటచే అతి ఖిన్నుడై ఐహిక జీవితమునే అసహ్యించుకొనెను. అల్పకాలముననే తన శరీరయాత్రను ముగించుకోగోరి యాతడు ఒడలెరుగని మధుపాన గోష్ఠిలోను, విలాసినీ వ్యాసంగములోను మునిగితేలుచు తన భార్యావియోగ దుఃఖము కెలకవేయనీకుండ వర్తింపదొడగెను. రేయుం బవళ్ళు శరీరభావము కలుగనీయ నంత తీవ్రముగా సారాయముల త్రాగుచు, పదులకొలది విలాసినీపురుషులను విలాసినీ స్త్రీలను తనగోష్ఠి నెడబాయనీయక ఆనందతాండవ మాడదొడగెను. ఆనాటి శ్రీకృష్ణ మూర్తి రాసక్రీడలు జలక్రీడలు నా మహారాజు విపర్యాస క్రీడల కీడురానివై యుండెను. ఈ యానంద తాండవముతో నా మహారాజును, గోష్ఠి వారును మహోన్నతములగు కొండలమీద, ప్రాసాద ములలో, కొలకులలో తమ స్వైరవిహారము లితరు లెరుగ వీలులేకుండ గొన్నాళ్ళు వర్తిల్లిరి. మహారాజు శరీరత్యాగము నపేక్షించిన వాడుగాన విపరీత విశృం ఖల వర్తనుడై యుండెను. అతిపానాతి విహారములచే నాయనకు తాపజ్వర మేర్పడెను. ఏనుగుమీద నెక్కి కొండలు దిగి తన రాజధానికి విచ్చేసెను. ప్రమద వనము చేరువ జ్వరాతిరేకముచే నేనుగుమీదనుండి క్రిందికి బడెను. జ్వరము మరియు ముమ్మరమయ్యెను. రాచనగరికి చేరెను. ఆస్థాన వైద్యులు వైద్యోప చారములు చేయగోరిరి. అంగీకరింపడయ్యెను. ఆస్థాన విద్వాంసుల బిలిచి యవసానకాలమున వర్తింపవలసిన తెరగు తెలుపుడని వేడెను. వారు "మహారాజా! కోరిక లేవియు గడమలేకుండ తీర్చుకొనవలసినది. భగవంతు నిపై చిత్తము నిలుపుకొనవలసినది" అనిరి. మహా రాజించుక కనుమూసి తనకోరిక ఏదోగుర్తించెను. అతిపానముచే గుండెలుమాడి జ్వరము మహాతాపము దుర్భరముగా నుండుటచే నాయన కప్పుడు నీరిమజ్జిగ మీద మనసుపారెను. ఇహలోకమున నా మహారాజు కాంక్షించునది నీరుమజ్జిగ యొక్కటి తప్ప వేరేదియు నప్పుడు లేదయ్యెను. తోడనే భృత్యుల కాజ్ఞాపించెను. వారు వెండిగంగాళమునిండ సొంటిపొడి జీలకఱ్ఱ ఏలకులు, ఉప్పు, నిమ్మపండ్లరసము కలిపి ప్రశస్త మైన నీరుమజ్జిగను తయారుచేసి కొనివచ్చిరి. లోటా తీరగా లోటాచొప్పున వారానీరుమజ్జిగ ముంచియిచ్చు చుండిరి. ఆప్యాయమానముగా మహారాజు త్రాగుచుం డెను. త్రాగినకొలది దప్పి హెచ్చుచుండెను. జ్వరము

హెచ్చుచుండెను. కడుపుబ్బుచుండెను. అరబిందెడో బిందెడో త్రాగునప్పటి కింకను తృష్ణాశేషముండగానే జీవితము నిశ్శేషమయ్యెను. మూతివంకరపోయెను శ్వాసము నిలిచిపోయెను.

సర్వభోగములను అనుభవించి సర్వవాంఛితములను తీర్చుకొన్న ఆమహారాజే నీరుమజ్జిగమీది తృష్ణాశేషముచే నిప్పుడిట్లు తక్రానందస్వామిగా జన్మించినాడు. ఈ జన్మమున నాతడు కోరదగినది నీరుమజ్జిగకంటే వేరేదియులేదు. పూర్వజన్మ సంస్కారమునుబట్టి అతనికి నీరు మజ్జిగ ప్రియమయినదిగాని యదియే యెల్లరకు నెట్లు ప్రియమగును? ఎవరెవరేయే సంస్కారములతో నిహమున జన్మమందిరో ఆయా సంస్కారముల కనుకూలమయిన యాహార విహారములుగలవా రగుదురు. ఆరోగ్యానారోగ్యములు; సుఖదుఃఖములు ఒక్క యాహారవిధానము మీదనే యాధారపడియుండలేదు. నీ విందునుగూర్చి యధికముగా చింతపడవలదు. నిర్మల చిత్తముతో అంతరాత్మ నారాధించుచు, అంతరాత్మ ప్రేరితములయిన యభిరుచుల ననుసరించి దేశ కాల కుల వయస్సౌలభ్యాది ధర్మముల కనుకూలమయిన ఆహారమును గ్రైకొనుచుందువుగాక! సర్వలోకము ఒక్క సూత్రమున బద్ధమై నిలువదగిన కాలమింకను రాలేదు.

పైయుద్బోధము నందుకొన్న యానందముచే నుప్పొంగి యీ యాంతరజ్యోతికి నేనేదో విధేయతాభివాదోక్తులను పలుకబూనితిని. నా ప్రక్కనే నిద్రింపక నన్నుపరిచయించుచు కాచుకొనియున్న నామిత్రుడు తాతాచార్లుగారు నాచేతి నాడిని పరీక్షించుచు జ్వరోద్రేకముచే తబ్బిబ్బు మాటలాడు చున్నాడు. జ్వరము నూటనాలుగు డిగ్రీలకు తక్కువుండదు అనుచుండెను.

కన్నుదెరచి చూతునుగదా అది మాయిల్లు, రాత్రి రెండుగంట లప్పుడే టక్కు టక్కుమని మ్రోగెను వారమురోజులనుండి తీవ్రమయిన జ్వరముచే నేను బాధపడుచుంటిని. నాటిరాత్రి యాహార నియమమును గూర్చి నామిత్రుడు నేను కొంత యేమోమో చర్చించుకొంటిమి. జ్వరోద్రేకములో తత్సంబంధమగు కథాప్రపంచమే సృజింపబడెను మెలకువ కలిగిన పిదప పైకథా సృష్టినెల్ల మిత్రునకు దెలిపితిని.

నాజ్వరమునకు మామూలు ఆహారము కొన్నాళ్ళనుండి మాని, కొబ్బరికాయలు మొదలుగా అపక్వాహారము నారగింప నారంభించుటచే కలిగియుండ వచ్చునని, తర్వాత ననుమానించి క్రమముగా మామూలు తిండికి తిరిగితిని. ఆరోగ్యమును మామూలు త్రోవకు దిరిగెను.



